# తెలుగు భాషా వికాసం

(భాషాశాస్త్ర వ్యాస సంపుటి)

(పి.జి., మరియు యు.పి.యస్.సి.
తెలుగు పాఠ్యాంశాల ఆధారంగా పేపర్ - 1)

గ్రంథకర్త
విద్వాన్ కసిరెడ్డి వెంకటపతిరెడ్డి

కె.వి.ఆర్. పబ్లికేషన్స్
మధురానగర్, హైదరాబాదు

# ముందుమాట

గత సంవత్సరం నేను కేంద్ర, రాష్ట్ర పోటీ పరీక్షలకు నిర్ణీతమైన తెలుగు పాఠ్యాంశాలపై పేపర్-II కు వస్తువుగా "**సాహితీ సౌరభాలు**" ప్రచురించాను. తర్వాత పి.జి. మరియు పోటీ పరీక్షల అభ్యర్థుల నుండి వచ్చిన ఒత్తిడి ఫలితంగా పేపర్-I కు ఉద్దిష్టమైన "తెలుగుభాషా వికాసం" వెలుగుచూస్తోంది. అందరికి సుబోధంగా ఉండాలని ఆశించి, ఈ గ్రంథాల్ని శిష్టవ్యావహారికశైలిలో రచించడం జరిగింది. నేటి జనజీవన స్రవంతిలో ప్రవాహిగా సాగుతోంది శిష్టవ్యావహారికం.

ఒకప్పుడు కేంద్ర, రాష్ట్ర పోటీ పరీక్షలకి అభ్యర్థుల్ని సుశిక్షితుల్ని చేసిన అనుభవాలు ప్రాతిపదికగా రూపుదిద్దుకున్న రచనలివి. నా పరిశ్రమకు తార్కాణాలైన ఇవి కేవలం వ్రాతప్రతులుగానే ఉండిపోరాదని, భావితరాలకు దిక్సూచిగా ఉపయోగపడాలని మీ ముందుంచాను. నా ప్రయత్నం ఏ మేరకు నెరవేరిందో నిర్ణయించవలసింది మీరే.

నా ఆశయానికి ఊతగా ఈ గ్రంథాన్ని వెలుగులోకి తేవడానికి ఆర్థిక సహాయ మందించిన గౌతమీ విద్యా సంస్థల సంచాలకులు, వదాన్యులు శ్రీ బి. శివకుమార్ రెడ్డిగారికి హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

ఈ గ్రంథాన్ని సాంతం ఓపికతో చదివి, ఎడనెడ నా సందేహాల్ని తీర్చిన ఉస్మానియా మహిళా కళాశాల తెలుగు శాఖ ఆచార్యులు డా|| కసిరెడ్డి వెంకటరెడ్డి గారికి మరియు డా|| కుసుమ గారికి కృతజ్ఞతాభినందనాలు.

ఈ కృతి వ్యాసాలవల్ల ప్రభావితుడై, వీటిని ముద్రించటానికి నన్ను మిక్కిలి ప్రోత్సహించిన నా కుమారుడు చి॥ కె.వి.రాజేంద్రనాథరెడ్డి I.P.S. కి శుభాశీ:పరంపరలు.

పోతే సకాలంలో డి.టి.పి. చేయించి ఇచ్చిన చిత్రకారులు శ్రీ మోకా వెంకటేశ్వరరావుగారికి, అందంగా ముద్రించి ఇచ్చిన గాయత్రి ప్రింటర్స్ అధినేత శ్రీ మద్దూరి గోపాలకృష్ణమూర్తిగారికి, వారి సిబ్బందికి ధన్యవాదాలు.

మకాం: మధురానగర్
హైదరాబాద్

ఇట్లు
సుధీ విధేయ
**విద్వాన్, కసిరెడ్డి**

# అంకితం

విద్యారంగ విప్లవజ్యోతి, వదాన్యులు,

మాన్యశ్రీ బి. శివకుమారరెడ్డి గారికి ఈ కృతి అంకితం.



## విషయసూచిక

# 1. ఆంధ్రము, తెనుగు, తెలుగు - జాతి, దేశ, భాషా పర్యాయపదాలు

మన భాషకు 'ఆంధ్రం, తెనుగు, తెలుగు' అనే మూడుపేర్లు వ్యవహారంలో స్థిరపడ్డాయి. సంస్కృత భాషా గ్రంథాల్లో 'అంధ్ర' శబ్దం ఆంధ్రకు రూపాంతరంగా కన్పిస్తుంది. తెలుగు గ్రంథాల్లో తెనుంగు, తెనుగు, తెలుంగు, తెలుగు, త్రిలింగ అనే పదాలు భాషాపరమైన ప్రయోగాలుగా కన్పిస్తాయి. తమిళంలో తెలుగు భాషని 'వడగు- వడుగు' అని పిలుస్తారు. పోర్చుగీసువారు తెలుగు వారిని జెంతియ' (Gentio) అని, తెలుగు భాషని 'జెంతూ' (Gentoo) అని 16, 17 శతాబ్దాలలో పేర్కొన్నారు. ఏదియేమైనా మనభాషని అంధ్ర, ఆంధ్ర, తెనుంగు, తెనుగు, తెలుంగు, తెలుగు, త్రిలింగ, వడగు, వడుగు, జెంతూ అని పిలవటం పరిపాటి. ఈ పదాలన్నీ సమానార్థకాలు.

1. అంధ్ర - ఆంధ్ర :- ఈ రెండు రూపాలు సంస్కృత పదాలు. అతి ప్రాచీన కాలంలో ఈ రెండూ జాతిపరంగా ప్రయోగించబడ్డాయి. శునశ్శేపుణ్ణి తమ పెద్దన్నగా గుర్తించడానికి నిరాకరించిన మొదటి యాభైమంది కుమారుల్ని విశ్వామిత్రుడు అనార్యజాతులైన ఆంధ్ర, పుండ్ర, శబర, పుళింద, మూతిబాది దస్యుల్లో కలిసి పొండని శపించినట్లు ఐతరేయ బ్రాహ్మణంలో (క్రీ.శ. 800) ఒక కథ ఉంది. ఆంధ్రశబ్దం మొట్టమొదట ఇక్కడే ప్రయోగింపబడినట్లు విశదమవు తుంది. మ్లేచ్ఛులైన ఈ అయిదు జాతులు ఆర్యావర్త సరిహద్దు ప్రాంతాల్లో అనాడు నివసిస్తున్న ద్రావిడులుగాని 'ముండా' ప్రజలుగాని కావచ్చు. ఆర్యులు భారతదేశానికి ఎత్తివచ్చిన జాతులని, ద్రావిడులు, ముండాలు పూర్వం నుండి ఇక్కడ స్థిరనివాసమున్న స్థానికులని చరిత్ర పరిశోధకుల అభిప్రాయం. కావున ఆంధ్రులు అనార్యులైన ద్రావిడుల్లో ఒక తెగయని అభిప్రాయపడ్డారు.

ఆంధ్రుల ప్రస్తావన వ్యాసభారతంలో ఉంది. మయసభలో అంగ, వంగ, పుండ్ర, పాండ్య, ఓఢ్ర, ఆంధ్ర రాజన్యులు ధర్మరాజుని కొలిచినట్లు వర్ణింపబడింది. మనుస్మృతిలో కారావరవ స్త్రీకి, వైదేహునికి పుట్టిన నిషాదులు 'ఆంధ్రులు' అని ఉంది. నాట్యశాస్త్రంలో భరతుడు పాత్రోచితభాషని గూర్చి చర్చిస్తూ బర్బర, కిరాత, ఆంధ్ర, ద్రమిళ జాతులకు శౌరసేని వంటి ప్రాకృత భాషలు వాడరాదని చెప్పాడు. ఆంధ్రపురాణంలో ఆంధ్రరాజుల మరియు వారి భృత్యుల పేర్లు వివరించబడ్డాయి. ఆంధ్రభృత్యులే శాతవాహన రాజులు. సంస్కృత భాగవతంలో శ్రీశుకుడు హరిస్తుతి

గావిస్తూ 'ఆంధ్రుల్ని' పేర్కొన్నాడు. గ్రీకు రాయబారి మెగస్తనీసు మౌర్యుల తర్వాత ఆంధ్రులు చెప్పకోదగ్గ చతురంగబలం గలవారని ప్రశంసించాడు. అశోకుని శాసనాల్లో ఆంధ్రుల ప్రస్తావన ఉంది. 'కువలయమాల' అనే ప్రాకృత గ్రంథంలో ఉద్యోతనుడు 'ఆంధ్రులు అందమైనవారని, ఆహార విహార ప్రియులని అభివర్ణించాడు. ఇలాగా ఆంధ్రశబ్దం ఐతరేయ బ్రాహ్మణకాలం నుంచి 'జాతివాచకంగా' గ్రంథస్థమైంది.

సంస్కృత వాఙ్మయంలో అంధక, ఆంధ్రక జాతుల ప్రశంస కూడా ఉంది. వ్యాస భారతంలో ద్రౌపదీ స్వయంవరానికి 'అంధకులు' వచ్చినట్లు వర్ణింపబడింది. పాండవులు వనవాసానికేగుతున్నప్పడు భోజాది వీరుల్లో 'అంధకులు' కూడా ఉన్నారు. భాగవతంలో 'అంధకులు' యాదవజాతి వారని కలదు. రాజసూయ యాగ సందర్భంలో ధర్మరాజుని సేవింప వచ్చినవారిలో ఓడ్ర, చోళ ద్రావిడులతోపాటు ఆంధ్రకులున్నట్లు మహాభారతంలో ఉంది. కురుక్షేత్ర యుద్ధంలో కూడ వారు పాలుపంచుకున్నారు. శాంతిపర్వంలో భీష్ముడు దక్షిణాపథంలో జన్మించిన పుళింద, శబరాది జాతుల్లో 'ఆంధ్రకులు' ఒకరని పేర్కొన్నాడు.

అంధ్ర, ఆంధ్ర, అంధక, ఆంధ్రక పదాలన్నీ ఏకజాతి వాచకాలని తెలుస్తున్నది. నేటికి కూడ బీహారు ప్రాంతంలో 'అంధ' అనే ఒక జాతి ఉంది, 'అంధ' యొక్క ప్రాకృత రూపాంతరమే 'అంధక' మనీ, దాని సంస్కృత రూపమే అంధ్ర లేక ఆంధ్ర అని 'బరో' (T. Burrow) అభిప్రాయపడ్డాడు. ఆంధ్రులు అనార్యులు. ఆర్యుల ధాటికాగలేక వీరు దక్షిణాపథానికి తరలివచ్చి రాజ్యాన్ని స్థాపించుకొని ఈ ప్రాంత ప్రజలతో కలిసి ఉండవచ్చని అర్థం అవుతున్నది. ఈ పాలకుల పేరే తర్వాత వారి దేశానికి, ప్రజలకు, భాషకు సంక్రమించి ఉండవచ్చు.

**2) ఆంధ్రశబ్దం దేశవాచకం :-** జాతివాచకంగానేగాక దేశవాచకంగా కూడ సంస్కృత వాఙ్మయంలో కన్పిస్తుంది. వాల్మీకి రామాయణంలో సీతాన్వేషకులుగా వానరుల్ని పంపిన సుగ్రీవుడు అంధ్ర, పుండ్ర, చోళ పాండ్యాది దేశాల్ని గాలించమని ఆదేశించాడు. దక్షిణ దిగ్విజయ యాత్రా సందర్భంలో సహదేవుడు జయించిన రాజ్యాల్లో ఆంధ్రదేశ మున్నట్లు వ్యాసభారతం సాక్ష్యమిస్తున్నది. భాగవతంలో బలికుమారుల్లో ఆంధ్రుడనేవాడు ఆంధ్ర రాజ్యాన్ని స్థాపించిన ప్రశంస ఉంది. బౌద్ధ వాఙ్మయంలో అంధరట్ఠ (ఆంధ్రరాష్ట్రం) అనేపదం ఆంధ్రదేశాన్ని సూచిస్తుంది. శివస్కందవర్మ మైదవోలు శాసనంలో (క్రీ.శ. 234)

'అంధా పథియగామో వరిపరమ్' అనే భాగాన్నిబట్టి ఆంధ్రపదం దేశవాచకమని తోస్తుంది. నందివర్మ దానశాసనంలో (క్రీ.శ. 340) 'ఆంధ్రమండలే ద్వాదశ సహస్రగ్రామ సంపాదిత సప్తార్ధలక్ష విషయాధిపతే' అన్నవాక్యంలోని ఆంధ్రశబ్దం కూడ దేశవాచకమే. ఇలా అనేక గ్రంథాల్లో, శాసనాల్లో ఉన్న ఈ ఆంధ్రపదం మొదట జాతి వాచకమై తర్వాత దేశ వాచకంగా పరిణతి చెందిందని విశదమవుతుంది.

**3. ఆంధ్రశబ్దం భాషావాచికం :-** క్రీ.శ. 11వ శతాబ్దానికి ముందు సంస్కృత భాషలో 'ఆంధ్ర' శబ్దం భాషా వాచకంగా కన్పించదు. భరతుని నాట్యశాస్త్రంలోని ఏడు 'విభాషలు' అనే జాబితాలో 'ఆంధ్ర' ఉంది. నన్నయభట్టు రచించిన నందంపూడి శాసనంలో ఆంధ్రశబ్దం భాషావాచికంగా మొట్టమొదట ప్రత్యక్షమౌతుంది. ఇందులో నారాయణభట్టును ''యస్సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచికాంధ్ర భాషాకవి రాజశేఖర ఇతిప్రథితః'' అని నన్నయ ప్రశంసించి ఉన్నాడు. దీన్నిబట్టి ఆంధ్రపదం 11వ శతాబ్దానికి భాషాపరంగా రూఢికెక్కిందన వచ్చు. 'ఆంధ్రశబ్ద చింతామణి' నన్నయ రచించిన వ్యాకరణమని అంగీకరిస్తే, మొదట ఈ ఆంధ్రశబ్దం 'గ్రంథనామంలోకి ఎక్కిందన వచ్చు. ఆంధ్రభాషా భూషణకర్త కేతన తన గ్రంథానికి ఆంధ్రశబ్దాన్ని వాడడమేగాక గ్రంథమధ్యంలో కూడ ఈ ఆంధ్ర పదాన్ని వాడాడు. ఈ విధంగా మొదట జాతి వాచకమై తర్వాత దేశ బోధకమై, అటుతర్వాత భాషావాచిగా ఆంధ్రపదం వ్యాప్తిలోకి వచ్చిందని నిర్ణయించవచ్చు.

**4. తెనుంగు - తెనుగు, తెలుంగు, తెలు(గు - తెలుగు :-**

'తెనుంగు - తెనుగు' ఈ రెండు రూపాలు భాషాపరంగా నన్నయ్య ఆంధ్రభారతంలో మొట్టమొదట గ్రంథస్థమయ్యాయి. నన్నయ 'తెనుంగు' అనే పదాన్ని వాడిన పద్యం-

ఎ) ''సారమతింగవీంద్రులు...............

తెనుంగునన్ మహాభారత''

బి) 'తెనుగు' పదాన్ని వాడిన పద్యం

జననుత కృష్ణద్వైపాయన

.....................................

దెనుగున రచియింపు మధికధీ యుక్తిమెయిన్''

నన్నెచోడకవి కూడ తన కుమార సంభవంలో తెనుంగు పదాన్ని వాడినాడు.

ఉదా 1) తెనుంగున నిలిపిరి

2) సరళముగాగ భావములు జానుదెనుంగున

పై ఇద్దరు కవులు 'తెలుంగు, తెలుగు' పదాల్ని ప్రయోగించలేదు. పాల్కుర్కి సోమన మాత్రం తెనుంగు, తెలుగు పదాలు రెండింటిని ప్రయోగించాడు.

తిక్కన నిర్వచనోత్తర రామాయణంలో 'తెలుగు కవిత్వము', 'తెలుగుబడి', భారతావతారిక తెనుంగు బాస' అని ప్రయోగించాడు. తెలుంగు, తెలుగు రూపాలు తెనుంగు, తెనుగుల వలె రూపాంతరాలు. క్రీ.శ. 3వ శతాబ్దం నుండి వీటిప్రయోగం భాషాపరంగా కావ్యాల్లో కన్పిస్తుంది.

భాషావాచియైన తెనుగు, తెలుగు అనే రెండు పదాలు భిన్నపదాలా లేక ధ్వని మార్పులవల్ల ఏర్పడ్డ రూపాంతరాలా అనేది.విమర్శ చేయదగ్గ అంశం.

**5) తెనుగు :-** ఇది తద్భవమని 'త్రినగ' శబ్దం నుండి పుట్టిందని కొందరన్నారు. ఇది కేవలం ఊహ మాత్రమే. 'తెనుంగు' దేశ్యపదమని 'దిగ్వాచి'యని గంటి జోగి సోమయాజి అన్నారు. 'తెన్' శబ్దానికి దిక్కు అని అర్ధము నేటి వ్యవహారంలో అంతరించింది, తెమ్మెర, తెన్నేరు, టెంకాయ, తెన్ను మొదలైన పదాల్లో 'తెన్' నిలిచే ఉంది. ఒక ప్రాంతంవారు వేరొక ప్రాంతంవారిని సూచించవలసి వచ్చినప్పుడు తూర్పుదిక్కు వారని, పడమటిదిక్కు వారని, దాక్షిణాత్యులని, ఔత్తరాహులని పిలువటం పరిపాటి. ప్రాచీన ద్రావిడ భాషా సమాజంలో దక్షిణ దిక్కున ఉన్నవారిని 'తెన్' శబ్దముతో 'తెనుంగ్' అని వాడియుండవచ్చు, అదే భాషావాచి అయ్యుండవచ్చు.

**6. తెలుగు :-** ఈ పదం సంస్కృత భాషలో ఎక్కడా లేదు. శ్రీశైల దాక్షారామ కాళేశ్వరాల్లోని శివలింగములవల్ల తెలుగుదేశానికి 'త్రిలింగ'మనే పేరు ఏర్పడిందని విద్యానాథుడు తన ప్రతాప రుద్రీయ గ్రంథంలో తెల్పాడు. విన్నకోట పెద్దన (క్రీ.శ. 14వ శతాబ్దం) ఆంధ్రదేశానికి త్రిలింగదేశమనే పేరున్నట్లు చెప్పాడు. తెలుగు 'త్రిలింగ శబ్దభవమైనట్లు కావ్యాలంకార చూడామణిలో ఉంది.

ధర శ్రీ పర్వత కాళే
శ్వర దాక్షారామ సంజ్ఞ వఱలు త్రిలింగా
కరమగుట నంధ్రదేశం
బరుదార ద్రిలింగ దేశమన జనుకృతులన్
తత్త్రిలింగ పదము తద్భవంబగుటచే
దెలుగు దేశమనగ తేటపడియె
వెనుక దెనుగు దేశమును నంద్రు కొందఱ

ద్బాస పంచగతుల బరగుచుండు

తెలుగు త్రిలింగ శబ్ద భవంగాదని, తెలుగు యొక్క సంస్కృతీకృత రూపమే త్రిలింగమని కొమర్రాజు లక్ష్మణరావుగారు నిరూపించారు.

తెలుగు 'త్రికలింగ' శబ్దభవమని అది త్రికళింగ తి అలింగ తెలింగ తెలుంగుగా మారిందని గంటి సోమయాజులన్నారు. దీనికి సరియైన ఆధారాలు లేవు.

తెనుగు, తెలుగు రూపాంతరాలేగాని వేరుగావు. ద్రావిడ భాషలలో న/ల వినిమయం - ణ - ళ, న ల, లు గాను మారిన సందర్భాలు కోకొల్లలు. ఈ మార్పు మూల ద్రావిడంలోనే జరిగిందని భద్రిరాజుగారన్నారు. మునగ - ములగ. జన్మ, జలమ, లేదు-నేదు, లాగు - నాగు ఇలా ఉచ్చరించటం తెలుగులో కద్దు. దీన్నిబట్టి ఈ రెండు తెలుగు-తెనుగు రూపాలు ప్రాచీనకాలం నుండి తెలుగులో వాడుకలో ఉన్నాయని అర్ధమవుతున్నది.

**ఉపసంహారం :-**

1) ఆంధ్రులు ఆర్య-అనార్య మిశ్రజాతి. వీరు ఉత్తరార్యావర్తం నుండి దక్షిణాపథానికి వచ్చి గోదావరి ప్రాంతంలో రాజ్యాన్ని స్థాపించుకొని అక్కడి ప్రజలతో కలిసిపోయారు.

2) జాతి వాచకమ్మైన ఆంధ్రశబ్దం క్రమంగా దేశ వాచకంగానూ, భాషా వాచకంగానూ రూఢిలోకి వచ్చింది.

3) తెనుగు దేశ్యమ్మైన దిగ్వాచి.

4) తెలుగు శబ్దం 'తెనుగు శబ్దానికి రూపాంతరమేగాని త్రిలింగ శబ్ద భవం గాదు.

నేడు ఆంధ్రం, తెనుగు-తెలుగు మూడు సమానార్థకాలు. ఈ మూడు జాతి - దేశ - భాషా వాచకాలుగా ప్రయోగంలో ఉన్నాయి.



# 2. ప్రాఙ్నన్నయ యుగంలో శాసనభాషా పరిణామం

(క్రీ. పూ. ౨౦౦ క్రీ.శ. ౧౧౦౦)

క్రీ పూ. 200ల నుండి క్రీశ. 11వ శతాబ్దం వరకుగల 269 శిలాతామ్ర శాసనాలలో 187 తెలుగువే. తక్కినవి ఆంధ్రభాషేతర శాసనాలు. వీటిలో సంస్కృత ప్రాకృత శాసనాలున్నాయి. వ్యక్తినామాలు, గ్రామానామాలు కన్పిస్తాయి. పూర్తిగా తెలుగుభాషలోనే వేయబడ్డ శాసనం క్రీశ.575 నాటిది.

పులుమావి జంగ్లిగుండు శాసనంలోని 'వేపూరు',
శివస్కందవర్మ మైదవోలు శాసనంలోని 'విరిపఱ',
అత్తివర్మ గోరంట్ల శాసనంలోని 'తాంటికొంట, అక్కిఙ్జ వేనిఙ్జ,
శాలంకాయన నందివర్మ పెదవేగి
శాసనంలోని 'వేంగీపుర' కమ్మురాఙ్ట్రరువు, చెఙ్ట్రరువు

ఈ మొదలైన వ్యక్తి స్థల గ్రామ నామాలు సంస్కృత ప్రాకృత శాసనాలలో కన్పించే తెలుగు పదాలే.

ఇదే యుగంలోని కొన్ని ప్రాకృత శాసనాలలో పీలు + అ = పిల్ల, పాడివ్వ, అత్త, పోట్టం, కరణి మొదలైన తెలుగు పదాలు కన్పిస్తాయి. అనంతర కాలంలో వీటిని 'శాబకం, పశు, ఉదరం మొదలైన సంస్కృత పదాలుగా మార్చుచేయటం జరిగింది. వీటినిబట్టి క్రీ.పూ. ౨వ శతాబ్దానికే తెలుగుభాష యొక్క అస్తిత్వం ధృవపడింది.

**౧) లిపి :-** క్రీ.పూ. ౨౦౦ నాటి భట్టిప్రోలు శాసనం/ ద్రావిడీ శాఖకు చెందిన బ్రాహ్మీలిపిలో ఉంది. వీటిలో కొంతభాగం దేవనాగర లిపిలోను మిగిలింది తెలుగు, కన్నడ లిపిలోనూ ఉంది. వేగిచాళుక్య లిపిలో నాలుగున్నాయి.

ద-డలకు, ఱ-డలకు, ఱలకు, థ,న్థలకు లిపిలో సాన్నిహిత్యముండేది. ఈ, ఊలకు తప్ప ఇతరాచ్చులకు సాధారణంగా దీర్ఘత గుర్తింపబడేది గాదు. 'ఎ ఏ, ఒ ఓ'లకు హ్రస్వదీర్ఘ భేదం లిపిలోనే లేదు. ద్విత్వాక్షరాలకు బదులుగా ఒకే హల్లుని ఉపయోగించటం, మహాప్రాణాలకు ముందున్న అల్పప్రాణాల్ని వదలివేయటం, అనుస్వార చిహ్నంగా ఉన్న చుక్కని కాలక్రమంలో భిన్నస్థానాలకి మార్చటం వంటి అనేక ప్రత్యేకతలు ఆనాటి లిపిలో కన్పించేవి.

**2) లేఖన పద్ధతులు :-** రేఫ, బిందువుల తర్వాత ద్విరుక్త హల్లులు వ్రాయటం ఆనాటి లేఖన సంప్రదాయంగా ఉండేది. ఈ సంప్రదాయం ఆర్యభాషా సంప్రదాయం నుండి వచ్చింది.

ఉదా :- తూప్న , కాత్తి ్ యె,
గుంట్ల

౩) లేఖన దోషాలు :- శిల్పుల అజ్ఞానంవల్ల గల్గిన దోషాలు కొన్ని, అశ్రద్ధవల్ల గల్గినవి కొన్ని, శాసనకర్త భాషకు, శిల్ప భాషకూగల భేదాల్ని నిరూపించేవి కొన్ని లిఖిత వాగ్వ్యవహారాల మధ్య ఉన్న సంబంధాన్ని సూచించేవి కొన్ని, శాసన పాఠకుల అశ్రద్ధవల్ల కల్గిన దోషాలు కొన్ని - వెరసి నాల్గురకాల దోషాలు బయటపడ్డాయి.

| | | |
|---|---|---|
| శిల్పకృత దోషాలు | : | అగ్య (అగ్ర) |
| భాషామూలక సూచకాలు | : | ఎడ్లుకు (ఎడ్లకు) |
| ఉచ్చారణ సూచకాలు | : | గోత్ణ (గోత్ర), తళ్చ (తల్చి) |
| పాఠకకృత దోషాలు | : | ఒగోండు (ఒంగోడు), ఉత్తరయాన (ఉత్తరాయన) |

**4) వర్ణమాల** :- ప్రాచీనాంధ్ర భాషలో ౨౩ హల్లులూ, ౧౦ అచ్చులు ఉన్నట్లు తోస్తుంది. ఇది దేశ్యవర్ణమాల.

హల్లులు :- క గ జ, చ జ, ట డ ణ, త ద న, ప బ మ య, ర (ఱ) ల, ళ, వ, స, హ, (ఌ) వీటిలో ఱలు చారిత్రక కాలంలోనే వర్ణత్వాన్ని కోల్పోయినాయి.

అచ్చులు :- అ ఆ, ఇ ఈ, ఉ ఊ, ఎ ఏ, ఒ ఓ అనేవి అచ్చులు.

అయ్, అవ్‌లతో భేదకత్వంలేని ఐ, ఔలు ప్రత్యేక వర్ణాలుగావు. అరసున్న సంధిగతవర్ణం. ప ఞ్చన, పన్చిన అనే శబ్దాల్ని పోలిస్తే 'ఞ' కారం నకారానికి సవర్ణం. 'చ' కారం ఆనాటికుంది. నిండుసున్న వర్ణానునాసికాలకు పర్యాయమేగాని ప్రత్యేకవర్ణం కాదు.

సంస్కృతం నుండి దిగుమతియైన అచ్చులు, హల్లులు :-

అచ్చులు :- ఋ ౠ, ఌౡ- ఇందులో ఌ లకు పదప్రయోగమే లేదు. ౠకు కూడ ప్రయోగం లేదు. 'ఋ'ని రిగా పల్కారు.

హల్లులు :- ఖ, ఘ, ఛ, ధ ఠ ఢ, ఫ భ, శ, షలు

**5) వర్ణవ్యాప్తి** :- దీర్ఘాచ్చుమీద ద్విరుక్త హల్లుగాని, 'ఓ' తర్వాత సంయుక్త హల్లుగాని కన్పించవు. ఙ, ఞ, ట, డ, ణ, హ కారాలు పదాదినరావు. రేఫతో సంయుక్తమైన క, త, ద, ప, బ, మ, వ లు మాత్రమే పదాదిన కన్పిస్తాయి.

ఉదా :- క్రొచ్చె, ప్రచ్చిన, త్రోవ
క్ఱొచ్చె, ప్ఱోలనాణ్ము, ద్రోచె

గమనిక :- క, గ, చజ. టడణ, తదన, పబమ, యఱ, ల, ళ, వ, స లు అచ్చుల

మధ్య ద్విరుక్తంగాను, అద్విరుక్తంగాను కన్పిస్తాయి. ఇవిగాక ర, ఱ, హ లు అద్విరుక్తంగానే ఉండేవి.

6) తాలవ్యీకరణం :- త్వాలవ్యాచ్చులకు ముందున్న ప్రాచీన ద్రావిడ కకారం తెలుగులో చకారంగా మారటం సాధారణ లక్షణం.

ఉదా :- కమ్బురాఙ్ఱుృవు - చెఙ్రుృవు
కిరాత - చిలాత
కెయ్ :- కయ్ చెయి, చేయి
కిళిగళ్ - చిలుకలు
కెఱు - చెరువు

7) పదాది సరళాలు :- అసలు ప్రాచీన ద్రావిడంలోనే పదాదిన సరళాలు లేవని కాల్డ్వెల్, కె.వి.సుబ్బయ్య, భద్రిరాజులు చెప్పారు.

ముఖ్య విషయాలు ; —

ఎ) వర్ణ వ్యత్యయం :- వర్ణవ్యత్యయ కారణంగా అచ్ సంకోచం జరిగి గ జ డ ద వ, ·, ఱ లు పదాదిన కన్పిస్తాయి.

ఉదా :- దాని, వాన్ఱు, ఱేని, కోన, గారి, రెణ్ఱు

క్రీ.శ. 4, 5 శతాబ్దాలకే వర్ణవ్యత్యయం మరియు అచ్ సంకోచంవల్ల పదాది సంయుక్తాక్షరాలు కన్పిస్తాయి.

ఉదా :- ప్రచ్చిన, క్రొచ్చె, త్త్రోవ

క్రీ.శ. 6, 7, 8, 9 శతాబ్దాలకే పదాదిన య, వ లు ఉన్నాయి.

ఉదా :- యలమ్మ, వుద్దని

పదమధ్య 'గవ' లు : దణ్ణుగు, దణ్ణువు, నాలుగు, నాలువు

పదమధ్య ణకారం 'నకారం'

ఉదా :- పణి, పని అగుట :- ఆణతి, ఆనతి

సాధుశకట రేఫలు :- చెఙ్రువు - చెఙ్ఱువు

కమ్బురాఙ్ఱువు - కమ్బురాఙ్రువు

పదమధ్య లకలు :- మూల ద్రావిడ 'ళ' కారం క్రీ.శ. 7 వ శతాబ్దానికే లకారంగా మారింది.

ఉదా :- కళర్ - కలర్
తళవర - తలవర

పదమధ్య ఱ, డ లు

ఉదా:- చోఱ - చోడగా మారింది.

8) వర్ణసమీకరణం :- ప్రాచీనాంధ్రంలో వర్ణసమీకరణం కారణంగా అచ్చు మధ్యలో ద్విరుక్తమైన క, గ, చ, ట, డ, ణ, తదన, పబమ, య అ ల ళ వ స లు ఏర్పడ్డాయి.

ఉదా :- కొణ్ణ - కొన్న

పళ్ళి - పల్లి

బి) పదమధ్య అచ్చులోపంవల్ల అజ్మధ్యంలో సంయుక్తాక్షర మేర్పడింది.

ఉదా :- దివ్వియ - దివ్య

సి) తాణ్ణికొణ్డలోని ణకారం న్డ, ణ్డ, ణ్ణగా మార్పు చెందింది.

ఉదా :- తాణ్డికొండ - తాడికొండ

9) అచ్చుల హ్రస్వదీర్ఘతలు :- అర్థభేదంలేని కొన్ని మాటల్లో అచ్చుల మార్పు కల్గింది.

ఉదా :- ఎమ్బది - ఏమ్బది

జూవి - జువ్వి

10) అనుస్వారం :- పరుష సరళాలకు ముందు అనుస్వారం వాడటం ఆర్యభాషా ప్రభావంవల్ల వెలుగులోకి వచ్చింది.

ఉదా :- పణ్డూర - పండూర

పఞ్చిన - పంచిన

పణ్డరంగ - పండరంగ

దీర్ఘాంతం మీది నిండుసున్న

ఉదా :- కూంతు

11) సంధులు :- అకారలోపం, యడాగమం సంధి రూపాల్లో కన్పిస్తాయి.

అకార లోపానికి

ఉదా :- ఇడ్డట్లు

యడాగమానికి

ఉదా:- కలయన్త

విసంధికి

ఉదా :- పన్నస ఇరువది

గసడదవాదేశం :- 9, 11 శతాబ్దాలలో నిత్యంగాను, అంతకుపూర్వం వైకల్పికంగాను కన్పిస్తాయి.

ఉదా :- అణతిగాను, పణి సేసిన, ఏనువుట్లు

ద్రుతసంధి :- ద్రుతం మీద య, వ లు 7 వ శతాబ్దానికే ఉన్నాయి.

ఉదా :- విషయంబు యేళు పుద్దని, రట్టగుడియు

వైదుంబుళ చేతం వట్టం కట్టబడి

పదమధ్య సంధులు :-

ఉదా :- సంవృతాక్షరాలలో అకారం రకారంగా మారటం.

ఉదా :- పఞ్జెణ్డు – పండెంఢ్రు

**12) వచనము :-** క్రీ.శ. 11 వ శతాబ్దానికి శాసన భాషలో 1,882 విశేష్య పదాలు కన్పిస్తున్నాయి. వీటిలో దేశ్యాలు, తద్భవాలు, తత్సమాలున్నాయి. మహద్వాచక విశేష్యాలలో చాలావరకు లింగబోధక ప్రత్యయాలు లేవు.

ఉదా :- తలవరి, కమ్మరి వగైరాలు

అమహద్వాచకాలు :- ప్రథమా విభక్తి ప్రత్యయం లేనివి – కొన్ని ఉన్నవి.

ఉదా :- కోయిలము, ఇల్లు, నాగబు, దేశము

మహన్మహతీవాచకం :- దేవుర, మల్లుర, వేవురు

బహువచనాలలో పదమధ్యసంధి :-

ఉదా :- కోమట్లు, నంజుండ్లు, ఆచార్లు

**13) ప్రథమేతర విభక్తులు :-**

ద్వితీయా సపదాంశాలు :- న్, ను, నిం, మ్, ము లు,

ఉదా :- దీనన్, రడ్డిని,

తృతీయా సపదాంశాలు :- చేతన్, చేన్, తో, తోన, తోడ, తోడన్, తోఅన్ అనేవి ప్రత్యయాలు,

ఉదా :- నొఅంబితోటి కయ్యము, చోళులతోడ,

చతుర్థి :- దీన్ని, 'కి' (న్), కు (న్), కూ, క్ అనే పదాంశంతోను, పొంట్టె అనే అనుబంధంతో సూచించేవారు. సంప్రదాయ వ్యాకరణాలు దీన్ని షష్ఠీ ప్రత్యయంగా పరిగణించినా, ఆ అర్థంలో ప్రయోగం లేదు.

ఉదా :- చేనుకు, రాజులా కున్
పరోపకారంబు పొంట్టె

పంచమి :- ఈ క్రింది అనుబంధాలు మాత్రమే పంచమ్యర్థ సూచకాలు

ఉదా :- మిన్ద – మహిమిన్ద
మీన్ద – గుడిమీన్ద
కడ – భూపాదిత్యుల కడాన్
పై – భూసతిపై

షష్ఠీ :- దీనికి ప్రత్యేకమైన విభక్తి సూచకం కన్పించదు. ద్వితీయాది విభక్త్యంగమే షష్ఠీ విభక్తి సూచకంగా ఉండేది.

సప్తమి :- అ, (ం), అన్, న, అనేవి సప్తమీ పదాంశాలు.

అందు, ఒళన, లో (ం), లోన, లోపల, కోన అనేవి శాసనాలలో కన్పిస్తాయి.

ఉదా :- బెజవాడ్ - అం, అన్వయంబున.
ఆజిలోం, కయ్యంబుకోన.

(4) **సర్వనామాలు :-** నిర్మాణ క్రమాన్నిబట్టి సర్వనామాలను, విశేష్యాలను ఒక్కటిగానే భావించాలి. ఇవి త్రివిధాలు.

నిర్దేశ సర్వనామాలు :-

ఉదా :- వాన్టు, వాణ్డు, అతణ్డ్, అతని,
వీని, వీన్ణి, అది, ఆమె, వాడు

మొదలైన వి'శేషణాలు' ఈ రకానికి చెందినవే.

ఆత్మార్థక పురుష నామాలు :- తన, తాను, తాన్, తార్, తమ

ప్రశ్న వాచక సర్వనామాలు :- ఎవ్వణ్డ్, ఎవ్వర్.

(5) **సంఖ్యా వాచకాలు :-** నిర్మాణ క్రమాన్నిబట్టి సంఖ్యావాచకాలు విశేష్యాల వంటివే. ఇవి ప్రాథమిక, సార్వనామిక విశేషణాలని రెండురకాలు.

ఉదా :- ప్రథమ :- ఒకొటి, ఒణ్డు, ఒరుల్
ద్వితీయ :- రెణ్డు - ఇన్మడి - ఇరువది,
ఇరువురు, ఇను, ఇర, ఇరు
అనేవి రూపాంతరాలు
తృతీయ :- నాల్కు - నాలుగు - నాల్ -
ఉను - నల్వురు
పంచమ :- ఏను - ఈ ఒక్కరూపమే దొలికింది
షష్ఠి :- ఆఱు, అఱువది, ఆర్వ్వురు
సప్తమ :- ఏఱు - ఏడు. విశేషణ రూపం లేదు
అష్టమ :- ఎణ్బొది - ఎనుబోది, ఎణ్మ, ఎనిమిది
నవమ :- తొమ్మ, తోంభ అనేవి రూపాలు
దశమ :- పది - పదు- నున్ట, సమస్త శబ్దాల్లో దీనికి
అనేక రూపాలుండేవి.

ఉదా :- ఏ- బది పణ్డ్-రెణ్డు, పన్- దుంబు, ఎణ్- మ,
శత - నూర, నూఱు, నూట నూఱింటికి,
నూర్- వ్వురు, సహస్ర - వెయి,వేయు,
వే- ల్, వే- వురు, వేగురు - వేవు.

ఇవిగాక మరికొన్ని ప్రాకృతాది భాషల నుండి అరువు దెచ్చుకున్నవి కలవు.

ఉదా :- దువ, చౌ, బారస, పాతిక,
వంద, నవ, కోటి, సహస్ర శబ్దాలున్నాయి.

16. క్రియలు :- సామాన్య సంకీర్ణ సమస్త క్రియలు గలవు.

ఉదా :- వర్తమానంలో - ఏళుచ్ ఉన్తి
భవిష్యదర్థకంలో - నడపంగల
ప్రేరణార్థకంలో - కట్టి- ఇఙ్చ
నిశ్చయార్థకంలో - రక్షిన్వను

క్త్వార్థక క్రియలు:- వీటిని అసమాపక క్రియలంటాము

ఉదా :- అయ్ + ఇ-పొడుచ్చి
ఆత్మార్థకంలో - అటిసికొన్న

**17) తత్సమ - తద్భవాలు :-**

తత్సమాలు - అర్థవిపరిణామం :- వక్రమ్ము, కరణమ్, జీవితమ్ము
వ్యాకరణ విరుద్ధాలు - వనజనేత్రి - (వనజనేత్ర) ప్రధాని, మనోవల్లభ
మిశ్రమాలు - మొగమోడువ, గణ్డభైరవ
సర్వబోధ పరియారువు

**18) తద్ధిత ప్రత్యయాంతాలు :-** ఇవి నిష్పాదక ప్రత్యయాలు

ఉదా :- తల- వ్- అరి- తలవరి
పూజా- రి- పూజారి
రట్టడ్ + ఇకము- రట్టడికము

**19) కృత్ప్రత్యయాలు :-** ఇవి కూడ నిష్పాదకాలే - ఇవి విశేష్యాల్ని తయారు చేస్తాయి. మొత్తం ఏడు రకాలు.

ఉదా :- కూట- అము- న-
వాడ్- కలు-
డిగ్గ్- ఇలి
నంజుడ్- లు-
తూట్- పు
కొల్- వు- న్వన్
కావుకు-

ఇది స్థూలంగా ప్రాఙ్నన్నయ్య యుగంలో శాసన భాషాపరిణామం.



# 3. క్రీ.శ. 1100-1399 మధ్యకాలంలో శాసన భాషాపరిణామం

క్రీ.శ. 1100-1399 మధ్యకాలంలో తెలుగు శాసనాలు సుమారు 2వేలు ప్రచురితమైనాయి. ఈ యుగానికి సంబంధించిన తెలుగు భాషాపరిణామాన్ని తెలుసుకోవడానికి ఈ శాసనాలు చాలా ఉపకరిస్తాయి.

ఈ యుగంలోని వర్ణాలు (Phonemes)

**1. అచ్చులు :-** అ ఆ, ఇ ఈ, ఉ ఊ, ఎ ఏ, ఒ ఓ లు పది వర్ణాలు అచ్చులుగా కన్పిస్తాయి.

హల్లులు :- క ఖ, గ ఘ ఙ, చ జ ఝ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న, ప ఫ బ భ మ, య ర ఱ ల ళ వ, శ ష స హ అనే 33 హల్లులు.

Note :- ఈ యుగంలో కారం సందిగ్ధవర్ణంగా కన్పిస్తుంది. 'ఙ, ఞ'లు మకారానికి సవర్ణాలుగా గ్రహించవచ్చు.

**2. అనుస్వారం :-** పాజ్ఞన్నయ యుగంలో కన్పించిన వర్గపంచమాక్షరాలకు బదులు అనుస్వారంగా వ్రాయటం పూర్తయింది.

ఉదా :- పఞ్చదసి - పంచాదసి

'మణ్డలేశ్వర' అనే పదంలో అనుస్వారంకాక వర్గమంచమాక్షరమే కన్పిస్తుంది.

**3. ఱ కారం :-** ఇది కొన్ని సంజ్ఞావాచకాలలో ముఖ్యంగా విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో కన్పిస్తుంది.

ఉదా :- నిఱుజెఱ్ఱు, చోఱగంగ

ఛకారం :- 'ఇది' శాసనాల్లో కన్పిస్తుంది. కాని దీన్ని వర్ణంగా తీసుకోరాదు. ఎందుకంటె 'చ' కారమే ద్విత్వమయ్యేచోట, అనుస్వారం తర్వాత 'ఛ' కారంగా వ్రాయబడింది.

ఉదా :- ఇచ్చిరి/ ఇఛ్చిరి

సమర్పించిరి/ సమర్పింఛిరి

చచలు :- ఈ యుగంలో కూడ నేటిలాగా చవర్ణం తాలవ్యాచ్చుల ముందు తాలవ్యంగానూ, తక్కిన అచ్చుల ముందు దంతమూలీయం గానూ ఉన్నట్లు గమనించవచ్చు.

ఉదా :- పుత్సుకొని/ పుచ్చుకొని

ఋ > రి, ఋ > రు :- 'ఋ' సాధారణంగా శాసన భాషలో 'రి'. అవుతుంది.

ఉదా :- ఋషభ/ రిషభ/ ఋతు/ రుతు

4. దీర్ఘాచ్చులు :-

(అ) యకారం పరమైతే పదాది ఎ ఏలు రెండూ పర్యాయంగా కన్పిస్తాయి.

ఉదా :- వెయి/ వేయి

నెయి/ నేయి

(ఆ) ఈ అనే విశేషణం ఈ యుగంలో పరహల్లు ద్విత్వం కాకుండానే హ్రస్వరూపంలో కన్పిస్తుంది.

ఉదా :- ఇ దీపము

5. డ > ద :- పదాది డకారం దకారంగా మార్పుచెంది రెండు రూపాలేర్పడ్డాయి.

ఉదా :- డాయు/ దాయు

డున్ను/ దున్ను

త > ట :- 'ఎంక్' అనే పదాలు పరమైతే తకారం టకారమౌతుంది.

ఉదా :- తెంకాయ/ టెంకాయ

తెంకణ/ టెంకణ

యి > హి :- ఇకారం పరమైనపుడు అపదాది యకారం హకారంగా మారడం చాలా తరచుగా కన్పిస్తుంది.

ఉదా :- పయిడి/ పహిడి

నాయిండు/ నాహిండు

ర :- రేఫకు వర్ణవ్యత్యయం జరిగినట్లు గుర్తింపవచ్చు.

ఉదా :- మాను/ మ్రాను

పెర్గడ/ ప్రెగ్గడ

ఱ :- ఈ యుగపు శాసనాల్లో శకటరేఫ తారుమారు కాలేదు. సక్రమంగానే ఉంది.

ఉదా :- కూంతుఱు, నాయకుఱాలు

6. వర్ణసమీకరణం :-

డ్ల > ళ్ళ :- ఈ యుగంలో 12వ శతాబ్దిలో 'ళ్ల' రూపాలు విశేషంగా కన్పిస్తాయి.

ఉదా :- మూడ్లు/ మూళ్ళు, గుళ్ళు

డకారం పదాదిని అన్ని అచ్చులకు ముందు కన్పిస్తుంది.

ఉదా :- దిగు/ డిగు

దగ్గు/ డగ్గుత్తిక, డేరా, డోలు వగైరాలు.

**7. సంధి :-** రెండుపదాల చేరికవల్ల రెండచ్చులు కలసినపుడు మొదటి అచ్చు లోపించవచ్చు. లోపించక పోవచ్చు. మధ్యలో యడాగమం రావచ్చు. ఆధునిక వ్యాకరణ నియమాలేవి ఈ శాసనాలకు వర్తించవు.

) సంధి వచ్చే రూపాలు :- తమ + అన్న = తమన్న

౨) సంధి రాని రూపాలు :- కొట్టరువు ఎటియమ

౩) యడాగమ రూపాలు :- కుంభమాసము యమావాస్య

గుణసంధి రూపాలు :- భీమేశ్వర

**8) నామ పదాలు :-** ఇవి రెండురకాలు. ౧) విభాజ్యం ౨) అవిభాజ్యం

ఎ) అవిభాజ్యం దేశి అని, ఎరువు పదాలని రెండురకాలు. వీటిని విడదీయడానికి వీలుపడదు.

దేశి - ఉదా :- ఊరు, ఇలు

ఎరువు పదాలు సంస్కృతం లేదా ప్రాకృతాది భాషల నుండి వచ్చిచేరినవి.

సంస్కృతం - ఉదా :- భూమి, పుస్తకం, రాజ్యం

ప్రాకృతం - ఉదా :- ఠక్కురు

అన్యభాష - ఉదా :- డేరా

బి) విభాజ్యం రెండు రకాలు. ౧) కృత్తులు ౨) తద్ధితాలు. ఈ పదాల్లో ప్రాతిపదిక, ప్రత్యయం అనేవి రెండు కలసి ఉంటాయి.

౧) కృత్తులు :- మూల ధాతువులపై చేరే ప్రత్యయాలు - ఇవి దేశిపదాలే.

(క) ఇకి/ క :- ఏలు + ఇక - ఏలిక

(ఖ) అపు/ పు/ ఉపు :- అడపు/ కాంపు/ కొలువు

(గ) అవు/ ఉవు/ వు :- తొడవు, తెరువు, పూవు

(ఘ) ఉవ/ వ :- విలువ, త్రోవ

(చ) ఇమి/ మి :- కూరిమి/పేర్మి

(ఛ) అలి/ ఇల :- కూడలి, డిగ్గిలి

(౨) తద్ధితాలు :- దేశిపదాలపై, తత్సమాలపై వచ్చే ప్రత్యయాలు.

(క) 'క' - అవజకాండు

అరి/ ర/ అటి :- కొట్టరి, తలారి, భడర/ సుంకటి

'ఇ' - 'ఉదారి'

'తన' - తలారితనము

లింగబోధక ప్రత్యయాలు (Gender Suffixes)

మహత్తు - (ఏకవచనం) ంఋ, ఋ, డు, ంఋ, ప్రాచీన రూపమ్మైన 'న్ఱు'కు రూపాంతరమనవచ్చు

ఉదా :- ప్రిత్తికాంఋ

మహతి :- (ఏకవచనం)

ఱాలు, ఆలు, త్య :- నాయకుఱాలు, కోడలు, ప్రిత్తికత్య - క్లీబం (నపుంసకం)

ము, మ్ము, ంబు, ం :- కూటము, సుంకమ్ము, దేశంబు, రక్తం.

౨) విభక్తి ప్రత్యయాలు :-

1) ప్రథమా విభక్తికి ప్రత్యేక ప్రత్యయాలు లేవు.

మహత్ప్రత్యయంగల పదాల్లో 'డుజ్ఞు' లోపిస్తుంది.

ఉదా :- పరమాత్మునిచే - 'ని' చేరింది.

బహువచన ప్రత్యయాలైన లు, రు, ఋ, ంఢ్రు పైన 'అ' చేరుతుంది.

ఉదా :- పెక్కంఢ్రను

ను, లు, రు చివరగల కొన్ని

నామపదాలకు 'ఇ' చేరుతుంది.

ఉదా :- పాలిలోన, పోరిలోన

య, ల, ఴ, డ లు చివరగల

పదాలకు 'తి' చేరుతుంది.

ఉదా :- నేయి, నేతికి

2) ద్వితీయా విభక్తి :- 'ను' ద్వితీయా విభక్తి ప్రత్యయం - అప్పడప్పడిది అనుస్వారమవుతుంది. 'న్ని' కూడ అవుతుంది.

ఉదా :- ఫలమును, కవిలం, ధర్మాన్ని

3) తృతీయా విభక్తి :- న్, అన్, నన్, తోడన్, తోన్, మెయిన్ - ఇవి ప్రత్యయాలు.

ఉదా :- వినోదంబులన్, కాలన్

భక్తితోడ, దయతో

సచ్చరిత మెయిని

4) చతుర్థి :- కిన్, నకున్, కున్ అనేవి చతుర్థీ విభక్తి ప్రత్యయాలు.

ఉదా :- రిషి పెద్దికి, చమురునకు, దీపమునకు

'కొఱకు' 14వ శతాబ్దంలో కన్పిస్తుంది.

ఉదా :- అభీష్ట సిద్ధి కొఱకు.

5) పంచమీ విభక్తి :- చేతన్, చేన్, వలనన్, వల్లన్, నుండి, కంటెన్ అనేవి

ప్రత్యయాలు.

ఉదా :- దేవరచే

జీతాల వలనం

సుఖం వల్లను

గంగ కలుత నుండి

నాకాధీశు పురంబుకంటె

6) షష్ఠీ విభక్తి :- ఉకారాంత పదాలకు అచ్చు పరమైతే షష్ఠీ ప్రత్యయంగా 'న'కారం వస్తుంది.

ఉదా :- మూలస్థానంబు నాది మూర్తికి

7) సప్తమీ విభక్తి :- న్, నన్, అన్ అనేవి సప్తమీ ప్రత్యయాలు.

లోన్, లోనన్, లోపలన్, అందు, నందు

ఉదా :- కేటిపల్లిని

పడమటం

శ్రీకూర్మమున

సీమలో

చెల్లావలోన

సోరకి నాంటి లోపలన్,

చెఱువందు,

ఉత్తరాయణము నందు,

ఇందుల కాయకూర

**10) సంఖ్యా వాచకాలు :-** ఇవి నామపదాల క్రిందే వస్తాయి. అయితే ఇందులో కొన్ని విశేషాలున్నాయి.

1) ఒకటి :- ఇది ఒక్కొణ్డు, ఒకణ్డు, ఒక్కడు, ఒక్కటి.

2) రెండు, మూడు యథాతథంగానే వాడబడ్డాయి.

3) నాలుగు :- నాలుగు/నాలువు, నాలు-నాలుగు, నాలువు.

4) ఐదు :- రెండురూపాలు - ఐదు/ఏను.

5) ఆఱు, ఏడు శబ్దాల్లో విశేషాలేమి లేవు.

6) ఎనిమిది :- ఎనిమిది/ఎన్మిది/ఎనుమిది. దీని పూర్వరూపం ఎణ్ + పది.

7) తొమ్మిది :- దీన్ని తొణ్ + పది నుండి వచ్చిందనవచ్చు, ఇది సమాసరూపం.

8) (పది) - నూఱు - ఈ రూపాలలో క్రొత్తమిలేదు. వంద శబ్దం ఈ శతాబ్దంలో

కన్పించదు.

౧) వేయి :- వేయి/వెయి/వేయు/వెయు/వెయ్యి.

11) సర్వనామాలు :- వీటిల్లో చెప్పకోదగ్గ విశేషాలేవి లేవు. కన్పించినవి ఇలా ఉన్నాయి.

| | | |
|---|---|---|
| ఉత్తమ పురుష :- | ఏక. వ. | బహు. వ. |
| | ఏను | ఏము |
| | నేను | మేము |

మధ్యమ పురుష సర్వనామాలు ఈ యుగం శాసనాల్లో కన్పించవు.

| | | |
|---|---|---|
| | తాను | తారు, తాము |
| ప్రథమ పురుష :- | వాండు | వాండ్లు, వారు |
| | ఏండు. వీడు, వీండ్లు, వీరు. | |

12. క్రియాపదాలు :- ఇవి రెండురకాలు అవిభాజ్యం 2) విభాజ్యం.

ఉదా :- అగు - అమ్ము ఇవి అవిభాజ్యాలు

2) విభాజ్యాలు ఏకధాతుకమని, బహుధాతుకమని రెండురకాలు.

1) ఏకధాతుక విభాజ్యాలు :- ఇంచు చేరిస్తే ఏర్పడేవి

ఉదా :- ఉదయించు, సరించు, మెచ్చించు

2) బహుధాతుక విభాజ్యాలు :- ఇది రెండురకాలు.

దేశి :- చేకొను, పనివడు

మిశ్రం :- దయసేయ, ను తికెక్కు

సమాపక క్రియలు :-

1) సామాన్య సమాపక క్రియలు 2) సంశ్లిష్ట సమాపక క్రియలని రెండురకాలు.

1) సామాన్య (Simple) :-

ఉదా :- వచ్చెను, వచ్చును

| ప్రత్యయాలు | ఏక.వ. | బహు. వ. |
|---|---|---|
| ఉత్తమ | ను | ము/మి |
| మధ్యమ | - | -/రి |
| ప్రథమ | ను | రు/రి |

(క్లీబ బహుత్వంలోనూ) (మహన్మ హతిమాత్రం)

మధ్యమ పురుషైక వచనాలు శాసనాలలో లేవు

| | | |
|---|---|---|
| భూతకాలిక ప్రత్యయాలు | ఏక.వ. | బహు.వ. |
| ప్రథమ పురుష | ఎ | ఇ |
| | ఇచ్చె | ఇచ్చిరి |
| మధ్యమ పురుష | ఇస్తివి | ఇచ్చితిరి |
| ఉత్తమ పురుష | ఇచ్చితిని | ఇచ్చితిమి, ఇస్తిమి |

ఎద, ఏడు/ఎడి ప్రత్యయాంతాలు

తద్ధర్మాలు :-

ఉదా :- చెరిచెదను, నడిచెదము

పోదురు, విందుము, వలియింతురు వగైరాలు

అసమాపక క్రియలు :- వాక్యార్థం పూర్తిచేయని క్త్వార్థకాది క్రియలు క్త్వార్థకంలో

'ఇ' చేరినవి :- చేసి, నడపక

శత్రర్థకం :- చేయుచున్న చేస్తుండి

చేదర్థకం :- ఇనన్/నాన్ అనేవి

ఉదా :- పేర్కొనినం, అమ్మినాను

13. విశేషణాలు :-

1) గుణవాచక విశేషణాలు.విశేష్యాలకుముందు వస్తాయి.

ఉదా :- నల్లరాయి, పచ్చిపాలు.

2) మువర్ణకాంతాలు 'వ'తో వస్తాయి.

ఉదా :- ఇనప కవదివియ – పువర్ణాలుగా మారినవి.

ఉదా :- దక్షిణపు వలను

3) ఉదంతాలు అదంతాలయ్యేటప్పుడు అనుస్వారం వచ్చేవి.

ఉదా :- తూర్పుం బొలము

తెల్లం బ్రాలు

4) పరిమాణార్థకంలో 'ఎణ్డు, అణ్డు' చేరతాయి.

ఉదా :- పుటెణ్డు, మానండు.

5) వైభాజిక ప్రత్యయాలు, 'చేసి, ఏసి' చేరినవి.

ఉదా :- మూండేసి, మానెండుసేసి.

6) సంఖ్యా వాచక విశేషణాలు.

ఉదా :- రెండు దీపములు, మూడు సంధ్యలు ఒఖకుండ.

7) పూరణార్థకం :- అగున్, అవున్ చేరినవి.

ఉదా :- మూణ్ణవు, పది యేడగునేణ్ణు.

**14. క్రియా విశేషణాలు :-** భూతకాలం :- ఇన, న, అ.

ఉదా :- పెట్టిన, కొన్న, పడ్డ.

౨) వర్తమానకాలం :- 'చున్న' చేరినవి.

ఉదా :- ఏలికలగుచున్న

౩) తద్ధర్మం :- ఇవి నాల్గు రకాలు.

౧. న్ ౨. ఎడు/ఎడి ౩. ఏ/ ౪. ఇ.

౧. చేయునవసరము ౨. ఉండెడు, ఒత్తెడు ౩. చెల్లేమాడలు

౪. నడిపివాండు.

౪) భవిష్యత్కాలము :- అవ్వంత క్రియారూపానికి 'కల' శబ్దాన్ని చేరిస్తే భవిష్య ద్విశేషణ రూపమేర్పడుతుంది.

ఉదా :- అరిగింపగల కుడుములు

**15. మాండలికాలు :-** ఈ యుగంలో రెండువేల శాసనాలు ఆంధ్రప్రదేశమంతట వ్యాపించి ఉన్నాయి. అందువల్ల మాండలిక విషయాలు అనేకం మనకు తటస్థమవుతాయి. డాక్టర్ కృష్ణమూర్తిగారి పరిశోధనలో వెలువడ్డ మాండలిక విశేషాలు

౧) ఱ కారం వ్రాతలో నిల్చి ఉంది. ౨) ఢ సంయుక్తం నిల్చి ఉంది,

౩) 'చెల్లు' పదం 'చల్లు'గా వాడబడింది.

౪) 'నాల్గు' అనే పదానికి 'నాలు' రూపముంది.

౫) సంఖ్యా వాచకాల్లో 'పదినొకండు' మొదలైన పదాలకి 'ఉన్' ప్రత్యయంగాక 'అండు' ప్రత్యయం చేరుతుంది.

ఇంకా ఇలాంటి మాండలికాలు ఈ యుగంలో పెక్కులు పరిశోధనలో బయటపడ్డాయి.

★★★



# 4. నన్నయ భాషలో స్థిరపడిన విశేషాలు

నన్నయ ఆంధ్ర మహాభారత రచనకుపక్రమించే నాటికి తెలుగు భాషలో కావ్యశైలి రూపుదిద్దుకుంది. ప్రాఙ్నన్నయ యుగంలోని శాసనాల్లో, రాజాజ్ఞప్తుల్లో పరిణతి చెందిన తెలుగుభాషా స్థితిని పరిశీలిస్తే మనకీసంగతి స్పష్టంగా తెలుస్తుంది. తెలుగుభాష గద్యరూపంలో క్రీ.శ. 575 నుండి రాజశాసనాల్లో కన్పిస్తుంది. 6 నుండి 8 శతాబ్దాల మధ్యకాలపు శాసనాలు, రేనాటి చోళులు, తూర్పు, పశ్చిమ చాళుక్యులు మొదలైన రాజన్యులు వేయించిన శాసనాలన్నీ గద్యరూపంలోనే ఉన్నాయి. ఇక 9వ శతాబ్దం నుండి పద్యశాసనాలు కూడ కన్పిస్తున్నాయి. పద్యశాసనాల్లో ఎక్కువ భాగం. తూర్పు చాళుక్యరాజులు వేయించినవే. నేటిదాక బయటపడ్డవాటిలో మొదటి పద్యశాసనం గుణగ విజయాదిత్యుని సేనాపతి పండరంగడు వేయించిన అద్దంకి శాసనం. ఇది గుంటూరు జిల్లాలో ఉంది. ఈ శాసనభాష తెలుగు మహాభారత రచనాశైలిని పోలి ఉంది. గద్యపద్యాత్మకమైన చంపూశైలిలో పొందుపడి ఉంది. ఛందస్సులో ఉపజాతికి చెందిన తరువోజ ఒక పద్యం తర్వాత నాల్గు పంక్తుల్లో ఒక గద్యం. పద్యంలో పండరంగని పరాక్రమోపేత విజయాలు, గద్యభాగంలో అతడు పరమ మహేశ్వరుడైన ఆదిత్య భట్టారకునికి చేసిన దానాలు అభివర్ణింపబడ్డాయి. ఇంకా ఇలాగే ఇతర శాసనాల్లో అక్కర, సీసం మొదలైన దేశీయ ఛందోభేదాలు కన్పిస్తాయి. పద్యశాసనాలన్నీ మంచి కావ్యశైలిని తలపిస్తున్నాయి.

**1) యుద్ధమల్లుని బెజవాడ శాసనం :-**

''స్వస్తి నృపాంకుశాత్యంత వత్సల సత్యతినేత్ర, విస్తరశ్రీ యుద్ధ మల్లుణ్డ నవద్య విఖ్యాత కీర్తి ................ త్రిభువనాభరణుణ్డు''

ఇలా తత్సమ బహుళమైన భాష పద్యశాసనాల్లోగాక గద్యశాసనాల్లోనూ కన్పిస్తుంది.

**2) విజయాదిత్యుని ధర్మవరం శాసనం :-**

ఈ శాసనభాష చాల సరళ గంభీరమైన శైలితో ఒప్పారుతున్నది. కొన్ని ఆకాలంనాటి విలక్షణ ధ్వనులున్నా భారతశైలికి సన్నిహితంగా ఉంది.

''విజయాదిత్య పాదపద్మ భ్రమరాయమాన శ్రీమత్కడెయరాజు దనకెని ఈశ్వరునకుం గాత్తి ˘ కేయుండుంబోలె ............ పన్చిన ప్రసాదంబని''

3) క్రీ.శ. 892-922 మధ్య వేయించిన కొరవిశాసనం :-

ఇది మరింత రాటుదేలిన గద్యశాసనం.

''శ్రీ విక్రమాదిత్య నృపాగ్రతనయుణ్డయ్న చాళుక్యభీమునకు శౌచకందప్ప

"నకువేంగీశ్వరునకు.............................. బలపరాక్రమంబునందెచ్చి కంలియంగట్టి .................. అర్థ" రాజ్యంబు సేయుచున్న కుసుమాయుధు పెద్దకొడుకు''

ఈ గద్య కూడ కావ్యశైలిలోనే రచించబడింది. పై నిరూపించిన గద్యశాసనాల్లోని భాషలో కావ్యశైలి స్పష్టంగా కన్పిస్తుంది. ఈ భాష సంధి సూత్రాల నియతికి లోబడి, తత్సమ పదబాహుళ్యంతో, అన్వయ కాఠిన్యంగల రచనా విధానంతో కన్పిస్తుంది. పై నిరూపించిన వివరణల్నిబట్టి ప్రాఙ్నన్నయ యుగంలోనే కావ్యశైలి తెలుగులో ఏర్పడిందని విశదమవుతున్నది.

నన్నయవల్ల వెనకటి నుండి వస్తున్న కావ్యభాషకు స్థిర రూపమేర్పడింది. ఆయన గ్రంథస్థం చేసిన భాష గ్రాంథికమై, అనంతర కవులకు మార్గదర్శకమై ఒప్పారింది. ఆ మాన్యుడు మూడు పర్వాల్లో అనుసంధించిన 'తెలుగు నుడుల్ని' అరసికొనియే తర్వాత మార్గకవులెల్లరూ కావ్యరచనలు చేశారు.

ఎ) నన్నయ తత్సమ పదప్రయోగాల్ని విరివిగా అంగీకరించి గద్య పద్యాత్మకమైన చంపూ పద్ధతిని స్థిరపరచాడు. క్రీ.శ. 1008 న దొరికిన ఆహవమల్లదేవుని శాసన భాష నన్నయ భాషాశైలి పోలి ఉంది.

ఉదా :- శాసనం :-

''స్వస్తిశ్రీ సకల భువన వల్లభ శ్రీమదాహదమల్ల దేవ, శ్రీపాద పద్మారాధన పరమణ్డలసాధక .................. దుర్గత్రయమల్ల''

బి) నన్నయ తనకంటె ముందు అవతరించిన కర్ణాటకావ్య భాషాశైలిని మనసులో నుంచుకొని, దీర్ఘసంస్కృత సమాసాల్ని భారత రచనలో పొందుపరచాడని విశ్లేషకులంటున్నారు. కన్నడ భాషలో పంపకవి రచించిన విక్రమార్జున విజయంలోని క్రింది గద్యం ఇందుకు నిదర్శనం.

''ఇదు విబుధజనవినుత జినపదాంభోజ వరప్రసాదోత్పన్న ప్రసన్న గంభీర వచన రచన .................. విక్రమార్జున విజయదోళ్''

ఆది పురాణంలోని కందపద్యరచనకొక ఉదాహరణ :-

''అలినినదద మదకోకిల కలనినదద జతియోలభినయం''

ఈ పై రెండుదాహరణలు నన్నయ అరణ్యపర్వంలోని ''శారదరాత్రులుజ్జ్వల లసత్తరతారక హారపంక్తులన్'' వంటి పద్యరచనని పోలి ఉన్నాయని ఉభయ భాషా పరిశీలకుల కథనం.

సి) ప్రాఙ్నన్నయ యుగంలోలేని సమాపక క్రియారచనని నన్నయ తన భారత రచనలో ప్రవేశపెట్టాడు.

ఉదా:- రమ్యమగు సభాపర్వమిలన్;

'అగు నని మిత్తాగమంబులైన భయంబులే'

ఇచ్చట పై రెండు ఉదాహరణాల్లో అగుధాతువు సమాపక క్రియగా ఉంది. అయితే 'అగు' ధాతు విరహితమ్మైన వాక్యప్రణాళిక సైతం నన్నయ రచనలో కన్పిస్తుంది.

ఉదా :- ''దీని త్రిగుణంబు గుల్మంబు లోకపాల కుండవు''

ఇత్యాదులు.

డి) ప్రాచీనాంధ్ర భాషలో 'వ్రచ్చినవాన్డు, రోగొన్నవాన్డు' వంటి సంబంధ బోధక సర్వనామరహిత వాక్యాలు కన్పించేవి. 'వ్రచ్చినవాడు పాతకుండు' అంటే 'ఎవడు చెలిపినాడో వాడు పాతకుడు' అని అర్థం. క్రీగీత గీచిన వాక్యంలో సంబంధ బోధక సర్వనామం లేదు.

కాని నన్నయ పై పద్ధతిని మార్చి, సంబంధ బోధక సర్వనామ సహిత వాక్యవిధానాన్ని అమలుపరచాడు.

ఉదా :- ''ఏయది హృద్యమపూర్వం
బేయది యెద్దాని వినిన నెరుక సమగ్రం
బైయుండు నఘునిబర్హణ
మేయది యక్కథయెవినగ నిష్టము నాకున్''

నన్నయ భారతంలో వ్రాసిన నాల్గువేల పద్యాలలో 'ఏయది, ఏవాని, ఎందేని' వంటి సంబంధ బోధక సర్వనామాల సంఖ్య 25గా ఉంది.

ఇ) కర్మార్థక ప్రయోగం :- ఇది ద్రావిడ భాషలో చాల తక్కువ. నన్నయ తన రచనలో కర్మార్థక ప్రయోగాలు విరివిగా వాడాడు. కర్మకు ప్రాధాన్యమిచ్చిన కర్త్రాపేక్షలేని వాక్యరచనయే 'కర్మార్థక ప్రయోగ' మౌతుంది.

కర్త్రర్థకం - కర్మార్థకం
ఇల్లు కట్టిరి - ఇల్లు కట్టివేయబడినది
రాముడనువాడు - రాముడనబడెడువాడు

నన్నయకు పూర్వశాసనాల్లో కూడ ఈ ప్రయోగాలు కన్పిస్తాయి.

ఉదా :- వైదుమ్బుల చేతంబట్టం గట్టబడియె
వానిచేత బట్టం గట్టబడినవాంధ్రు

నన్నయ ప్రయోగించిన కర్మణి ప్రయోగాలకొక ఉదాహరణ :-

''మహాద్విజులచేత నాయందు వేల్వంబడిన హవ్యకవ్యంబులు -

నన్నయ సంస్కృత భాషాసంపర్కబాహుళ్యం వల్లనే 'పడు' ధాతువుతో కూడిన కర్మణి ప్రయోగాలు విశేషంగా చేశాడు.

ఎఫ్) ప్రాఙ్నన్నయ యుగశాసనాల్లో విస్తృతంగా కన్పించినవింత ద్రావిడ భాషా

ధ్వనిగా గుర్తింపబడిన ' ' కారాన్ని నన్నయ జారవిడిచాడు. ఇది కాలాంతరంలో ర, ళ లుగా మార్పుచెందింది. నన్నయ దీన్ని డ కారంగా గ్రహించాడు.

ఉదా :- ధనంజయుఱు – ధనుంజయుడు

జి) 'న్టు' అనే ప్రాచీన ధ్వనిని కూడ నన్నయ తన రచనలో వదిలిపెట్టాడు. దానిస్థానంలో 'న్డు'ను ప్రవేశపెట్టాడు. ఈ 'న్టు' యుద్ధమల్లుని బెజవాడ శాసనంనాటికే 'న్డు'గా పరిణతి చెందింది.

ఉదా :- త్రిభువనాభరణుణ్టు

హెచ్) ప్రాచీన ద్రావిడ భాషలో బహువచన ప్రత్యయాలుగా గుర్తింపబడిన కళ్ లేదా గళ్ యొక్క అవశిష్టరూపం 'ళ్' అనేది నన్నయ కాలానికి 'ల్' లేదా 'లు'గా మార్పుచెందింది. నన్నయ భారత రచనలో 'ళ్' స్థానంలో 'లు'ని వాడాడు.

ఉదా :- దంష్ట్రలు, వీరలు, పుణ్యలోకంబులు మొ.నవి.

ఐ) ప్రాచీన ద్రావిడ భాషావర్ణాల్లో మరొక విలక్షణమైన 'ఱ' కారం (శకటరేఫం) నన్నయ కాలానికి అలాగే నిలిచి ఉంది. ఈ వర్ణాన్ని నన్నయ గుర్తించాడు. రేఫ శకటరేఫలకు (ర, ఱ) నన్నయ యతిప్రాసల్లో మైత్రిని పాటించలేదు. కావున ఆయన శకటరేఫని గుర్తించాడనే అంటారు.

జె) నన్నయ తన కాలానికంటె ఎంతో ముందు వాడుకలో ఉన్న 'సీసం, తరువోజ, మధ్యాక్కఱ' వంటి దేశిఛందోభేదాల్ని తన భారత రచనలో విరివిగా వాడినాడు. వీటికి తోడుగా మత్తేభ శార్దూలాది వృత్తాల్ని, మార్గ సంప్రదాయ బద్ధమైన ఇతర వృత్తాల్ని భారత రచనలో పొదిగి మార్గదేశి కవితా సంప్రదాయ శైలిని పరిపుష్టం చేశాడు.

కె) సంస్కృత భాష నుండి విశేష శబ్దజాలాన్ని, సంస్కృత సమాసాల్ని గ్రహించి భారత రచనలో చొప్పించాడు. డు, ము, వు, లు చేర్చి, తత్సమ శబ్దాల్ని, 'ఇంచుక్' ప్రత్యయం చేర్చి సంస్కృత ధాతువుల్ని భారతంలో ప్రయోగించాడు. 'చేసి, మెయి, పొంటె' వంటి కొత్త విభక్తి ప్రత్యయాల్ని కల్పించి వాడినాడు.

చేసి :- 'ఏకవిప్ర సంబోధన జేసి నృపపుంగవ' ఇందులో 'చేసి' అనేది తృతీయా విభక్త్యర్థాన్ని ఇస్తుంది. సంబోధన జేసి అంటె 'సంబోధన చేత' అని అర్థం.

పొంటె :- 'వివిధ సంప్రయోగము పొంటెన్'

ఇందులోని 'పొంటెన్' పంచమ్యర్థాన్నిచ్చే ప్రత్యయం. ఇది 'వలన'కు తుల్యం. 'సంప్రయోగంవల్ల' అని అర్థం.

పై సంస్కరణ ప్రణాళిక చేత నన్నయ తన భారత రచనలో తెలుగుభాష యొక్క స్ఫోరకశక్తిని అపారంగా పెంపొందించాడు.



# 5. కవిత్రయయుగం నాటి కావ్యభాషా స్వరూపము :-

క్రీ.శ. 11 - 14 శతాబ్దాల కాలాన్ని కవిత్రయయుగం అంటాము. శ్రీనాథుడు 15వ శతాబ్దికి చెందిన కవి. కావ్యభాషలో 14 - 15 శతాబ్దాల మధ్య ఎక్కువ భేదం కన్పించదు. కాబట్టి తెలుగుభాషా చరిత్రలో 1000 నుండి 1500 వరకు కవిత్రయ భాషాయుగం అని వ్యవహరించవచ్చు. దీనికి ముందు ప్రాఙ్నన్నయయుగం. దీని తర్వాత వస్తుంది ప్రబంధయుగం. ఇలా ఆంధ్రభాషా చరిత్రని మూడు యుగాలుగా వ్యవహరించవచ్చు. వీటిలో కొన్ని అవాంతర దశలు లేకపోలేదు. ప్రాఙ్నన్నయ యుగంలో ఆరంభమైన కొన్ని మార్పులు 12 - 13 శతాబ్దాల నాటికి ఒక స్థిరరూపాన్ని సంతరించుకున్నాయి. పదమధ్య/పదాంత వర్ణం లోపించి పూర్వస్వరానికి దీర్ఘం కలుగడం ప్రాఙ్నన్నయ యుగంలో ఆరంభమైంది. ఆ పరిణామం క్రమంగా వ్యాపించి అనేక రూపాల్ని మార్చివేసింది.

ఈ శీర్షిక క్రింద చారిత్రక వ్యాకరణాంశాలు క్రీ.శ. 1000 - 1500 మధ్యకాలానికి చెందినవని గ్రహించవలసి ఉంది.

I. ధ్వనులు :- ఈ మధ్యకాలంలోని భాషాధ్వనులు

అచ్చులు :- అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఎ ఏ ఒ ఓం

హల్లులు :- క ఖ గ ఘ ఙ

చ ఛ జ ఝ ఞ

ట ఠ డ ఢ ణ

త థ ద ధ న

ప ఫ బ భ మ

య ర ఱ ల ళ వ శ ష స హ

Note:- అచ్చుల్లో 'ఋ ౠ 'లున్న

1) హల్లుల్లో మహాప్రాణవర్ణాలు, ఖ ఛ ఠ థ ఫ, ఘ ఝ ఢ ధ భ శ ష లు సంస్కృత పదాల ద్వారా తెలుగులో ప్రవేశించాయి.

2) దేశ్యాల్లో 'అ ఇ'లు 'అ ఉ'లు ఏకవర్ణస్ఫూర్తి కలిగేట్టు ఉచ్చరించబడగా 'ఐ ఔ'లు ఏర్పడ్డాయి.

ఉదా :- అయిదు > ఐదు; అవును > ఔను.

ఇవి తెలుగునకు సహజాలు గావు. సంస్కృత భాషకు సహజాలు

ఉదా :- ఐరావతం, ఔషధం

3) 'ఙ, ఞ'లు వర్గాక్షరాలకు ముందే వస్తాయి. సంయుక్తంలోనేగాని వ్యస్తంగా

వానికి ప్రయోగం లేదు.

4) వర్గాక్షరానికి ముందు వచ్చే వర్గానునాసికాన్ని అనుస్వారంగా వ్రాయటం సంస్కృత భాషాసాహచర్య ఫలితమే. దేశ్యశబ్దాల్లో అనుస్వారానికి వర్గానునాసికం విలువే ఉంది. సంస్కృత శబ్దాల్లో భిన్నోచ్చారణ కన్పిస్తుంది.

ఉదా :- సంయమి, సంహారం

5) : విసర్గ. ఇది తెలుగులో పదమధ్యంలోనే కన్పిస్తుంది.

ఉదా :- దుఃఖము, అంతఃపురము.

దీనిని వర్ణాంతరంగాగాక హకారానికి సవర్ణంగా గుర్తిస్తారు.

2. వర్ణోచ్చారణ విశేషాలు :-

1) ఋ వీటికి తెలుగులో లేఖన చిహ్నాలు ఏర్పడ్డాయి. ఈ ధ్వనులు తత్సమాల ద్వారా తెలుగులో ప్రవేశించాయి. పూర్వ శాసనాల్లో ఇవి రి/ లి గా ఉండేవి. తర్వాత రు/ లు గా మార్పుచెందాయి. తిక్కన 'సప్తఋషులైరి వారు మరుద్గణమునకు' అని యతివేశాడు.

2) ర ఱ ల రేఫశకట రేఫభేదం నన్నయ భాషలో భిన్నవర్ణాలుగానే ఉన్నది. 'ర' కంటె 'ఱ' కారానికి అధిక కంపనముండేది. అప్పటికి ఈ వర్ణాలకు సాంకర్యం లేదు. కాలక్రమాన 'ఱ' కారం తన వైలక్షణ్యాన్ని కోల్పోయి సాధురేఫగా పలుకబడుతూ వచ్చింది. నన్నయాదుల ప్రాచీన గ్రంథాల్లో 'ర – ఱ'ల ద్వైరూప్యం కన్పిస్తుంది.

నన్నయ - అరుదు/ అఱుదు, కురంగలి/ కుఱంగలి

'కూతురు' శబ్దం ఈ యుగంలో సాధురేఫంతోనే కన్పిస్తుంది.

3) క్షకారం :- దీనికి నన్నయ భారతంలో క ఖ గ ఘ లతోనే మైత్రి కల్పించబడింది. శ ష స కారాలతో మైత్రి లేదు. నన్నెచోడుడు 'క ష'లతో మైత్రి కల్పించాడు.

4) జ్ఞ :- నన్నయ దీన్ని చ ఛ జ ఝ లతో మైత్రి కల్పింపగా తిక్కన క కారంతో యతి కల్పించాడు.

3. ధ్వనుల మార్పు :-

1) పదమధ్య ధ్వనుల దీర్ఘం హ్రస్వమైన రూపాలు. తిక్కన నాటికి క్వాచిత్కంగా కన్పించాయి.

ఉదా :- మరాకుము < మరువకుము

కళ్యాలన్ < కళ్ళములన్

మోము < మొగము

౨) గద్దియ < గద్దె, పల్లియ < పల్లె - ఇలా నన్నయ, నన్నెచోడుల గ్రంథాల్లో ఎత్వరూపాలు వాడబడ్డాయి.

౩) డ > ద :- దేశ్య శబ్దాల్లో పదాదిడకారం చాల తక్కువ. నిజానికి ద్రావిడ భాషలో పదాదిని మూర్ధన్యాక్షరం ఉండదు. తెలుగులో ప్రాఙ్నన్నయ కాలాన వర్ణవ్యత్యయంవల్ల ఏర్పడింది.

ఉదా :- అడంగు > డాంగు > డాగు

దప్పి > డప్పి

4) పదమధ్య అచ్చులోపం :- నన్నయ :-

ఉదా :- తొడగు - తొడ్గు, పొలతి - ప్ొల్తి, ఉనికి - ఉన్కి

5) పదాంతమువర్ణలోపం :- ౹ వ శతాబ్ది నుండి లభిస్తుంది.

ఉదా :- ఆ చంద్ర తారకం, బాణపురం

౬) ధ్వనిపరిణామ రీతులు :- స్వరసామ్యం సంస్కృత అకారాంత శబ్దాలకు ఉత్వడుజ్‌లు ఏర్పడ్డ రూపాలు.

వర్ణ సమీకరణం :- గరుడుడు - నన్నయలో గరుడడు

7) వర్ణవ్యత్యయం :- దేశ్యాలలో అంతకుముందులేని లకార, రకారాది శబ్దాలు రేఫ సంయుక్తాక్షరాలతో కూడినవి ఏర్పడ్డాయి. కొన్నింట రెండు రూపాలు ఉన్నాయి.

ఉదా :- ఎరక - రెక్క, అనన్ - నాన్

అనవుడు - నావుడు

౮) వర్ణవినిమయ్యం :- భాషలో ప్రత్యేక వర్ణాలుగా వ్యవహరించే వాటిలో వినిమయం కన్పిస్తుంది. (Free variation)

క/ గ - కొనకొని/ గొనకొని

చ/ స - చుమ్ము/ సుమ్ము

డ/ ట - ఆడదాన/ ఆటదాన

త/ ట - తెంకాయ/ టెంకాయ

ఇ/ ఎ - కోరికి/ కోరికె ఇత్యాదులు.

౯)పదాది హాల్లోపం - ఒకేరూపం అజాదిగ హలాదిగ కన్పిస్తుంది.

ఉదా :- నెగయు/ ఎగయు

నీల్గె/ ఈల్గె

4)సంధి.- అనేకమైన సంధిగత పదాలు ఈ యుగంలో చోటుచేసుకున్నాయి.

1) అచ్సంధి :- పూర్వస్వరం లోపించేది. పరస్వరం 'ఏకాదేశమగుట'

ఉదా :- రాతిరి + ఎల్ల - రాతిరెల్ల

చెతొక్క

అందిమ్ము

2) అత్వసంధి:- అపదాది స్వరసంధి

ఉదా :- అంతవమానము - అంత + అవమానము

ఉర్వీశులొద్ద - ఉర్వీశుల + ఒద్ద

3) అచ్చు + హల్లు :- వర్ణసమీకరణంవల్ల నాదస్పర్శం శ్వాసోష్మంగా మార్పు చెందుతుంది.

ఉదా :- ఏమిసేయుదు, పెద్దవోయె

చతపలకు సదవలుగాని రూపాలు - తిక్కనలో కన్పిస్తాయి

ఉదా :- అప్పాచెల్లెం(డు

4) హల్లు + హల్లు (దుతనకారానికి పరుషం పరమైతే నకారం తన నాదత్వాన్ని ఆ పరుషానికి ఆపాదించి, నాదస్పర్శంగా మార్చివేస్తుంది. 'క చ ట త ప' లు 'గ జ డ ద బ' లవుతాయి. కావ్యభాషలో ఇది సాధారణం.

ఉదా :- కమ్మని లతాంతములకున్ + మొనసి - కుమ్మొనస్సి

రెండ్ + నాళ్ళు - రెన్నాళ్ళు

5) హల్లు + అచ్చు తెలుగు శబ్దాల్లో (దుతనకారమొక్కటే చివర ఉండే హల్వర్ణం. ఈ (దుతం లోపించినా శబ్దార్థానికి భంగం కలుగదు. (దుతాంతమైన పదాలు (దుత(ప్రకృతికాలు. తక్కినవి కళలు. నన్నయ కళలుగా (ప్రయోగించినవి తర్వాత (దుత(ప్రకృతి కాలయ్యాయి.

ఉదా :- ఏను, నేను, తాను, ఎల్ల, ఎల్లయందు

Note :- తర్వాతికాలంలో (దుత(ప్రకృతికాలు కళలయ్యాయి.

ఉదా :- ఎందేని నుండి

ఎయ్యేనియు నొక్క

Note :- పదాంత విసర్గ రేఫగా మారడం పాల్కుర్కిలో కన్పిస్తుంది.

ఉదా :- ధేనుః + అనె - ధేనురనె

విష్ణుః + అనగ - విష్ణురనగ

5) నామపదాలు:-

1) ప్రాఙ్నన్నయ యుగంలోలేని లింగబోధక (ప్రత్యయం పదాంతంలో చేరింది.

ఉదా :- పాఱు - పాఱడు

౨) కొన్నింటిలో 'ఇ - ఉ'ల 'ఉ - అ'ల వినిమయం కన్పిస్తుంది.

ఉదా :- చేయు - చేయి

నేయు - నేయి

ముందఱు - ముందఱ

౩) శబ్దస్వరూపంలో గల్గిన మార్పు

ఉదా :- పొదరు - పొద

4) తత్సమ శబ్దాలలో - 'వాకు, జగము, మిత్రుడు' లాంటి పదాలేగాని 'వాకు, జగత్తు, మిత్రము లాంటి పదాలు లేవు.

౫) దేశ్యాల్లో 'కూతు' శబ్దం విలక్షణం. దీనికి ప్రథమైకవచనంలో 'కూతురు' అని, తదితర విభక్తుల్లో 'కూతు' అని ప్రయోగం వుంది.

౬) విభక్తి ప్రత్యయాలు

ద్వితీయ :- నన్నయ 'గుఱించి' రూపం వాడినాడు. 'గూర్చి' తర్వాత వచ్చింది.

తృతీయ :- వెంయున్ - తృతీయాంతంపై 'చేసి' నన్నయంలో గలదు. ఉపయోగార్థకంలో 'తోడ' వాడటం జరిగింది.

చతుర్థి :- కై (కు + అయి) సమస్త పదంగా గ్రహించినట్లు తోస్తుంది.

'కొఱకు' నన్నయ నన్నెచోడులు వాడలేదు.

పొంటె - ప్రాఙ్నన్నయ కొఱవి శాసనంలో ఉంది.

పంచమి :- 'కన్నన్' ఇది అర్వాచీనరూపం

'ఉండి' సప్తమ్యంత రూపాల్లో వాడబడింది. 'ఉండు' ధాతువు యొక్క క్త్వార్థకంరూపం. అనుచిత విభాగంవల్ల ఉండి/నుండి అయింది.

షష్ఠి :- ప్రత్యేక ప్రత్యయం లేదు. ద్వితీయ, చతుర్థి రూపాలె షష్ఠీ విభక్తి ప్రత్యయాలు.

ఉదా :- బ్రహ్మకుందపముసేసిన

సప్తమి :- దీనికి ప్రత్యేక ప్రయోగం లేదు. తృతీయ, పంచమి, షష్ఠిలలో అంతర్భాగం.

7 సర్వనామాలు :- ఉత్తమ, మధ్యమ పురుష రూపాల్లో ఏకబహువచన రూపాలు రెండేసి రూపాలు కన్పిస్తాయి.

| | ఏ.వ. | బ.వ. |
|---|---|---|
| ఉత్తమ ఉదా :- | ఏను/నేను | ఏము/మేము |

మధ్యమ ఉదా :- ఈవు/ నీవు ఈరు/ మీరు

ప్రథమ ఉదా :- (మహత్) వాడు వారు, వాండ్లు, వాండ్రు

(అనుహత్) అది -- అవి

(అమహత్) ఇది ఇవి

Note :- వాడు, అది, ఇది అనే తచ్ఛబ్దార్థాలు నన్నయ నన్నెచోడుల భాషలో ఇప్పటిలాగ నీచార్థ బోధకాలుగావు.

ఉదా :- వాడు గవ్వడి.

అది సంతసించి

8 సంఖ్యావాచకాలు :- నన్నయ, నన్నెచోడులు 'ఏను' రూపాన్ని వాడారు. ఇది శాసనాల్లో ఉంది. తిక్కన 'ఐదు' అని వాడాడు

ఉదా :- ఐదు శరములు

మొదటి సంఖ్యావాచకానికి మహత్, మహతి, అమహద్రూపాలు మూడూ ఉన్నాయి.

ఉదా :- అమరత్వ మొక్కండు

ఒక్కంటి, ఒకటి రూపాలున్నాయి.

కుమార సంభవంలో 'ఒకటి' అనేదుంది.

మహద్వాచకం :-

ఉదా :- నన్నయ - 'ఒకరుడు'

నన్నెచోడుడు - ఒక్కండు/ ఒకడు.

మహతీ వాచకం :-

ఉదా :- ఒక్కడ, ఒక్కటి, ఒక్కతె, ఒక్కరు

అనేవి నన్నయ రూపాలు.

9. క్రియావిభక్తులు - ప్రాచీన కావ్యాల్లో క్రియాధాతువుల్ని గూర్చి ఈ క్రింది అంశాలు గమనించదగ్గవి

ఎ) ధాత్వనుబంధం చేరని ప్రాచీన ధాతువుల వాడుక

ఉదా :- తొడు, ఎదురు

తిక్కనాది అనంతర కవులు :- 'తొడుగు, ఎదిరించు' అని ప్రయోగించారు.

బి) చుకారాంతాది ధాతువులు తర్వాతి కాలాన యకారాంతాలైనాయి.

నన్నయ నన్నెచోడులు :-

ఉదా :- వైచు, త్రోచు

అనంతర కవులు :-

ఉదా :- వేయు. త్రోయు

ఉభయాలు ఉన్నవి :-

ఉదా :- పొచు/ పాయు, మెఱచు/ మెఱయు

సి) మూలధాతువులుగా వాడబడ్డవి కొన్ని తర్వాతి కాలంతో సహాయక క్రియలతో శబ్దపల్లవాలుగా వాడబడ్డాయి.

ఉదా :- వ్రేలు - వ్రేలాడు

ఉలుకు - ఉలికిపడు

డి) 'వలయు' వంటి క్రియల్ని కవిత్రయం ప్రధాన క్రియగా వాడారు. ప్రబంధ యుగానికి సహాయక క్రియగా వాడబడింది.

ఉదా :- ఏమి వలయు నీ వడుగుమనిన

పోయిరా వలయు మాకు

ఇ) నన్నయాదుల ప్రాచీన గ్రంథాల్లో కొన్ని ధాతువులు ఏలాంటి రూపభేదమూ లేకయే అకర్మక, సకర్మకాలుగా కూడ వాడబడ్డాయి.

ఉదా :- కురియు - అరిగార వృష్టి గురిశ్ఖయుచు

వాన...... గురిసి ఒలుకు

కమండల జలంబులొలికెన

ఐ) సకర్మక క్రియలు కర్మలేకుండానే కావ్యభాషలో వాడటం కద్దు.

నన్నయ :- పొలుపుగ బూసి కట్టితొడి భూరి విభూతి ప్రకాశితంబుగా

హెచ్) చు, వు, ఇంచు ప్రేరణ ప్రత్యయాల్లో పకార రూపాలకు కాలక్రమాన వ్యాప్తికల్గింది.

ఉదా :- నిండు - నిండుచు, నింపు

చినుకు - చించు - చింపు

10 క్రియలు :- ఇవి సంపూర్ణాలు - అసంపూర్ణాలు అని రెండు రకాలు. క్రియల్లో ధాతువు, దానిపై కాలభావద్యోతక ప్రత్యయం, దానిపై సర్వనామ పత్యయం చేరుతుంది. అసంపూర్ణ క్రియల్లో సర్వనామ ప్రత్యయ ముండదు.

1) భూతకాలక క్రియలు:- చేయి - చేసితిమి - చేస్తిమి

ఇచ్చి - ఇచ్చితిమి - ఇస్తిమి

2) తద్ధర్మార్థక క్రియలు :- ఇది త్రికాలవాచి, దీనికి వర్తమాన, భవిష్యత్ భూతకాలాల్లో ప్రయోగాలున్నాయి.

ఉదా :- ద్యూతక్రీడకు కొండొక నేర్తున్ - నేర్చియున్నాను

ఇమ్మని బాయకవిందు - వింటిని

పొందుదురు - పొందుతారు

పెట్టించెదను - పెట్టించేను

3) వ్యతిరేకార్థక క్రియ:- ధాత్వం తమందలి చకారం వ్యతిరేకార్థం పరమైతే పకారమవుతుంది.

ఉదా :- ఒనర్చు - ఒనర్పడు

వ్యతిరేక క్రియ అర్థత్రయ బోధకమవుతుంది.

భూతం :- నలుగానమివ్వనంబులోన - కానము

వర్తమానం :- పలుకదు సఖులతో లలితాంగి

భవిష్యత్తు :- నలునకాని నలినదళ నేత్రవరియింపదట్టి

కాలాన్ని సూచించునప్పుడు అగుధాతువు చేరుట గలదు (నన్నయలో)

ఉదా :- ఎఱుగనైతిని,

నమ్మనేరనయ్యెదను

4) ఉభయు ప్రార్థనార్థకంలో 'కావించుదము' వంటి రూపాలున్నాయి. కాలాంతరంలో అవే కావించు - కావింతము అయ్యాయి.

5) నిషేధార్థకం :- ఏకవచనంలో 'వండకు, వండకుము' అని రెండు రూపాలున్నాయి.

నన్నయాదుల ప్రాచీన గ్రంథాల్లో ధ్వన్యనుకరణ శబ్దాల కొన్నిటి వాడుక జాతీయం అనాలి.

ఉదా :- మలమల మఱుంగుచు

వడవడ వడంకుచు

ఇట్టి వాడుక సర్వత్రా ఉంది. కొన్ని వాడుకలు ప్రస్తుతం మార్పుచెందాయి. ఇవి స్థూలంగా కవిత్రయ కావ్యభాషావిశేషాలు.



# 6. క్రీ.శ. 1600 - 1899 - కావ్యభాషా పరిణామం

ఆంధ్రభాషా సాహిత్య చరిత్రలో క్రీ.శ. 1600 - 1900 ల మధ్య కాలం పరిణామాత్మకమైంది. రాజకీయంగా ఒక మహాసామ్రాజ్యం అంతరించి, చిన్నచిన్న రాజ్యాలు ఏర్పడినట్లే, సాహిత్యంలో కూడ క్రమంగా వస్తున్న మార్గాన్ని వదిలిపెట్టి సరికొత్త ప్రక్రియలు భాషాపరంగా ఏర్పడ్డాయి. సాహిత్య చరిత్రలో ఈ యుగాన్ని క్షీణయుగమంటారు. కాని అనేక సాహితీ రీతులకు, భాషా విపరిణామాలకు నెలవైన ఈ యుగాన్ని అంతగా చిన్నచూపు చూడనవసరం లేదు. ఈ కాలంలో స్త్రీ పుంభేదము లేకుండ ప్రక్రియా వైవిధ్యంతోపాటు భాషాఛందో వైవిధ్యాన్ని సైతం కవులు ప్రదర్శించారు. తెలుగునాట వర్ధిల్లిన సాహిత్యమేగాక, బయటి ప్రాంతాలైన తంజావూరు, మధుర మొదలైనచోట్ల వర్ధిల్లిన యక్షగానాలు, నాటకాలు కూడ ఈ యుగసాహిత్యంలో భాగాలయినాయి.

ఆంధ్ర ప్రాంతంలోను, ఆంధ్రేతర ప్రాంతాలలోను ప్రవర్ధమానమైన తెలుగు సాహిత్యపు పోకడలు, భాషారీతులు ఈ వ్యాసానికి వస్తువులుగా ఉన్నాయి. ఈ కవులు ఆయా ప్రాంత మాండలికాల్ని, యాసల్ని రచనల్లో పొందుపరచారు. ఈ కాలపు రచనల్లో శిష్ట వ్యావహారికం, శిష్టేతర వ్యావహారికం రెండూ చోటుచేసుకోవటం గమనార్హం. ఆయా కవులు వాడిన అన్యదేశ్య పదాలలో తెలుగు భాషలోలేని కొన్ని వర్ణాలు కన్పిస్తాయి. ఆయా అన్యదేశ్య వర్ణాలకు సన్నిహితంగా ఉండే వర్ణాలనే వాళ్ళు వాడినారు. కాని ఆనాటి ఉచ్చారణ ఎలా ఉండేదో మనం ఇప్పడూహించలేము.

1. వర్ణ సమామ్నాయం

వర్ణాలలో అచ్చులకు సంబంధించినంతవరకు 'అ ఆ' లకు 'ఎ ఏ' లకు నడిమి ఉచ్చారణం గల్గిన 'అ ఆ' లు ఉన్నట్లు ప్రయోగాలవల్ల తెలుస్తున్నది. అయితే వీటికి ప్రత్యేక వర్ణాల గుర్తులు మన వర్ణసమామ్నాయంలో కల్పించుకోవటం జరుగలేదు.

'ఇత్తు' నకు హ్రస్వ 'అ' కారంతో సంధి చేసినపుడు హ్రస్వ అకారం, దీర్ఘ అకారంతో సంధి చేసినపుడు దీర్ఘ అకారం కన్పిస్తాయి.

1) హ్రస్వ అకారానికి

ఉదా :- బంతి + అనున్ - బంతనున్

అనవలసి + అంటి - అనవలసంటి

ఇన్ని+ అని - ఇన్నని

౨) దీర్ఘ అకారానికి

ఉదా :- మెంతి + ఆకు - మెంతాకు

కిళ్ల+ ఆకు - కిళ్ళాకు

తండ్రి + ఆన - తండ్రాన

ఋ కారం మనకు తత్సమ శబ్దాలలో మాత్రమే రావాలె. ఇది సంస్కృత వర్ణ సమామ్నాయం నుండి తెలుగులోనికి ప్రవేశించిన అచ్చు. అయితే అహోబిలపతి అనేలాక్షణికుడు ఈ వర్ణాన్ని దేశ్యపదాల్లో వాడాడు.

ఉదా :- ౹బుంగి - బృంగి

ఈ యుగంలో అన్యదేశ్యాల్లో వచ్చే వర్ణాలుతప్ప, హల్లుల గురించి చెప్పకోవలసిందేమీ లేదు. సాధురేఫ, శకటరేఫ భేదం ఎప్పడో అంతరించిపోయింది.

ఉదా :- చెఱకు - చెరకు

పఱచు - పరచు

తెలుగుపైన ఫార్సీ అరబీ భాషల ప్రభావం కాకతీయ సామ్రాజ్య పతనానంతరం ఆరంభమై బహ్మనీరాజ్య స్థాపనతో బలపడి, కుతుబ్షాహి పాలనతో స్థిరపడింది. అన్యదేశ్యాల్లో వచ్చే + x, y, z వర్ణాలకు సామ్యం కల్గిన 'ప ఫ, గ, జ' వర్ణాలనే తెలుగువారు వాడినారు. మనవర్ణమాలలో వీటికి ప్రత్యేకమైన గుర్తులు లేవు.

1) f () ఈ వర్ణాన్ని ఈ యుగకవులు 'ఫ'తో గుర్తించారు. ఇది దంత్యోష్ఠ్యమూ, నాదవిరహితమైన ఊష్మం. తెలుగు కవులు దీనికి మారుగా ఓష్ఠ్యమూ, నాదవిరహితమూ, మహాప్రాణమూ అయిన స్పర్శం వాడారు.

ఉదా :- ఫౌజులు, ఫిరంగీలు మొదలైనవి.

2) X () ఈ వర్ణాన్ని మనకవులు 'క, ఖ'లతో సూచించారు. ఇది కంఠ్యమూ, నాదవిరహితమూ ఐన ఊష్మం. మనవాళ్ళు మాత్రం దీనికి మారుగా నాదవిరహితమైన మహాప్రాణ కంఠ్యస్పర్శాన్ని, అల్పప్రాణ స్పర్శాన్ని ఉపయోగించారు.

ఉదా :- జమాఖర్చుల్

బందిఖానా

ఖబురు - కబురు

3) Y (e) ఈ వర్ణాన్ని మనకవులు 'గ'తో సూచించారు. ఇది నాదాత్మకమైన

కంఠ్యోష్మము. కాని మనవాళ్ళు నాదాత్మకమైన కంఠ్యస్పర్శంగా ఉచ్చరిస్తున్నారు.

ఉదా :- మొగలీ వ(జీడు

నిత్యవ్యవహారంలో వచ్చే అన్యదేశ్యాలు ఇలా ఉన్నాయి.

ఉదా :- గలీబు, గలీజు, గలీబు - వీటిల్లో వచ్చే వర్ణమిదే.

4) z (i) ఈ వర్ణాన్ని తెలుగులోని 'జ' కారంతో ముడిపెట్టారు. ఇది నాదాత్మకమైన దంతమూలీయోష్మం. కాని మనవాళ్ళు నాదాత్మకమైన తాలవ్య స్పర్శంతోనే సరిపెట్టుకున్నారు.

ఉదా :- బాబా వజీరు

బాజారు లోపల

రాచ వజీరు

1) నామప్రత్యయాలు:- ప్రథమైక వచన ప్రత్యయం ( డు, ము, వు) చేరటంతో ఈ యుగసాహిత్య భాషలో కొంత వైవిధ్యం కన్పిస్తుంది. వ్యాకరణం ప్రకారం మహదేకవచన ప్రత్యయం 'డుజ్' రావలసినచోట, రాని సందర్భాలు కొన్ని ఉన్నాయి. 'డుజ్' రాగూడనిచోట వచ్చిన సందర్భాలు కూడ ఉన్నాయి. అందులోనూ అన్యదేశ్యాలలో కన్పిస్తాయి.

ఉదా :- వజీరు - వజీరుడు - వ(జీడు

'ము' వైకల్పికంగా వచ్చే అసాధారణ పదాలు :-

ఉదా :- గద్దిగము - గద్దిగ

సయ్యాటము - సయ్యాట

సంసర్గము - సంసర్గ

వశము - వశ

'వు' గాగమ రూపాలు

ఉదా :- అంబువు - అంబు

వస్తువులు - వస్తులు

2) 'తోడ, తోడి' అనే ప్రత్యయాలకు 'తోటి' రూపాంతరం

ఉదా :- హరియించును 'తోటి' హాలాహలముంబోలెన్

3) పంచమ్యర్థంలోని 'ఉండి'కి వ్యవహారంలో విన్పించే 'నుంచి' నాటి కావ్యభాషలో ఉంది.

ఉదా :- పూని వదాన్యులంచు దమభూముల 'నుంచి'

ఇలాగే 'వలన'కు 'వల్ల' రూపాంతరముంది.

ఉదా :- కల్ల నావల్ల గోరంత కల్గనేని

4) షష్ఠీ ప్రత్యయమైన 'కు' కు ముందు చిన్నయసూరి సూత్రం ప్రకారం 'న' గాగమం వస్తుంది. ఇది ప్రాచీన కవితలోని శాస్త్రీయ ప్రయోగం. కాని ఈ యుగంలో 'న' కారంలేని ప్రయోగాలున్నాయి.

ఉదా :- నీ మనసుకె - 'మనసునకె' కు బదులు

'లోపల' ప్రత్యయానికి 'లో' ప్రయోగం

ఉదా :- వార్ధిలో

5) 'ఒద్ద' అనే అర్థంలో 'కడ' అనే పదానికి 'కాడ' అప్పకవీయంలోనే కన్పిస్తుంది.

ఉదా :- నా కాడ

'ఒద్ద'కు 'ఒద్ది' రూపం

ఉదా :- నీరజ నాభుడొద్ది

6) మహద్బహువచనంలో అదంత దీర్ఘపూర్వ లోపధం కాని శబ్దాలమీద కూడ 'రు' ప్రత్యయం నాటి కావ్యాల్లో ఉంది.

ఉదా :- సూతుర

'కూతు' శబ్దానికి ప్రథమైక వచనంలో 'రు' విధింపబడింది.

ఉదా :- కూతురు

కాని చిన్నయసూరి 'కూతురులు, కూతుళ్ళు, కూతురి' అనేవి గ్రామ్యాలన్నాడు. అయినా ఈనాటి సాహిత్యంలో 'కూతురి' ప్రయోగం కన్పిస్తున్నది.

ఉదా :- సొంపుల కూతురి

7) దీర్ఘాంతమైన అన్యదేశ్యాల తుది ఇ కారానికి బహువచనంలో ఉ కారాదేశం రాకపోవటం వ్యవహార భాషాపద్ధతి.

ఉదా :- శ్రీలు, స్త్రీలు, లకోరీలు లాగానే 'ఫిరంగీలు'

8) ఔపవిభక్తికాలు :- ఇ-టి-తి అనేవి ఔపవిభక్తికాలు. ఇవి తెలుగులో ద్వితీయాది విభక్తులపై వస్తాయి. అయితే ఒక్కొక్కప్పుడు ఔపవిభక్తికాలైన వాటిని అనౌపవిభక్తికాలుగాను, అనౌపవిభక్తికాలను ఔపవిభక్తికాలుగాను ప్రయోగించుట కద్దు.

ఎ) చేరంజని మఱు నాడు (మరుసటినాడు)

బి) పనసపంటికి (పనసపండుకు)

9) సంధి :- త్వరిత సంభాషణలో అచ్చంధులు, హల్సంధులు వస్తాయి. నాటి కావ్యభాషలో ఇవి చాల ఉన్నాయి. లాక్షణికులు అంగీకరించని తత్సమాచ్చంధులు,

శత్రర్థక సంధులు, ద్రుత ప్రకృతిక సంధులు, క్త్వార్థక సంధులు ఉన్నాయి.

ఎ) అచ్చంధి :- ఒక + అక్షర - ఒకక్షర

ఉదా :-

అ + ఆ - ఇంత + ఆదేవి - ఇంతాదేవి

అ + ఇ - తన + ఇచ్చ - తనిచ్చ

అ + ఈ - తప్పక + ఈక్షించి - తప్పకీక్షించి

అ + ఎ - తెల్ల + ఎల్ల - తెల్లెల్ల

ఇ + ఆ - మెంతి + ఆకు - మెంతాకు

ఇ + ఏ - అది + ఏంది - అదేంది

ఇ + ఐ- ఎన్ని + ఐన - ఎన్నైనా

ఎ + అ - నూనె + అంటె - నూనంటె

బి) హల్సంధి :- ఈ సంధులు వ్యవహారానికి మరీ దగ్గరగా ఉంటున్నాయి.

ఉదా :-

గ + క > క్క అడుగు + కొని - అడుక్కొని

ట + ల > ట్ల ఇంటి + లోకి - ఇంట్లోకి

డ + ర > డ్ర రెండు + రాగములు- రెండ్రాగములు

డ + న > న్న రెండు + నెల్లు - రెన్నెల్లు

సి) యడాగమాలు :- ఈ కావ్యభాషలో లక్షణ విరుద్ధమైన యడాగమాలు కన్పిస్తున్నాయి.

ఉదా :- బదులు + అనుచు - బదులు యనుచు

ఆనతి + ఇయ్యగ - ఆనతి యియ్యగ

ముపర్ణకానికి పుంప్వాదేశం జరుగని రూపాలు

ఉదా :- బొక్కసము + ఇండ్లు - బొక్కసమిండ్లు

టుగాగమం రాని రూపాలు

ఉదా :- పసుపు + ఆకుపందిరి - పసపాకుపందిరి

పసరంపెమ్ము

డి) సమాసాలు :- కావ్యభాషా విరుద్ధమైన సమాసాలు ఈ యుగ సాహిత్యంలో చోటుచేసుకున్నాయి.

ఉదా :- శూద్రబిడ్డ, బీగముద్రలు,

మూలబొక్కసంబు

ఇ) క్రియాపదాలు :- వ్యవహారబలంవల్ల కావ్యభాషలో చేరిన 1) శిష్టవ్యవహార సాధారణ రూపాలు 2) మాండలిక వ్యవహార సిద్ధాలు అని రెండు తెగల క్రియాపదాలు కన్పిస్తాయి.

వర్తమాన క్రియలు :- మిసమిస మెఱచుచు

'మెఱచు' అనేది మెఱయు ధాతురూపాంతరం. సాధారణ వ్యవహారంలోనిది కాదు.

ఇలాగే 'వెళ్ళగొట్టింప' అనే ప్రయోగంలోని ధాతువు అంతస్సంధివల్ల 'వెడలు' అనే ప్రాచీన ధాతురూపం నుంచి వర్ణసమీకరణం ద్వారా ఏర్పడ్డ రూపం.

సమాపక క్రియలు :- తెలియు, విడుచు, చంపు అనే కావ్యభాషా రూపాలకు పర్యాయంగా 'తెలుసు, ఎరుసు, సంపు' రూపాలు కన్పిస్తాయి. ద్విరుక్త అద్విరుక్త చకారాంత ధాతువులకు సవర్ణాంతరూపాలు వ్యవహారం నుండి ఈ యుగకావ్య భాషలోనికి వచ్చాయి.

ఉదా :- వస్తాడా, తెస్తాడా,
చూస్తాడా,
ఇస్తాడా

భవిష్యత్క్రియలు :- 'పెట్టేము, తెచ్చేము, ఇచ్చేము, చేసేము' ఇలాంటి వ్యావహారిక భవిష్యత్క్రియలు ఈకాలం కావ్యభాషలో చేరిపోయాయి.

తద్ధర్మార్థక విశేషణాలు :- ఎడు/ఎడి అనే తద్ధర్మార్థక ప్రత్యయాలకు వ్యవహారంలో ఏ/టి అనే రూపాలు కావ్యభాషలోకి వచ్చాయి.

ఉదా :- ఎఱిగేటట్టయితే,
వారిజాడ మెలగే,
నడచే వింతలు ఇత్యాదులు

ఎఫ్) అకప్రత్యయాంతాలు :- ఆత్మనే పదార్థంలో భూతకాలిక అసమాపక క్రియారూపాలలో వచ్చే 'కొని' కి – క/కు/క అనే పరిణత రూపాలు కావ్యభాషలోకి చేరాయి.

ఉదా :- ఎత్తుకపోయి
చేతబుచ్చుక
పట్టుక
చూచుక
చూరుబట్టుకు

పూరణార్థకమ్మైన 'అవ'కు మారుగా 'ఓ' అనే వ్యవహార సిద్ధరూపం కూడ ఈ కాలంలో ప్రయోగింపబడింది.

ఉదా :- పందొమ్మిదో ఛందమునను

స్త్రీ జనవ్యవహారంలో విన్పించే వినే (వినవే) అనే క్రియారూపం కూడ కావ్యభాషలో చేరింది.

యకారంబును 'వు వూ వొ వో' లును తెలుగు మాటలకు మొదట లేవని సూరి సూత్రించాడు. ఈ యుగ సాహిత్యంలో అవి కన్పిస్తాయి.

ఉదా :- తొట్ల వూచి,
వోరి జాణ

రెండు పదాలకు సంధి జరిగేటప్పుడు ఉత్తరపదం వకారాది అయితే 'వ' లోపించి సంధి జరగడం కూడ వ్యవహార లక్షణమే. ఇలాంటి ప్రయోగాలు ఈనాటి భాషలో చోటుచేసుకున్నాయి.

ఉదా :- ముసుగు + వేసుకొని - ముసుగేసుకుని
చేతి + వెంట - చేతెంట

జి) విశేష్యాలు- సర్వనామాలు- విశేషణాలు

ఉదా :- గడె, ఎల్లుండి, పదిమాళ్లకు, కొమాళ్ళు, కుమార్తె
చౌలు = చవులు
ఏడకు = ఎక్కడకు
ఆడాడ = అక్కడక్కడ
ఈడ = ఇక్కడ
ఏడ = ఎక్కడ
ముత్తేలు = ముత్యాలు
ఏంది = ఏమిటి?

హెచ్) లోపదీర్ఘత (Compensatory lengthening) ఉచ్చారణలో ఒక అక్షరం లోపించినందువల్ల కలిగే హ్రస్వత పోవడానికి పక్క అచ్చు దీర్ఘం కావటం.

ఉదా :- బైట = బయట

ద్విరుక్త హల్లుకు మారుగా అద్విరుక్త హల్లు

ఉదా :- కానిము = కానిమ్ము
గినెలై = గిన్నెలై

అద్విరుక్త హల్లునకు మారుగా ద్విరుక్తహల్లు

ఉదా :- అనతియ్యగ = అనతీయగ

చెయ్యియ్యదాయెగా = చేయి యీయదాయెగా

ఐ) అన్యదేశ్యాలు :- ఇవి ప్రతిభాషలోను తప్పక గ్రహింపబడతాయి. సాంఘికంగా, వాణిజ్యపరంగా, సాంస్కృతికంగా, ప్రాదేశికంగా ఇలాంటి అన్యదేశ్యాల్ని వాడక తప్పదు.

ఉదా :- బాబా వజీరు, కుళ్ళాయి

జమాఖర్చులు, బాజారు

సెబాసు, తేజీ,

పఠాణి తేజి,

హుజూరు



# 7. ఆర్యద్రావిడ భాషా సమ్మేళనంవల్ల తెలుగు ప్రభావితమైన విధం

ఆర్యభాషా సమ్మేళనం, ద్రావిడ భాషాసమ్మేళనం అనేవి రెండు విడివిడి అంశాలు. ఆధునిక భాషాశాస్త్రవేత్తల సిద్ధాంత ప్రాతిపదిక ననుసరించి సంస్కృత ప్రాకృతాది ఆర్యభాషలతో తెలుగు మొదలైన ద్రావిడ భాషలకు జన్యజనకతగాని, సోదరభావంగాని లేదని ధృవీకరించబడింది. అనేక చారిత్రక కారణాలవల్ల, ఆర్యద్రావిడ భాషలు చాలాకాలం సరిహద్దు ప్రాంతాలకు సంబంధించినవి కావటం వల్ల సంస్కృత ప్రాకృతాది ఆర్య భాషలవల్ల తెలుగుభాష విశేషంగా ప్రభావితమైందనటం నిర్వివాదం.

చారిత్రక దృష్టితో పరిశీలిస్తే, తెలుగు ప్రాంతాన్ని పరిపాలించిన శాలంకాయనులు, విష్ణుకుండినులు, ఇక్ష్వాకులు మొదలైన రాజన్యులు తమ పరిపాలనా విభాగంలోను, దానశాసనాల్లోను సంస్కృత ప్రాకృత భాషలనే వాడారు. తెలుగురాజ్యంలోని గ్రామనామాలు, దానగ్రహీతల పేర్లు, ఇంకా ఇతరుల నామధేయాలు చాలావరకు సంస్కృత భాషలో ఉన్నట్లు మనం గమనించగలం.

చాళుక్యులు విష్ణుకుండినుల నోడించి క్రీ.శ. 6 లేదా 7 వ శతాబ్దికే తెలుగునాట తమ రాజ్యాన్ని స్థాపించారని చరిత్ర చెబుతుంది. చాళుక్యులకంటె పూర్వం తెలుగునాటిని పాలించిన రెండవ విక్రమేంద్రవర్మ వేయించిన చిక్కుళ్ల సంస్కృత శాసనంలో 'విజయరాజ్య సంవత్సరంబులి' అనే సంస్కృత సమాసపదం కన్పించింది. ఈ పదానికి చివరి 'ంబులి' అనే ప్రత్యయం తెలుగు భాషకు స్వాభావికమైంది. దీన్నిబట్టి శాసనాదుల్లో అవిచ్ఛిన్నంగా వాడబడ్డ సంస్కృతభాష కాలక్రమేణా తెలుగుభాషకు చోటిచ్చిందని స్పష్టమవుతుంది. ఇక తూర్పు చాళుక్యులు వేయించిన శాసనాలు, ప్రాఙ్నన్నయయుగంనాటి తెనుగు భాషకు ఆధారమైనట్లు పరిశోధనలవల్ల తేలింది. వీరి సంస్కృత శాసనాల్లో గ్రామనామాలు, సీమలపేర్లు విపులంగా తెలుగుభాషలోనే వ్రాయబడినాయి. ఇవేకాక ఈ కాలంలో అచ్చమైన తెనుగు శాసనాలు కూడ ఆవిర్భవించాయి. ఫలితంగా తెనుగుభాష సంస్కృత ప్రాకృత భాషల సాహచర్యంచేత సరికొత్త రూపాన్ని సంతరించుకుని, రాజనరేంద్రుని ప్రోత్సాహంవల్ల నిలదొక్కుకుని నన్నయ భారతాంధ్రీకరణతో గ్రంథస్థమై విలసిల్లింది.

ఆంధ్రరాజన్యులు వైదికమతావలంబులు. సంస్కృతభాష వైదిక మత వ్యాప్తికి పట్టుగొమ్మ. దాని సంసర్గంవల్లనే దేశభాషలు ప్రభావిత మయ్యాయి. అంతేగాక జైనబౌద్ధులు తమ మత వ్యాప్తికి ప్రాకృతాన్ని ఆశ్రయించారు. సంస్కృత భాషా సాహాయ్యంతో తెలుగు మొదలైన దేశీయ భాషల్ని పరిపుష్టంచేసి, ప్రాకృతాన్ని ఆశ్రయించిన జైనబౌద్ధ మతాల్ని అణగద్రొక్కడానికి చాళుక్యుల ఆశ్రయం పొందిన దేశభాషా కవిపండితులకు సాధ్యమైంది. అందువల్ల రాజనరేంద్రుని ప్రోత్సాహంతో నన్నయభట్టు జయనామక సంస్కృత భారతాన్ని తెనుగుభాషలోకి పరివర్తనం చేశాడు. ఆనాటికి దేశభాషయైన తెలుగులోని వాడుకపదాలు భారతాంధ్రీకరణకు పూర్తిగా చాలలేదు. నన్నయ వ్యాసభారత కథనేగాక, ఆ భాషలోని మూడువంతులు శబ్దజాలాన్ని గ్రహించి భారతాంధ్రీకరణంలో అనుసంధించాడు. తత్సమశబ్దాల పేరిట దీర్ఘసంస్కృత సమాసాలు నన్నయ రచనలో పుంఖాను పుంఖంగా చోటుచేసుకున్నాయి. సంస్కృత పదాలకి డు, ము, వు, లు మొదలైన తెలుగు విభక్తి ప్రత్యయాల్ని చేర్చి నన్నయ కావ్యరచనలో అవకాశం కల్పించాడు.

ఉదా :- జయ్ + ఇంచు - జయించు

రంజ్ + ఇంచు - రంజించు

ఇవి తెలుగులో స్వార్థకమైన 'ఇంచుక్' ప్రత్యయాలు చేరినవి.

ఇక 'రంజింపించు, ధృవీకరింపించు' వగైరాలు స్వార్థకేంచుక్కుపైన 'ప్రేరణార్థక ఇంచుక్' చేరగా ఏర్పడ్డ పదాలు నన్నయ సంస్కృతాంధ్ర భాషాకోవిదుడు కాబట్టి భాషని విస్తృత పరచడానికి ఒక చక్కని ప్రణాళికని సిద్ధంచేసుకుని భారతభారతీ సముద్రాన్ని తరించాడని విశదమవుతుంది.

సంస్కృత వ్యాకరణాలంకార ఛందశ్శాస్త్రాలు తెలుగుభాషా వికాసానికి విశేషంగా తోడ్పడ్డాయి. వ్యాకరణ విషయానికివస్తే, నన్నయ మొదలు చిన్నయసూరి వరకు ఆంధ్రవ్యాకర్తలందరికి సంస్కృతంలోని పాణిని కౌముదియే ఒరవడి దిద్దింది. వస్తుతః భాష ద్రావిడభాషా సంబంధియేయైనా, తెలుగు వ్యాకర్తలు వ్యాకరణ రచనా ప్రణాళికని సంస్కృతం నుండి అరువుదెచ్చుకున్నారు. ప్రకరణాల విభజన, పరిచ్ఛేదకల్పన, పారిభాషిక పదావళి, సూత్రరచన, రూపనిష్పాదన ప్రక్రియ వంటి వ్యాకరణ ప్రణాళిక అంతా సంస్కృత వ్యాకరణం నుండి తెలుగుభాషలోకి దిగుమతి అయింది. తెలుగులోని సప్తవిభక్తి ప్రణాళిక, కృత్తద్ధిత విభాగం, సమాసాలు, వాక్యవిభజన, ప్రకృతి ప్రత్యయ విభాగం, క్రియాప్రకరణం వగైరా పాణినీయమాధారంగానే రూపొందింపబడింది.

నన్నయ రచించిన ఆంధ్రశబ్ద చింతామణికి సైతం సంస్కృత వ్యాకరణాను సంధానమే శరణ్యమైంది.

ఇక అలంకారశాస్త్రం :- ఇది సంస్కృత సాహిత్యానికి, రచనా శిల్పానికి ఆయువుపట్టు. తెలుగుకావ్య రచనకి అర్థసిద్ధిని, శిల్పరామణీయకతని సాధించిపెట్టినవి అలంకారాలే. ఉపమ, రూపకం, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, అర్థాంతరన్యాసం వంటి వందలకొలది అలంకారాలు సంస్కృతాలంకార శాస్త్రాల నుండి గ్రహింపబడినవే. వాటి సమ్మేళనంవల్ల తెలుగుభాషా సారస్వతాలు మిక్కిలి తేజోవంతమయ్యాయి. ఈ అలంకార సంయోగంతో తెలుగులోని ప్రబంధ యుగం సరికొత్త సొంపులు సంతరించుకుంది.

ఇక ఛందశ్శాస్త్రం ప్రాఙ్నన్నయ యుగంలో ఎడనెడ శాసనాల్లో కనిపించిన తరువోజ, సీసం, మధ్యాక్కర వంటి దేశీయ ఛందో భేదాలతో భారతంవంటి ఉద్గ్రంథాన్ని రచించటం సాధ్యంకాదని తలంచినందువల్లనే ఆదికవి నన్నయ మార్గకవితా సంప్రదాయ విధేయుడై సంస్కృత ఛందస్సు నుండి చంపకోత్పలమాలలు, శార్దూల మత్తేభ విక్రీడితాలు, స్రగ్ధర, మహాస్రగ్ధరాది వృత్తాల్ని గ్రహించి మహాభారతంలో చొప్పించాడు. అట్లని ఆయన తనకాలానికి వ్యాప్తిలో ఉన్న దేశిఛందోభేదాల్ని విస్మరించాడని చెప్పడానికి వీలులేదు. ఎందుకంటె ఇతివృత్తస్వభావం, పాత్రౌచిత్యం, సన్నివేశం తెలిసిన మహాకవి కాబట్టి నన్నయ సందర్భోచితంగా మార్గదేశి ఛందోభేదాల్ని రెండింటిని అనుసంధించి భారతాంధ్రీకరణాన్ని అనంతర కవులకు మార్గనిర్దేశకంగా రచించాడు.

ఇలాగే ప్రాకృతభాషా సంసర్గంవల్ల తెలుగులో అనేక తద్భవాలు చేరాయి. వీటిని మనవ్యాకర్తలు సంస్కృత ప్రాకృతభవాలుగా వర్గీకరించారు. యాదృచ్ఛికంగా వచ్చిచేరినవి, కల్పితాలు అయిన ఇలాంటి పదాలు తెలుగుభాషా విస్తృతికి ఉపకరించాయి. ఈ ఆధారాలవల్ల తెలుగుభాష సంస్కృత ప్రాకృత భాషాజన్యమని వాదించటానికి వీలులేదు, కాని కేవలం పరిపుష్టినొందిందని చెప్పవచ్చు.

2. ఇక ద్రావిడ భాషా సమ్మేళనంవల్ల తెలుగు ప్రభావితమైన అంశం పరిశీలించాలి.

భాషాశాస్త్రజ్ఞులు ద్రావిడ భాషల్ని 23 అని తేల్చారు. దక్షిణ ద్రావిడ భాషలు, మధ్య ద్రావిడ భాషలు, ఉత్తర ద్రావిడ భాషలని వీటిని మూడువిధాలుగా విభజించారు. అందులో తెలుగుని మధ్య ద్రావిడ భాషగా గుర్తించటం జరిగింది. ఈ విషయాన్ని మొదట బయట పెట్టినవారు శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తిగారు. ఈ

భాషలన్నీ క్రీ.శ. 1 వ శతాబ్దానికి పూర్వం ఊహాజన్యమైందని భావింపబడ్డ ఒకే మూల ద్రావిడభాష నుండి విడివడి స్వతంత్ర భాషలయ్యాయని భాషాశాస్త్రవేత్తల సిద్ధాంతం. ఈ భాషలన్నింటిని నిశితంగా తులనాత్మక పరిశీలన చేసిన శాస్త్రవేత్తలు ప్రత్యేక కుటుంబాలుగా పేర్కోవటం జరిగింది. ఈ విధమైన పరిశీలనకు 'కాల్డ్‌వెల్' అనే ఆంగ్ల పండితుడు మూలపురుషుడు. ఆయన దాక్షిణాత్య భాషల్ని ద్రావిడ భాషలని పేర్కొని, వీటన్నింటికి తుల్యలక్షణాలున్నాయని తేల్చిచెప్పాడు. 'Comparitive Grammar of Dravidian Languages' అనే ఒక తులనాత్మక వ్యాకరణ గ్రంథాన్ని రచించాడు. అతని రచనా సిద్ధాంతమే తర్వాతి భాషాశాస్త్రజ్ఞులకు ప్రాతిపదిక అయింది. ఈ భాషలన్నీ కూడ సంయోగాత్మక దశ (Agglunative Languages) లో ఉన్నాయని వారు కనుగొన్నారు.

ఈ భాషల్లో చాలాకాలంక్రిందట ప్రా.ద్రా. నుండి విడువడ్డ భాష తమిళం. ఇది మూలద్రావిడ భాషకు మిక్కిలి దగ్గరి సంబంధంగల భాష అని విశ్వసింపబడింది. క్రీ.శ. 1 వ శతాబ్దం నాటికే ఈ భాషలో 'తొల్కాప్పియనార్' అనే మహాకవి 'తొల్కాప్పియం' అనే గ్రంథం రచించాడు. తమిళ భాషలో ఇది చాలా ప్రామాణికమైన వ్యాకరణ గ్రంథం. ఇందులోని వ్యాకరణ సంప్రదాయాలు ఆర్యభాషా సంప్రదాయాలకు వేరై స్వతంత్రంగా రూపొందాయి. ఇందులోని వర్ణసమామ్నాయం ( అచ్చులు + హల్లులు) తెలుగు మొదలైన ద్రావిడ భాషాలక్షణాలతో అభిన్నంగా కన్పించాయి.

తమిళభాషలో 'ఋ, ౠ.          విసర్గలు, మహాప్రాణాక్షరాలు లేవు. తమభాషపై సంస్కృతభాషా సంప్రదాయం పడకుండ తమిళకవి పండితులు అత్యంత జాగ్రత్త గైకొన్నారు. కాని తెలుగు, కన్నడ, మలయాళ భాషాపండితులు అలాంటి జాగ్రత్త తీసుకోనందువల్ల ఈ భాషల్లో సంస్కృత వర్ణ సమామ్నాయం నుండి 1౨ అక్షరాలు అదనంగా వచ్చిచేరాయి. ఇవన్నీ తత్సమ పదజాలంతో తెలుగులో విశేషంగా ప్రవేశించాయని ముందు చెప్పకున్నాము.

పోతే, వింత ద్రావిడ వర్ణమని పేర్కొనబడ్డ '  ' కారం క్రీ.శ. 10వ శతాబ్దం వరకు అన్ని ద్రావిడ భాషల్లో ఉన్నట్లు శాసనాలవల్ల తేలింది. ఇది నన్నయ కాలానికి 'డ, ల, ళ, ట, ర' లుగా రూపాంతరం చెందింది. ఈ వర్ణోచ్చారణ క్లిష్టమవటంవల్ల నన్నయ తన రచనలో దాన్ని జారవిడిచాడు.

సంఖ్యావాచకాలు, సర్వనామాలు, ధాతువులు అనేవి ముఖ్యంగా భాషల జన్యజనకతని నిరూపించే మూలసాధనాలు. ద్రావిడ భాషలో ఇవన్నీ

సారూప్యంగలవై ఉన్నాయి. మూలద్రావిడం నుండి ఇవన్నీ దిగుమతియై తెలుగుభాష యొక్క దేశీయతని ప్రభావితం చేశాయి.

ప్రాచీనకాలంలో ద్రావిడ భాషలన్నీ హలంతాలై ఉండేవి. మూల ద్రావిడ పదాలు తెలుగులో పదాంతాన అచ్చుల్ని చేర్చుకొని అజంతాలుగా మారిపోయాయి. ఈ అజంతత, నామ, సర్వనామ, సంఖ్యావాచక, ధాతువుల్లో నియతంగా ఉన్నట్లు గమనింపవచ్చు.

ఉదా :-

| | |
|---|---|
| నామవాచకాలు :- | యానైగళ్ - ఏనుగులు |
| | మరమ్ - మ్రాను |
| | ముదల్ - మొదలు |
| సర్వనామాలు :- | నాణ్ - నేను |
| | యామ్ - మేము |
| సంఖ్యావాచకాలు :- | ఒరుత్తన్ - ఒకడు |
| | పత్ - పది |
| | నాల్ - నాలుగు |
| ధాతువులు :- | అగల్ - అగలు |
| | అమ్ - అమరు |
| | చెదర్ - చెదరు |
| | కూర్ - కూర్చు |
| | గెల్ - గెలుచు |

పై ఉదాహరణల్నిబట్టి తెలుగులోని దేశీయ పదాలన్నీ మూల ద్రావిడం నుండి విడువడ్డ తర్వాత మార్పుచెందాయని స్పష్టమవుతున్నది. తెలుగువాక్య నిర్మాణం ద్రావిడభాషా సహజమే. నామవాచకం లేదా విశేషణం క్రియచేసే పనిని తెల్పుతుంది. ఈ పద్ధతి ద్రావిడ భాషలన్నింట తుల్యంగా ఉంది.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | సీతనల్లదు | - | సీతమంచిది |
| | కుదిరెనల్లదు | - | గుఱ్ఱం మంచిది |
| | అవన్ రామ | - | వాడు రాముడు |
| | అవర్ ఆచార్యగళు | - | వారు ఆచార్యులు |

తెనుగు క్రియాంత ప్రత్యయాలన్నింటికి మూలద్రావిడ క్రియాంతాలే మూలం. తల, నెల, గుడి, మడి మొదలైన అచ్చతెనుగు పదాలన్నింటికి ద్రావిడభాషా

సమ్మేళనం నియతంగా కన్పిస్తుంది.

కన్నడభాష తెలుగుకంటె కొంతకాలం ముందే మూలద్రావిడం నుండి విడివడి స్వతంత్ర భాషగా రూపొందింది. ఈ భాషలో నృపతుంగుని కవిరాజ మార్గమనే లక్షణగ్రంథం అతి ప్రాచీనమైంది. ఇది క్రీ.శ. ౯వ శతాబ్ది నాటికే అవతరించింది. ఈ భాషలో ఆదికవి పంప క్రీ.శ. ౯౦౨-౯౦౪ మధ్యకాలంలో మహాభారతం రచించాడు. కన్నడ వాఙ్మయ ప్రభావం తెలుగుభాషపై కన్పిస్తుంది. నన్నయాది ఆంధ్రకవులకు ఛందోవిషయంలోను, సారస్వత విషయంలోను కన్నడభాష సహాయపడినట్లు భాషాపరిశోధకుల అభిప్రాయం. మొత్తంమీద తమిళ కన్నడ వాఙ్మయాల ప్రభావం తెలుగులో కన్పిస్తుంది. వాఙ్మయ విషయంలో ద్రావిడభాషా సమ్మేళనంతో తెలుగు ప్రభావితమైందనడం నిర్వివాదాంశం.



# 8. మధ్యద్రావిడ భాషలతో తెలుగుభాషకుగల సంబంధం

ప్రపంచ భాషల్ని భాషాశాస్త్రవేత్తలు కొన్ని కుటుంబాలుగా విభజించారు. భారతదేశంలోని నాల్గు భాషాకుటుంబాలలో ఇండో ఆర్యన్, ద్రావిడభాషా. కుటుంబాలు చాలా ముఖ్యమైనవి. ఉత్తర భారతదేశంలో ఇండో ఆర్యన్ భాషలు, దక్షిణ భారతావనిలో ద్రావిడ భాషలు వ్యవహారంలో ఉన్నాయి. ద్రావిడ భాషలు 23గా గుర్తించబడ్డాయి. అవి :-

1) దక్షిణ ద్రావిడ భాషలు :- 1. తమిళం 2. మలయాళం 3. కన్నడం 4. తుళు 5. కొడగు 6. కోత 7. తొద 8. బడగ.

2) మధ్య ద్రావిడ భాషలు :- 1. తెలుగు, 2. కుయి 3. కువి 4. కొండ 5. గోండి 6. కొలామి 7. నాయకి 8. పర్జి 9. మండ 10. గదబ 11. పెంగో 12. కోయ.

3) ఉత్తర ద్రావిడ భాషలు :- 1. కురుఖ్ 2. మాల్తో 3. బ్రాహుయి.

జన్యజనకతని ఆధారంగా నిడుకొని పై ద్రావిడ భాషలన్నింటిని ప్రధానంగా మూడు ఉపకుటుంబాలుగా పరిశోధకులు వర్గీకరించారు. ఈ భాషలన్నీ ఒకే మూల ద్రావిడ భాష నుండి పుట్టిన సోదర భాషలని పరిశోధకులు అంగీకరించారు. 'జనని సమస్త భాషలకు సంస్కృత' మనే ప్రాచీన సిద్ధాంతం మరుగునపడింది.

ద్రావిడ భాషల జన్యజనకతని, సోదర భావాన్ని మొట్టమొదట నిరూపించినవాడు 'కాల్డ్వెల్' అనే ఆంగ్లేయుడు. ఆయన ఒక మతప్రచారకుడుగానే దేశానికి వచ్చి, ద్రావిడ భాషలన్నింటిని అభ్యసించి 'Comparitive Grammar of the Dravidian of South Indian family Languages' అనే గ్రంథాన్ని రచించాడు.

తర్వాత 1927లో 'Linguistic Survey of India' అనే పేరుతో గ్రియర్‌సన్ అనే పండితుని పర్యవేక్షణలో పదకొండు సంపుటాలు వెలువడ్డాయి. నాల్గవ సంపుటంలో ద్రావిడ భాషలకు సంబంధించిన విశేషాలు పొందుపరచబడ్డాయి.

భాషలు మార్పుకు గురియౌతుంటాయి. ఎంత మారినా వాటి మధ్య సోదర సంబంధం మాసిపోదు. పోలికలు కన్పిస్తూనే ఉంటాయి. ద్రావిడ భాషల్లోగల ప్రత్యేక లక్షణాల్నిబట్టి పరిశీలిస్తే తెలుగు ద్రావిడ భాషా కుటుంబానికి సంబంధించిన భాష అని గుర్తించవచ్చు.

శబ్ద స్వరూపానుగుణ్యమైన విభాగాన్నిబట్టి గమనిస్తే ద్రావిడ భాషలు సంయోగాత్మక దశ (Agglunative Languages)లో నున్నాయని తెలుస్తుంది. అంటే అర్థభేదాన్ని సూచించటానికి ధాతువుపైన ధాతువు, పదంపైన మరోపదం చేరుతుంది. కాని సంస్కృతంలోగల ఉపసర్గలు గాని, ప్రత్యయాలుగాని చేరవు. తెలుగు కూడ ప్రత్యయ రహితమైన భాషయే.

తెలుగు లిపి, వ్యాకరణం, సంప్రదాయ సాహిత్య స్థితి కల్గిన నాగరిక భాష. దీనిమాదిరే అభివృద్ధి చెందిన ద్రావిడ భాషలు తమిళం, మలయాళం, కన్నడం. ఇవి మూడూ దక్షిణ ద్రావిడ ఉపకుటుంబానికి చెందినవి. నిర్మాణ దృష్ట్యా తెలుగు మధ్య ద్రావిడ ఉపకుటుంబానికి చెందినభాష.

మూల ద్రావిడ వర్ణాలు ఒక క్రమపరిణామానికి లోబడి తెలుగు లోనికి ప్రవేశించాయి.

1) వర్ణవ్యత్యయం :- వర్ణవ్యత్యయమనే ధ్వని మార్పు తెలుగు, పెంగొ, కుయి, కువి, గోండీ, కొండ, కోయ అనే భాషలలో కనబడుతుంది. ఈ మార్పు ఈ భాషలన్నీ ఏకభాషగా ఉన్నకాలంలో జరిగి ఉంటుంది. ఇవి మధ్యద్రావిడ భాషలు.

మూల ద్రావిడంలోని 'ఇ, ఉ'లు, అకారం పరమైనప్పుడు తెలుగులో 'ఎ, ఒ,లుగా మారుతాయి. ఇలా మారిన తర్వాతనే వర్ణవ్యత్యయం జరిగింది.

ఉదా :- 'ఇ' ఎ గా మారుట – ఇర్ > ఎర్ > రె

ఇరంటు > రెండు

'ఉ' ఒ గా మారుట – ఉల్ > ఒళ్ > లో (న)

2) తాలవ్యీకరణం :- ఇదొక ప్రసిద్ధమైన మార్పు. ఇ, ఈ, ఎ, ఏ లతో కూడివుండే పదాదికకారం చకారంగా మారటం – దక్షిణ ద్రావిడ భాషలైన తమిళ మలయాళల్లోనూ, మధ్య ద్రావిడ భాషయైన తెలుగులో కూడ జరిగింది. అయితే మూల ద్రావిడంలో తాలవ్యాచ్చు తరువాత మూర్ధన్యాక్షరం ఉంటే తమిళ మలయాళ భాషల్లో తాలవ్యీకరణం జరుగదు. తెలుగులో జరుగుతుంది.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | మూ. ద్రా | – | కిళి |
| | త. | – | కిళి |
| | తెలుగు | – | చిలుక |

అంతేగాక మూలద్రావిడంలోని 'అయ్' నుండి వచ్చిన 'ఏ' కారంతో కూడుకొనివున్న క కారం తెలుగులో చ కారంగా మారుతుంది. కాని తమిళ మలయాళ భాషల్లో క కారంగానే వుంటుంది.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | మూ. ద్రా | - | కై |
| | తమిళం | - | కై |
| | తెలుగు | - | చేయి |

ఈ రెండు భేదాలవల్ల తెలుగులో జరిగిన తాలవ్యీకరణం తమిళ మలయాళ భాషలలోని తాలవ్యీకరణం కంటె భిన్నమైందని, అందువల్ల తెలుగు దక్షిణ ద్రావిడ విభాగానికి చెందింది కాదని చెప్పవచ్చు.

3) బహువచన ప్రత్యయం నిత్యం :- తెలుగు, తక్కిన మధ్యద్రావిడ భాషల్లో బహువచన ప్రత్యయం నిత్యంగా ఉంటుంది. బహుత్వాన్ని చెప్పవలసి వస్తే బహువచన ప్రత్యయాన్ని తప్పక వాడాలి.

దక్షిణ, ఉత్తర ద్రావిడ భాషల్లో బహువచన ప్రత్యయం నిత్యంకాదు. అంటె బహువచన ప్రత్యయం లేకుండానే బహువచనార్థాన్ని సాధించవచ్చు.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | తమిళం | - | ఇరంటుమరం |
| | కన్నడం | - | ఎరడుమర |

కాని తెలుగులో 'రెండుచెట్టు' అనడానికి వీలుపడదు. 'రెండుచెట్లు' అని బహువచన ప్రత్యయంతోనే వాడాలి. దీన్నిబట్టి దక్షిణోత్తర ద్రావిడ భాషల్లో నిత్యంకాని బహువచనం తెలుగు మొదలైన మధ్యద్రావిడ భాషల్లో నిత్యమైంది. కూడుఖ్, మాల్తోలలో అసలు బహువచన ప్రత్యయమే లేదు. బ్రాహుయిలో క్ (అక్) అనే బహువచన ప్రత్యయమున్నా దీన్ని సందేహం కలిగేచోట్లతప్ప మిగతాచోట్ల వాడరు.

కాబట్టి దక్షిణ ద్రావిడ భాషల్లోను, ఉత్తర ద్రావిడ భాషల్లోను బహువచన ప్రత్యయం వైకల్పికం. అందువల్ల మూ. ద్రా. లో వైకల్పికమైన బహువచన ప్రత్యయం తెలుగులోనూ, మిగిలిన మధ్యద్రావిడ భాషల్లోనూ నిత్యమైనదిగా మారిందని చెప్పవచ్చు.

4) మూలద్రావిడంలో 'అవన్ట్' అనే మహదేకవచన సర్వనామం దక్షిణ ద్రావిడ భాషల్లో 'అవన్'గా మారింది. మధ్యద్రావిడంలో 'అవన్డ్'గా ఉంది. వర్ణవ్యత్యయంవల్ల 'వాన్డ్, వాండు, వాడు' అనే రూపాల్ని పొందింది. ఈ పరిణామం తెలుగు, ఇతర మధ్యద్రావిడ భాషల్లో కూడ జరిగింది.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఉదా :- | తెలుగు | కో | ప | కొండ | కూయి | కువి |
| | వాడు | ఆమ్డ్<br>అవన్డ్ | ఓద్/ఓడ్ | వాన్డు | ఆ అంజు | అఅసి |

పైవాటికి మూల మధ్యద్రావిడంలో మూలరూపం 'అవన్ఢ్' అనేది.

5) యుష్మదస్మదర్థకాలు :- తెలుగులో 'నీవు, ఈవు' అనేవి - ఇవి మూలద్రావిడంలోని 'నీన్' నుండి వచ్చాయి. ఈరు, మీరు, మీరలు, వగైరాలన్నీ కూడ మూ. ద్రా. లోని 'నీమ్/నీర్' నుండి గల్గినవే. వీటి ఔపవిభక్తిక రూపాలు నిన్/నీ, మిమ్/మీ వీటి మూ. ద్రా. రూపాలు నిన్-నిమ్. వీటిలో పదాది నకారం మూల మధ్యద్రావిడంలోనే లోపించి, 'ఇన్-ఇమ్'లుగా మారాయి. ఈ రూపాలు కోలామి, పర్జీ భాషల్లో కూడ ఇలాగే నిల్చి ఉన్నాయి.

వర్ణవ్యత్యయంవల్ల ఏర్పడ్డ 'నీ, మీ' అనే యుష్మదర్థకాల ఔపవిభక్తిక రూపాలు తెలుగు, గోండి, కొండ, పెంగో, మండ, కూయి, కువి అనే భాషల్లో సమానంగా ఉన్నాయి.

అస్మదర్థకాలు :- తెలుగులోని 'ఏను, నేను' అనే సర్వనామాలు మూ. ద్రా. లోని 'యాన్' నుంచి వచ్చినవి. ఏము, మేము అనేవి మూ. ద్రాలోని 'యామ్' నుంచి వచ్చినవి. వీటి ఔపవిభక్తిక రూపాలు నన్/నా, మమ్/మా. వీటి మూ. ద్రా. రూపాలు వరుసగా 'యన్, యమ్' వీటిలోని యకారం లోపించి ఇవి మూల మధ్యద్రావిడ భాషలో 'అన్, అమ్'లుగా మారాయి. కోలామి, పర్జీ భాషల్లో ఈ రూపాలు నేటికి అలాగే నిల్చి ఉన్నాయి. వర్ణవ్యత్యయ కారణంగా ఏర్పడిన యుష్మదస్మదర్థకాలైన నిన్/నీ, మిమ్/మీ, నన్/నా, మమ్/మా రూపాలు మధ్యద్రావిడ భాషలన్నింట సమానంగా ఉన్నందువల్ల తెలుగు మధ్యద్రావిడ భాషా సంబంధి అని చెప్పవచ్చు.

6) దక్షిణ ద్రావిడంలో భవిష్యత్సూచక ప్రత్యయాలు ప, వ లు. కాని అన్ని మధ్యద్రావిడ భాషల్లో ఇవి తకార దకారాలుగ వ్యాప్తిలో ఉన్నాయి.

ఉదా :- పోవుదురు, చూతురు వగైరాలు

7) తెలుగులో 'అ' వ్యతిరేక ప్రత్యయంగా అన్ని పురుష ప్రత్యయాల ముందు ఉంటుంది. కాని తమిళం, కన్నడం మొదలైన దక్షిణ ద్రావిడ భాషల్లోమాత్రం వ్యతిరేక ప్రత్యయమైన 'ఆ' అహమదేక వచన బహువచనాల ముందే వుంది. మిగిలిన పురుష ప్రత్యయాల ముందు దీని లోపరూపం ఉంటుంది. బ్రాహుయిలోనూ, తక్కిన మధ్యద్రావిడ భాషల్లోనూ తెలుగులోలాగే వ్యతిరేక ప్రత్యయం అన్ని పురుష ప్రత్యయాల ముందు ఉంటుంది. దీన్నిబట్టి తెలుగు మధ్యద్రావిడ భాషల్లో చేరిందని చెప్పవచ్చు. మూ. ద్రా. లోని వ్యతిరేక ప్రత్యయం 'ఆ' అనేది మధ్యద్రావిడ భాషల్లో 'అ'గా మారింది.

ఉదా :- చేయదు/చెయ్యదు - త. చెయ్యడు

చేయవు/చెయ్యవు - త. చెయ్య

8 క్త్వార్థకం:- మధ్యద్రావిడ భాషలన్నింటిలోలాగా తెలుగులో కూడ భూతకాలిక అసమాపక క్రియాప్రత్యయాలు 'ఇ-సి-చి' అనేవి.

ఉదా :- విని, తిని, చేసి, చూసి, వచ్చి, ఇచ్చి వగైరాలు

అనుచిత విభాగంవల్ల 'ఇ' కారానికి ముందున్న చ, కార స కారాలు కూడ మొదట్లో క్త్వార్థక ప్రత్యయానికి చెందినవే అని తెలుస్తుంది.

ఉదా :-

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| తె | గోం | కొండ | కూయి | కువి | పర్జి | గదబ |
| వచ్చి | వాసి | వాజి | వాడి | వాహ | వెరి | వరి |
| తెచ్చి | తచ్చీ | తసి | తస | | | |

సి, చి లు మధ్యద్రావిడ భాషల్లో కనిపిస్తుండడంవల్ల తెలుగు మధ్యద్రావిడ కుటుంబానికి చెందింది అని నిర్ధారించవచ్చు.

9) వ్యతిరేకక్త్వార్థకం :- తెలుగులో ఇది ధాతువుకు 'అక' చేర్చడంవల్ల ఏర్పడుతుంది. పర్జిలో కూడ దీనికి ప్రత్యయం 'అక'. గోండీలో దీనికి ప్రత్యయం - 'వాక్'

ఉదా :-

| తె | పర్జి | గోండీ |
|---|---|---|
| చూడక | చూడక | సూడువాక్ |
| రాక | వెరక | వాయ్‌వాక్ |

తెలుగులోని వ్యతిరేకక్త్వార్థకం పర్జి, గోండీ వ్యతిరేకక్త్వార్థక రూపాలతో సన్నిహితంగా ఉంది కాబట్టి తెలుగు మధ్యద్రావిడ భాష అని చెప్పడానికి వీలవుతుంది.

10) విధ్యర్థకాలు:- (మధ్యమ పురుష ఏకవచన బహువచనాలు) తెలుగులో విధ్యర్థక మధ్యమ పురుషైక వచన ప్రత్యయం 'ము'. విధ్యర్థక బహువచన ప్రత్యయాలు 'ట' కార 'ద' కారాలు ఇతర ద్రావిడ భాషల్లో ప్రథమైక వచన ప్రత్యయం లేదు. బహువచన రూపంలో 'మ' కారం ప్రత్యయంగా ఉంది.

ఉదా :-

త చెయ్యి, చెయ్యుమ్ - చెయ్యండి

కోత తిన్ - తిను - తినకు - తినండి

తెలుగులో వలెనే గోండీ, కోయ, కొండ, కూయి, కువి మొదలైన మధ్యద్రావిడ

భాషల్లో ఏకవచన ప్రత్యయం 'ము' గాను, బహువచన ప్రత్యయాలు టకార దకారాలుగాను ఉన్నాయి. కావున తెలుగు మధ్యద్రావిడ భాషా సంబంధి.

| | | |
|---|---|---|
| | ఏ.వ | బ.వ |
| ఉదా :- | గోండి సీమ్ | సీమ్‌ట్ |
| | కోయ | ఈము ఈమూటు |
| | తెలుగు | ఇమ్ము ఇండు |

ఉపసంహారం .- మూలద్రావిడ భాష నుండి తెలుగు ప్రత్యేక భాషగా రూపొందటాన్ని గూర్చి ఇంతవరకు వివేచించడం జరిగింది. తెలుగులో వచ్చిన పరిణామాలు తక్కిన మధ్యద్రావిడ భాషల్లో కూడ సమానంగా ఉండటంవల్ల తెలుగు మధ్యద్రావిడ భాషోప కుటుంబానికి చెందిందని భాషాశాస్త్రవేత్తల సిద్ధాంతం.

ప్రధానంగా 1) వర్ణవ్యత్యయం 2) యుష్మదస్మదర్థక సర్వనామాల ఔపవిభక్తి రూపాల పరిణామం 3) విధ్యర్థక రూపాల పరిమాణం అనే మూడు ముఖ్య పరిణామాలు తుల్యంగా ఉండడంవల్ల ఇది యేర్పడ్డకాలంలో ఈ భాషలన్నీ ఒకే భాషగా ఉండేవని భాషాశాస్త్రవేత్తలు నిర్ణయించారు.



# ౨. ధ్వని ప్రకరణం - ధ్వనులు వాటి వర్గీకరణ మరియు ఉచ్చారణ

(Phonology - Phoneme and their distribution and Pronounciation)

భాషకు ఉచ్చారణే ప్రధానం. భాషలోని వాక్యాన్నిగాని, పదాన్నిగాని విశ్లేషింపగా నేర్పడ్డ అత్యంత స్వల్పభాగానికి 'ధ్వని' యని పేరు. ఈ ధ్వనిని వ్యాకరణవేత్తలు 'వర్ణం' అంటారు. వర్ణాలు ఒక్కొక్క భాషకు ఒక్కొక్క రకంగా ఉంటాయి.

సంస్కృత భాషలో "భాషానామ భావప్రకాశకో వర్ణాత్మక శ్శబ్దః" అని భాషాశబ్దానికి నిర్వచనం చెబుతారు. భావాన్ని వ్యక్తీకరించే వర్ణమాలతో కూడిన శబ్దమే 'భాష' అని ఆ నిర్వచనం చెబుతుంది. అంటే వర్ణాల కూర్పుతో ఏర్పడ్డ శబ్దం అర్థవంతంగాను, భావబోధకంగాను ఉండాలి. ఈ శబ్దం ఏకవర్ణంతోగాని, అనేక వర్ణాలతోగాని కూడి ఉండవచ్చు. ఏ రకమైన భావాన్ని ప్రతిబింబించని శబ్దం భాష అనిపించుకోదు.

I. వర్ణసమామ్నాయం :- భాషకు మూలమైంది వర్ణమాల. దీన్నే వర్ణ సమామ్నాయమంటారు. తెలుగు భాషలో 'అచ్చులు, హల్లులు' ఉభయాక్షరాలని మూడు విధాలుగా వర్ణాలున్నాయి.

అచ్చులు :- వీటిని స్వరాలని, ప్రాణాలని వ్యవహరిస్తాం.

అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ

ఉభయాక్షరాలు:- ం (సున్న) ఁ (అరసున్న)

ః విసర్గలు (ఇవి సంస్కృతం నుండి వచ్చాయి)

హల్లులు :- కగ, చ ౘ, జ ౙ, ట డ ణ, త ద న, ప బ మ,

య, ర, ల, వ, స, హ, ళ, ఱ

తెలుగులో అతి ప్రాచీనకాలం నుండి 'ఱ, ళ' అనే రెండు వర్ణాలు ఉన్నాయి. వైయాకరణులు 'ర, ల' లను లఘురేఫలని, 'ఱ, ళ' లను అలఘురేఫలని వర్గీకరించారు.

Note :- సంస్కృత భాషా సంసర్గంవల్ల తెలుగులో అదనంగా వచ్చిన వర్ణాలు పందొమ్మిది. అవి -

ఋ, ౠ, ఀ ః, ఖ, ఘ ఙ, ఛ ఝ ఞ, ఠ ఢ, థ ధ, ఫ భ, శ ష -

ప్రాచీన ద్రావిడ భాషల్లో ఆద్యమైందని భావింపబడే తమిళ భాషపై ఈ అక్షరాల

ప్రభావం పడలేదు.

౨. ధ్వనుల వర్గీకరణము :- ఏ భాషలోనైననూ ధ్వనుల్ని కొన్ని వర్గాలుగా విభజించటం అవసరం. ఆంధ్రభాషలో ఈ వర్గీకరణం త్రివిధంగా ఉంది.

అ) అచ్, హల్ విభాగం :- తెలుగులో ధ్వనుల్ని అచ్చులు, హల్లులు, ఉభయాక్షరాలని మూడుగా విభజించడం జరిగింది. అచ్చులకు స్వరాలని, ప్రాణాలని మరి రెండు పేర్లున్నాయి. అరవ భాషలో వీటిని 'ఉయర్' అంటారు. అచ్చులకు స్వతంత్రోచ్చారణ ఉంటుంది. అందుకే అవి 'ప్రాణాలు' అని పేర్కొబడ్డాయి. అంటే అచ్చులు ఇతర వర్ణాల సాహాయ్యాన్ని అపేక్షించక స్వతంత్రోచ్చారణ గలవై ఉంటాయి.

| | | |
|---|---|---|
| హ్రస్వాచ్చులు | - | అ, ఇ, ఉ, ఋ, , ఎ, ఒ |
| దీర్ఘాచ్చులు | - | ఆ, ఈ, ఊ, ౠ, , ఏ, ఓ |
| నిత్యదీర్ఘాలు | - | ఐ, ఔ |

ఆ) హల్లులకు వ్యంజనాలు, ప్రాణులు అనేవి పర్యాయ పదాలు. ఉచ్చారణలో ఇవి అచ్చుల సాహాయ్యాన్ని అపేక్షించటంవల్ల 'వ్యంజనాలు' అని పేర్కొబడ్డాయి. 'క్, ఖ్, గ్, ఘ్' అనే హల్లుల్ని యథాతథంగా ఉచ్చరించడం కుదరదు. వాటికి అచ్చుల్ని చేర్చి 'క, ఖ, గ, ఘ' అనే రీతి ఉచ్చరిస్తారు. అచ్చులు ప్రాణములు గావున అవి చేరుటవల్ల హల్లులకు ప్రాణులు అనే పేరు సార్థకమైంది. అరవ భాషలో వీటికి 'మెయ్' అనేది సంకేతనామం. 'మెయ్' అంటె శరీరమని అర్థం.

Note :- హల్లుల్లో 'క చ ట త ప, గ జ డ ద బ'లు అల్పప్రాణులు
'ఖ ఛ, ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ'లు మహాప్రాణులు

శ్వాసనాదవిభజనం :- ప్రాణుల తలకు దిగువ, రొమ్ముకు పైన 'గొంతుముడి' ఉంది. దీన్ని 'గళగ్రంథి' అంటాము. ఆంగ్లంలో 'LARYNX' అని అనటం కద్దు. ఈ గళగ్రంథిలో 'స్వరపేటిక' ఉంది. అదే "GLOTTIS" ఈ పేటికలో రెండు నాదతంత్రులున్నాయి. శ్వాసనాళంలో నుండి వాయువు నాదతంత్రుల నడుమగా వెలువడి నోటి నుండిగాని ముక్కు నుండిగాని వెలువడుతుంది. అప్పుడు ధ్వనులు ఉత్పన్నమవుతాయి.

నాదతంత్రులు పరస్పరం దూరంగా ఉండి, వాని నడుమ నుండి ఏ అవరోధం లేకుండ సులభంగా వాయువు వెడలేటప్పుడు ఉచ్చరించబడే ధ్వనుల్ని 'శ్వాసములు' లేదా 'అఘోషములు' అని పేర్కొంటారు. వీటిని ఆంగ్లంలో 'UNVOICED SOUNDS' అంటారు. హల్లుల్లో క ఖ, చ ఛ, ట ఠ, త థ, ప ఫ, శ

ష స అనే వర్ణాలు 'శ్వాసములు'.

నాదతంత్రులు పరస్పరం సన్నిహితంగా ఉండగా వాటి మధ్యలో నుండి ఒరసికొంటూ వాయువు వెడలినప్పుడు ఉచ్చరింపబడే ధ్వనుల్ని 'నాదములు' అని, 'ఘోషములు' అని పిలుస్తారు. ఆంగ్లంలో వీటికి 'VOICED SOUNDS' అని పేరు. అచ్చులన్నీ నాదాలే. హల్లుల్లో గ ఘ ఙ, జ ఝ ఞ, డ ఢ ణ, ద ధ న, బ భ మ, య ర ల ళ వ హ అనేవి నాదాలు.

స్పర్శాది విభాగం :- నాలుకలోని ఒక భాగం నోటిలోని ఒక భాగాన్ని స్పృశించుటవల్ల ఉచ్చరింపబడే వర్ణాలకు 'స్పర్శములు' అని పేరు. ఈ వర్ణాల్ని ఉచ్చరించేటప్పుడు శ్వాసనాళం నుండి వెలువడే వాయువు రుద్ధమై (అడ్డగింపబడి) ఒక్కసారి విడువబడుతుంది. ఈ లక్షణాన్నిబట్టి స్పర్శములకు 'స్ఫోటములు' (Plosives) అనే పేరు గల్గింది.

క ఖ, గ ఘ, చ ఛ, జ ఝ, త థ ద ధ, ప ఫ బ భ అనే 18 వర్ణాల్ని 'స్పర్శములు' లేదా 'స్ఫోటములు' అంటారు.

3 ధ్వని స్థానాలు:-

1) కంఠ్యములు :- గొంతు నుండి వెలువడే వర్ణాలు

ఉదా :- 'అ ఆ, క ఖ గ ఘ ఙ, హ, :'

2) తాలవ్యములు :- నాలుక కొన అంగిటిని తాకుటవల్ల కలిగే వర్ణాలు

ఉదా :- 'ఇ ఈ చ ఛ జ ఝ య శ' వీటిని ఆంగ్లంలో 'Palatal' అంటారు.

3) మూర్ధన్యములు :- జిహ్వాగ్రాన్ని కొంచెం పైకెత్తి, వెనుకకు మడచి, మూర్ధన్యాన్ని స్పృశించటంవల్ల ఇవి ఏర్పడతాయి.

ఉదా :- 'ఋ, ౠ, ట ఠ డ ఢ ణ ర ళ ష'

వీటిని ఆంగ్లంలో Cerebrals లేదా Retroflexes అంటారు.

4) దంత్యములు :- జిహ్వాగ్రం ముందరి పండ్ల యొక్క వెనుక భాగాన్ని స్పృశించటంవల్ల దంత్యాలు పుడతాయి.

ఉదా :- 'ఇ ఇ, చ, ఛ, ఝ న ల స'

5) ఓష్ఠ్యములు :- పెదిమల సాయంతో నుచ్చరింపబడే వర్ణాలు.

ఉదా :- 'ఉ ఊ ఒ ఓ ఔ ప ఫ బ భ మ వ

Note :-

1) వకారాన్ని దంత్యోష్ఠ్యమంటారు. పండ్లు, పెదిమల సాయంతో ఈ వర్ణముచ్చరింప బడుతుంది.

౽) 'ఎ, ఏ, ఐ' అనే మూడు వర్ణాలు కంఠం యొక్క,తాలువు యొక్క సాయంతో నుచ్చరించబడతాయి. కావున వీటిని 'కంఠ్యతాలవ్యము' లంటారు.

౩) 'ఒ ఓ ఔ' అనే మూడు వర్ణాల్ని 'కంఠోష్ఠ్యములు' అంటారు. ప్రయత్న భేదాల్నిబట్టి, స్థానకరణ భేదాల్నిబట్టి ఇలాగా అచ్చుల్ని, హల్లుల్ని భాషాశాస్త్రజ్ఞులు అనేక విధాలుగా విభజించారు. ఈ శాస్త్రీయ పద్ధతిని సరిగా అనుసరిస్తే ఉచ్చారణ దక్షత ఏర్పడుతుంది.

4.ధ్వనుల మార్పులు - మాటల్ని ఉచ్చరించేటప్పుడు కొన్నింటిని తేల్చిపల్కటం, కొన్నింటిని ఒత్తిపల్కటం, మరికొన్నింటిని మధ్యస్థంగా పల్కటం అనుభవసిద్ధమైన విషయం. ఈ విధంగా ఆరోహణ, అవరోహణ క్రమంలో ఉచ్చరించటాన్ని 'స్వరం' అంటాం. ఉచ్చారణ సమయంలో కంఠమందలి నాదతంత్రులు ప్రకంపించే వేగాన్నిబట్టి స్వరముంటుంది. దీన్ని ఆంగ్లంలో 'Pitch Accent' అంటారు. ఉచ్చారణ కాలంలో నాదతంత్రులు సాగే దూరాన్నిబట్టి 'ఊనిక' కల్గుతుంది. ఏదేని ఒక మాటని ఒత్తి పలుకవలసి వచ్చినపుడు గట్టిగాను, బలంగాను ఉచ్చరించటం స్వాభావికం. ఈ ఊనికని ఆంగ్లంలో 'Stress Accent' అంటారు.

ఉచ్చారణలో సంభవమయ్యే ఇలాంటి పెక్కు మార్పులకి ఊనిక, స్వరం అనేవి రెండూ ముఖ్య కారణాలు. భాషాస్వభావాన్నిబట్టి కొన్ని అక్షరాలు సంయోగం చెందటం, విడిచిపెట్టటం, తొలగటం లేదా అదనంగా చేరటం జరుగుతుంది. ఉచ్చారణలో జరిగే మార్పులకి ఈ దిగువ సూచించేవి ముఖ్య కారణాలు.

౧)స్వరప్లుతి:- ద్రావిడ భాషల్లో మాటకి తొలియక్షరంపై 'ఊనిక' ఉంటుంది. ఆ మాట మార్పుకు గురికాదు. ఊనిక తర్వాతి అక్షరం పైకి మారినపుడు మొదటి అక్షరం జారిపోతుంది. ప్రాచీన ద్రావిడ భాషలో వ్యతిరేకార్థమందు 'అ కాదు' అని వుండగా తెలుగు భాషలో 'అ' జారిపోయి 'కాదు' అనే క్రియారూపం స్థిరపడింది.

౽)వర్ణవ్యత్యయం:- ఒక పదంలోని అక్షరక్రమం వ్యక్తి యొక్క త్వరవల్లగాని, అశ్రద్ధ లేక అజ్ఞానంవల్ల మార్పు చెందుతుంది.

'ఉరల్' అనే పదంలోని 'ఉకారం' తర్వాతి రేఫపైపడి 'రోలు' అనే పదమేర్పడింది.

ఉదా :- ఇరండు - రెండు

ఇరప్పు - రేపు

నవ్వులాట - నవ్వుటాల

తడువుకొను - తవుడుకొను

3)అనుచిత విభాగం భాషలో కొన్నిపదాల్ని విభజించేటప్పుడు వ్యాకర్తలు లేదా వ్యవహర్తల అనుచిత వైఖరివల్ల అవి కాలాంతరంలో అలాగే నిలబడిపోతాయి. ఇందుకు అనుచిత విభాగమే ముఖ్య కారణం. (Wrong Splitting)

ఉదా :- ప్రా. ద్రా లో - తెలుగులో

ఎళికల్ - ఎలుక

కిళికళ్ - చిలుక

యానైకళ్ - ఏనుగు

4)స్వరాకర్షణం ముందువెనుకల ఉన్న అచ్చుల ఆకర్షణవల్ల ఒక అచ్చు మార్పు చెందవచ్చు. (సమస్వరత)

ఉదా :- హరి+కు - హరికి

కలికి+లు - కలుకులు

ములికి+లు - ములుకులు

ఎదుట+కి - ఎదుటికి

5)సంప్రసారణవిధి :- సంస్కృత భాషలో 'ఇ ఉ ఋ ' స్థానంలో వరుసగా 'య వ ర లు' ఆదేశమవుతాయి. ఇదే యణాదేశ సంధికార్యం. తెలుగు భాషలో ఈ పద్ధతి చాలా తక్కువ. అయితే 'ఒ' కారం పదాదిలోగాని, పదమధ్యంలోగాని 'వ'గా మార్పు చెందుతుంది. ఇది కూడ సంప్రసారణమే.

తెలుగులో

ఉదా :- అతి + అంతము - అత్యంతము

మధు + అరి - మధ్వరి

పితృ + ఆజ్ఞ - పిత్రాజ్ఞ

ఒద్ద - వద్ద

ఒదలు - వదలు

ఒరవడి - వరవడి

6)సమీకరణం(Assimilation) :- రెండు విభిన్న వర్ణాలు కూడితే సమీకరణం ఏర్పడుతుంది. అంటే విజాతీయమైన రెండు వర్ణాలు లేదా స్వల్పభేదంగల రెండు వర్ణాలు సంయుక్తాలైనపుడు ఏకరూపాలేర్పడు తాయి. ఇలా జరగడానికి ఉచ్చారణ క్లేశమే కారణం.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | ప్రకృతి | - | వికృతి |
| | భక్తి | - | బత్తి |
| | కృష్ణ | - | కన్న |
| ఇట్లే, | కలదు | - | కద్దు |
| | వలదు | - | వద్దు |

7) వర్ణవిభేదం(Dissimilation) :- ఒకే ధ్వని ఒక శబ్దంలో మిక్కిలి సమీపంగా ద్విరుక్తమైనపుడు మార్పు చెందుతుంది. ఇది కూడ ఉచ్చారణ సౌకర్యాపేక్షతో ఏర్పడ్డ మార్పే.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | ల్యాటిన్ భాషలో | - | ఇంగ్లీషులో |
| | 'పెరిగ్రినమ్' | - | 'పిలిగ్రిమ్' |

Note :- ల్యాటిన్ పదంలోని 'రి' - ఇంగ్లీష్‌లో 'లి'గా మారింది. 'న' లోపించింది.

| | | | | |
|---|---|---|---|---|
| ఇట్లే | ఉదా :- | బాల + లు | - | బాలురు |
| | | కృ + కృ | - | చకృ |

8 తాలవ్యీకరణం (Palatalisation) :- ప్రాచీనమైన భాషల్లోని 'క' కారం 'చ' కారంగా మార్పు చెందింది. ఈ మార్పు అనేక భాషల్లో ఉంది.

ఉదా :- సంస్కృత భాషలో 'చరుః' అనేదొక పదం. ఇది ల్యాటిన్‌లో 'కెరు'గా ఉంది.

ఇట్లే వాక్ - వాచ్ అయింది.

ఈ మార్పుని ద్రావిడ భాషల్లోను గుర్తింపవచ్చు.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | అరవం | - | తెలుగు |
| | కిళి | - | చిలుక |
| | కయ్ | - | చేయి |
| | కిఱు | - | చిఱు |
| | కెఱు | - | చెరువు |



# 10. పదనిర్మాణం, కృత్తద్ధితాలు

(Morphology of Nouns and Verbs)

పదం, పదాంశం అనే రెండుమాటలు భాషలో విన్పిస్తున్నాయి. పదమనగా కొన్ని ధ్వనుల సమూహం. ఇవి ఏకాక్షరాలుగానూ, అనేకాక్షరాలుగనూ ఉండవచ్చు. దీన్ని ఆంగ్లంలో 'word' అంటాం.

ఉదా :- తల, వల, అన్న, అక్క, రా, పో.

Go, Come, Boy, Girl వగైరాలు.

ఈ సందర్భంలోనే 'పదాంశం' అనేది కూడ వాడుకలో ఉంది. దీనికి 'పదంలోని ఒక అంశం' అనే అర్థం చెప్పాలి.

ఉదా :- పోవచ్చు, ఇందులో 'పోవు' అనే క్రియా పదానికి 'వచ్చు' అనే అనుబంధ క్రియ చేర్చబడింది. కాబట్టి 'వచ్చు' అనేది ఒక పదాంశమని గుర్తించాలి.

భాషాశాస్త్రవేత్తలు ఈ సందర్భంలో 'Morpheme' అనే పారిభాషిక పదాన్ని వాడారు. దీనికి పదం లేదా పదాంశం అని స్థూలంగా అర్థం చెప్పారు. కాని 'Morpheme' అనే పారిభాషిక పదానికి తుల్యంగా 'పదం' అనే మాట వాడరాదు. ఎందుకంటె 'Morpheme' కు అర్థం ప్రధానం. పదం (word) అర్థప్రధానం కావచ్చు, కాకపోవచ్చు కాబట్టి, 'Morpheme' అనేదానికి 'అర్థకం' అని తెలుగులో నామకరణం చేయుటం జరిగింది. దీన్ని 'Leonard' (Bloomfield) అనే ఆంగ్లభాషావేత్త ఇలా నిర్వచించాడు.

"A linguistic form which bears no partial phonetic or semantic resemblance to any other form" ధ్వనిలోగాని అర్థంలోగాని లేదా ఏ ఇతరాంశంలోగాని పాక్షికమైన పోలికలేని భాషాంశం అర్థకమౌతుంది.

ఇతర ఆంగ్లభాషావేత్తలు B. Block QGL Trager అనేవారు ఇలా నిర్వచించారు. "Any form whether free or bound which can not be divided into smaller meaningful parts is a Morpheme"

(అర్థవంతమైన భాగాలుగా విభజించడానికి వీలులేని, స్వతంత్రంగాని, అస్వతంత్రంగాని అయిన అంశం అర్థకం)

అర్థకాల్లో విడదీయటానికి వీలుగాని నామరూపాల్ని ధాతురూపాల్ని మొదట పరిశీలిద్దాం.

ఉదా :- ఇల్లు, ఊరు, పని, చొక్కా మొ...

ఇల్లు :- దీనిలో ఇ + ల్ + ల్ + ఉ అనే విడివిడి ధ్వనులున్నాయి పై నాల్గు ధ్వనులతో కూడిన 'ఇల్లు అనే మాటకు అర్థముంది కావున ఇదొక అర్థకం అవుతుంది విడగొట్టబడిన ప్రత్యేక ధ్వనులకు అర్థం లేదు

ఇట్లే :- ఊరు > ఊ + ర్ + ఉ

పని > ప్ + అ + న్ + ఇ

చొక్కా > చ్ + ఒ + క్ + క్ + ఆ

పై విభజననిబట్టి విడిధ్వనులకు అర్థముండదని అవి కలియడంవల్ల అర్థమేర్పడుతుందని విశదమైంది

అయితే కొన్ని సందర్భాల్లో ఒకే ధ్వని అర్థవంతంగా ఉంటుంది

ఉదా :- ఆ కొండ

ఈ ఊరు

ఏ ఇల్లు

పై మూడు ఉదాహరణలలో ప్రథమ పదాలైన ఆ ఈ ఏ అనే నిర్దేశార్థకాలకు విడివిడిగానైనా అర్థముంది కావున ఇవి అన్యపదాలతో కలిసినా విడిగా ఉన్నా అర్థవంతమైన పదాలు

మరికొన్ని మాటల్లో ఆ-ఈ-ఏ లు ఉంటాయి అక్కడ విడదీస్తే వాటికర్థాలుండవు

ఉదా :- ఆకలి

ఈగ

ఏనుగు

పై ఉదాహరణలు మూడింటిలో ఆ ఈ ఏ లకుగాని వాని నుండి విడదీయబడిన భాగాలకు (కలి గ నుగు) గాని అర్థం లేదు

ఈ వివరణనిబట్టి కొన్నిమాటల్ని చిన్నచిన్న ముక్కలుగా విడగొట్టలేమని స్పష్టమవుతున్నది భాషలో మరికొన్ని మాటల్ని అర్థవంతమైన చిన్న ముక్కలుగా విడగొట్టవచ్చు కొన్ని ఉదాహరణలు :- ఏనుగులు అమ్మకు వంట చెప్పదును

మొదటిమాట ఏనుగులు ఇందులో ఏనుగు లు అనే రెండు విడిభాగాలున్నాయి మొదటి పదం ఏనుగు ఏకార్థాన్ని సూచించగా లు బహ్వర్థాన్ని సూచిస్తుంది కావున ఇవి అర్థవంతమైన రెండు ముక్కలు ఇక్కడ అర్థం రెండురకాలు

(ఎ) ఏనుగు - నైఘంటికార్థం (Lex ca Mean ng)

(బి) లు - వ్యాకరణార్థం (Grammat ca Mean ng)

అమ్మకు అనే ఉదాహరణాన్ని ఇలాగే గ్రహించాలి

అమ్మ - నైఘంటికార్థం

కు - వ్యాకరణార్థం

Note :- లు కి కు వంటి అంశాలకు ప్రత్యయాలని పేరు ప్రత్యయాలు చేరని భాగాలకు ప్రకృతులు అని పేరు లేదా వీటిని ప్రత్యయ రహిత నామాలని అనవచ్చు

వంట - ఇదొక కృదంతం

వండు - దాతువు దానిపై భావార్థకంలో కృత్ ప్రత్యయంచేరి

వంట అయింది ఇచ్చటి ట కారం క్రియార్థ సూచకమని గ్రహించాలి

ఇలాంటివే :- కోయు + త - కోత

కలుగు + ఇమి - కలమి ము

కోయు కలుగు దాతువులు : త ఇమి లు క్రియార్థక ప్రత్యయాలు

ఇతరోదాహరణాలు :-

) చెప్పినాను :- చెప్ప - దాతువు

ఇ - భూతకాలిక ప్రత్యయం

నాను - నేను కు రూపాంతరం

పై మూడు కూడ అర్థవంతమైనవే

౨) విన్నాము :- విను - దాతువు

ఆ - భూతార్థకం

ము - మేము కు రూపాంతరం అవ శిష్టమన్నమాట

పై మూడు కూడ అర్థవంతమైన విడిభాగాలే

మన ప్రాచీన వైయాకరుణులు నామవాచకంలో ప్రదాన భాగాన్ని ప్రాతిపదిక అని క్రియలో ప్రదాన భాగాన్ని ధాతువు అని వ్యాకరణాంశంగల అస్వతంత్ర అంశాన్ని ప్రత్యయం అని వ్యవహరించారు పై మూడు పారిభాషికాలు అర్థవంతమైనవే అయినప్పటికి అర్థవంతమైన చిన్నముక్కలుగా విడదీయటానికి వీలుపడవు కావున వీటిని సంగ్రహంగా కనిష్టార్థవంతమైన అంశాలుగా గుర్తించాలి ఈ ఒరవడిలోనే కృదంతాలకు తద్ధితాలకు సమాసాలకు కూడ ఈ ప్రాతిపదిక సంజ్ఞ వ్యాప్తి చేయబడింది అలాంటి ప్రాతిపదికల్ని అర్థవంతమైన భాగాలుగా విడదీయవచ్చని తేలింది

ఎ) కృదంతాలు:- ధాతువులపై 'ఇమి క త పు ఇడి అ ట పోతు బడి తల కడ ము ప్రత్యయాలు చేరటంవల్ల కృదంతాలు ఏర్పడతాయి

| | | | | |
|---|---|---|---|---|
| | - | 2 | - | 3 |
| ధాతువు | - | ప్రత్యయం | - | కృదంతం |
| కలుగు | + | ఇమి | - | కలిమి |
| నడచు | + | క | - | నడక |
| కోయు | + | త | - | కోత |
| మేయు | + | పు | - | మేపు |
| రాయు | + | ఇడి | - | రాపిడి |
| ఒత్తు | + | ఇడి | - | ఒత్తిడి |
| మండు | + | ట | - | మంట |
| వదరు | + | పోతు | - | వదరుపోతు |
| దిగు | + | బడి | - | దిగుబడి |
| ఒప్పు | + | తల | - | ఒప్పదల |
| ఎత్తు | + | కడ | - | ఎత్తుగడ |

బి) తద్ధితాంతాలు.- నామవాచకాలపైనగాని విశేషణాలపైనగాని వాడు కా కాండ్రు ఇ ఆడు ఆడి ఇడి తన మి, టికము పోతు బంటి కొలది మొదలైన ప్రత్యయాలు చేరినపుడు నామరూపాలు ఏర్పడతాయి ఇవే తద్ధితాంతాలు

| | | | | |
|---|---|---|---|---|
| | - | 2 | - | 3 |
| నామం లేదా విశేషణం | - | ప్రత్యయం | - | తద్ధితాంతం |
| మద్దెల | + | వాడు | - | మద్దెలవాడు |
| విల్లు | + | కాడు | - | విలుకాడు |
| వేట | + | కాండ్రు | - | వేటకాండ్రు |
| చెలి | + | కత్తె | - | చెలికత్తె |
| కుమ్మర | + | ఇ | - | కుమ్మరి |
| వగలు | + | ఆడు | - | వగలాడు |
| వగలు | + | ఆడి | - | వగలాడి |
| సిగ్గు | + | ఇడి | - | సిగ్గిడి |
| చిన్న | + | తనము | - | చిన్నతనము |

(విశేషణం)

| | | | | |
|---|---|---|---|---|
| మేలు | + | ఇమి | - | మేలిమి |
| పెద్ద | + | రికము | - | పెద్దరికము |
| తిండి | + | పోతు | - | తిండిపోతు |
| మొల | + | బంటి | - | మొలబంటి |
| నీరు | + | కొలది | - | నీరుకొలది |

పైన వివరించిన ప్రకృతి ప్రత్యయాలకు విడిగా కూడ అర్థముందని గ్రహించాలి ప్రకృతికి నైఘంటికార్థం ప్రత్యయానికి వ్యాకరణార్థం ఉంటుంది అర్థకానికిచ్చిన నిర్వచనాన్నిబట్టి అది ప్రకృతిని ప్రత్యయాన్ని ధాతువుని కూడ తెల్పుతుంది ఇలాంటి అర్థకాల సమ్మేళనంవల్ల పదాలు ఏర్పడుతాయి పదాల సమ్మేళనంవల్ల వాక్యాలు ఏర్పడుతాయి

అర్థకాలు ఏ విదంగా కలిస్తే పదాలు ఏర్పడుతాయో చెపుతుంది Morpho - ogy - ఇదే పదనిర్మాణం

పదాలు ఏ విదంగా కలిసి వాక్యాలు ఏర్పడుతాయో చెప్పేది Syntax - ఇదే వాక్యనిర్మాణం

ఉదాహరణకి ఈ క్రింది వాక్యాన్ని గ్రహిద్దాం

రైతులు పంటలు పండిస్తారు ఈ వాక్యంలో ౯ అర్థకాలున్నాయి పదాలు మాత్రం మూడే

) రైతు 2) లు 3) పండు 4) ట 5) 'లు 6) పండు 7) ఇస్ (సకర్మార్థకం) 8) తా (తద్ధర్మ భవిష్యదర్థకం) ౯) రు - మనుష్య బహువచనార్థకం

Note :- అర్థకం ఎప్పుడూ ఒకేరూపంలో, ఒకేరకమైన ధ్వని సముదాయంగా ఉండదు ఒక అర్థకం వేరొక అర్థకంతో కలిసినపుడు అందులోని ధ్వనులు మారడం లేదా పూర్తిగా కలిసిపోవడం జరుగుతుంది పూర్తిగా లోపించడం కూడ జరుగుతుంది లేదా అర్థకం యొక్క స్వరూపం పూర్తిగా మారిపోవచ్చు

ఉదా :- ) ఏనుగులు - మనుష్యులు

వీటిలో లు బహువచన బోదకం

2) ఇళ్ళు - పళ్ళు కొడవళ్ళు రాత్రిళ్ళు పెళ్లిళ్లు

వీటిలో ళ్ళు కూడ బహువచన బోధకమె లు రూపాంతర మెత్తింది

3) బాలురు

ఇచ్చట రు బహుత్వబోధకం

Note :- లు ళు ళ్ళు రు అనేవి ఒకే అర్థకం యొక్క రూపాంతరాలు భాషాశాస్త్రవేత్తలు ఇలాంటి రూపాంతరాల్ని సార్థకాలు అన్నారు వీటిని ఆంగ్లంలో A omorpheme అంటారు

'నైడా అర్థకాల స్వరూపాన్ని వివరిస్తూ కొన్ని సూత్రాలు చెప్పాడు

తుల్యవర్ణ భిన్నార్థకాలు:- ధ్వనిరూపం ఒకటే అయినా రెండు అర్థకాలు వేర్వేరు అర్థాలు కల్గివుంటే తుల్యవర్ణ భిన్నార్థకాలంటారు

ఉదా :- తమ్ముడు అల్లుడు - వీటిలో డు పుంలింగ బోధకం

త్రాగుడు వాగుడు- వీటిలో డు క్రియాభావ బోధకం

పై రెండు జంటపదాలలోని డు లకు రూపం ఒక్కటే అయినా వాటి అర్థాలు మాత్రం వేరుగా ఉన్నాయి

2 ధ్వని భిన్న సమానార్థకాలు :- వీటిని వర్ణాత్మక నియతిగల సార్థకాలంటారు

ఉదా :- కాకులు కోతులు కత్తులు

పై మూడింటిలో కాకు కోతు కత్తు అనే వాటికి మూలపదాలు వరుసగా కాకి కోతి కత్తి అని గ్రహించాలి వీటికి చివర బహ్వర్థ బోధకమైన లు చేరినందువల్ల దాని సామ్యంచేత పదాంతాల ఇ కారం ఉ కారమైంది అర్థం మారదు

| | | |
|---|---|---|
| కాకు | - | కాకి |
| కోతు | - | కోతి |
| కత్తు | - | కత్తి |

ఈ మూడింటిలో ధ్వని మార్పేగాని అర్థంలో మార్పులేదు

3 పదాత్మక నియతిగల సార్థకాలు :- ధ్వనిభిన్నమైన కొన్ని అర్థకాలు పదాత్మ నియతితో ఉంటాయి కొన్నిపదాలకు మాత్రమే ఇది పరిమితం

ఉదా :- ళ్ళు - రాత్రిళ్ళు పెళ్ళిళ్ళు

ఇచ్చటి ళ్ళు కేవలం అలాంటి కొన్నిపదాలలోనే బహువచనార్థకంగా ఉంటుంది

మంత్రులు బల్లలు మొదలైన పదాలలో లు బహువచన బోధకం దీనికి పదాత్మక నియతి లేదు వీటిని అర్థకాలుగానే గుర్తించాలి

ఆంగ్లంలో కూడ Canberry Rasberry అనేపదాలలో కూడ Berry (పండు) అనే పదం స్వతంత్ర ప్రయోగార్హత గలది Can Ras అనే పదాలకు స్వతంత్ర ప్రతిపత్తి లేకపోయినా వాటిని ప్రత్యేకార్థకాలుగా గుర్తిస్తాము

★ ★ ★

# 11. క్రియలు - వాటి భేదాలు

వాక్యంలో క్రియ అనేది ప్రధాన భూమిక వహిస్తుంది ఇది సమాపకమని అసమాపకమని రెండు రకాలు సమాపక క్రియల్లో పదాంత రాపేక్ష ఉండదు ఉదా :- ఆయన పండు తిన్నాడు ఈ వాక్యంలో తిన్నాడు అనేది ఒక సమాపక క్రియ దీనికి అన్యపదాపేక్ష లేదు అసమాపక క్రియల్లో పదాంతరాపేక్ష ఉంటుంది ఉదా :- ఆమె గరిట చేతికి తీసుకొని ఇచ్చట వాక్యార్థం పూర్తికాలేదు 'తీసుకొని అనేదొక అసమాపక క్రియ తర్వాత ఏదో మిగిలి ఉంది కాబట్టి పదాంతరాపేక్ష ఉంది అసమాపక క్రియారూపాలు ఉపవాక్యం చివరగాని ప్రధాన వాక్యంలోని ఒక పదబంధం స్థానంలోగాని వస్తాయి వీటికి కాలబోదకత ఉండవచ్చు క్రియావిభక్తులు మాత్రం ఉండవు సమాపక క్రియలు వాక్యాంతంలోనే వస్తాయి వీటికి క్రియావిభక్తులుంటాయి

)అసమాపక క్రియలు:-

ఎ) భూతకాలాన్ని తెలిపే అసమాపక క్రియని క్త్వార్థకమంటారు

దీని ప్రత్యయం ఇ

ఉదా :- వండు + ఇ = వండి

బి) వ్యతిరేకార్థాన్ని తెలిపేటప్పుడు హేత్వర్థంలోను కాలపరిమాణ బోధక వాక్యాల్లోనూ అక ప్రత్యయం చేరుతుంది అకుండ కూడ చేరుతుంది

ఉదా :- వండు + అక = వండక

ఉదా :- వండు + అకుండ = వండకుండా ఇట్లే -

తినక తినకుండా చేయక చేయకుండా ఇత్యాదులు

సి) శత్రర్థకం :- వర్తమానార్థాన్ని ఇచ్చే అసమాప క్రియ శత్రర్థకమవుతుంది ప్రాచీనాంధ్ర వైయాకరణులు దీన్ని చున్నంతా సమాపక క్రియ అన్నారు ఆదునిక భాషలో తూ త చేరతాయి

ఉదా :- చేయుచూ చేస్తూ చేస్తా

డి) చేదర్థకం :- చేత్ అనే సంస్కృత ప్రత్యయానికి తెలుగులో ఇతే అనేది తుల్యార్థకం

) అవ్యతిరేకంలో

ఉదా :- కొట్టు + ఇతే = కొట్టితే

తిట్టు + ఇతే = తిట్టితే

౨) వ్యతిరేకంలో అకపోతే చేరుతుంది

ఉదా :- కొట్టు + అకపోతే = కొట్టకపోతే

తిట్టు + అకపోతే = తిట్టకపోతే

ఇ) అప్యర్థకం :- అపి అనేది సంస్కృత - అవ్యయ వాచకం ఈ అర్థంలో కూడ తుల్యార్థ బోదకం - ఇక్కడ క్రియకి చివర ఇనా చేరుతుంది

) అవ్యతిరేకంలో

ఉదా :- తిను + ఇనా = తినినా

౨) వ్యతిరేకంలో అకపోయినా' చేరితే

ఉదా :- తిను + అకపోయినా = తినకపోయినా అవుతుంది

ఎఫ్) భావార్థకం :- భావార్థంలో క్రియకి చివర అటం - అడం అనేవి చేరతాయి

) అవ్యతిరేకంలో

ఉదా :- తిను + అటం = తినటం

తిను + అడం = తినడం

౨) వ్యతిరేకంలో అకపోవటం అకపోవడం చేరితే

ఉదా :- తిను + అకపోవటం = తినకపోవటం

తిను + అకపోవడం = తినకపోవడం

జి) నుబ్యంతం :- దీన్ని చిన్నయసూరి ఆనంతర్యార్థకమని పేర్కొన్నారు క్రియకు చివర అ (న్) చేరుతుంది గ్రాంధిక భాషలో డున్ చేరుతుంది

ఉదా :- అడుగు + అన్ = అడుగ (న్)

అడుగు + డున్ = అడుగుడు (న్)

౨ సమాపక క్రియలు - సమాపక క్రియలకు కాలబోదక క్రియలతోపాటు లింగ వచన పురుషల్ని తెలిపే క్రియావిభక్తులు కూడ చేరతాయి మొదట కాలబోధకాల్ని గమనిద్దాం

ఎ) భూతకాలికం - న - వండిన

బి) వర్తమానం - తున్న తున్ - వండుతున్న వండుతు

సి) భవిష్యత్తు - త - వండుత

డి) ఉభయ ప్రార్థన - ద - వండుద

Note :- విధ్యర్థకానికి కాలబోధక ప్రత్యయాలు లేవు యథాతథంగా ప్రయోగింప బడుతుంది బహువచనంలో మాత్రం 'అండి' చేరుతుంది. తెలంగాణా భాషలో 'ని, రి, ండి' చేరతాయి

ఉదా :- తినండి, తినండ్రి, తినరి

క్రియావిభక్తుల పట్టిక :-

| | ఏ.వ | బ.వ. |
|---|---|---|
| ఉత్తమ పురుష | ను | ము |
| మధ్యమ పురుష | వు | రు (మహన్మహతి) |
| ప్రథమపురుష (మహత్తు) | వు | రు (మహన్మహతి) |
| ఇతరాలలో | ది | వి (యి) అమహత్తు |

ఉదాహరణలు - 'చేయు' ధాతువుపై ఏర్పడ్డ క్రియలు

| | | |
|---|---|---|
| ఉ.పు | చేస్తున్నాను | చేస్తున్నాము |
| మ.పు | చేస్తున్నావు | చేస్తున్నారు |
| ప్ర.పు (మహత్తు) | చేస్తున్నాడు | చేస్తున్నారు |
| అమహత్తులో | చేస్తుంది | చేస్తున్నవి, చేస్తున్నయి |

ఇవే క్రియావిభక్తుల్ని వ్యతిరేక సమాపక క్రియల్లో వాడతారు. కాని 'ది, వి' అనే రెండు ప్రత్యయాలు 'దు, వు'లుగా మారతాయి.

ఉదా :- చేయు + దు = చేయదు (ఏ.వ)

ఉదా :- చేయు + వు = చేయవు (బ వ)

దీర్ఘస్వరాంత క్రియల్లో కూడ 'ది, వి'లు 'దు, వు'లవుతాయి.

ఉదా :- రాదు, రావు, పోదు, పోవు

౩. వ్యతిరేక క్రియలు :-

ఎ) భూతకాలిక వ్యతిరేక క్రియలు 'లేదు' అనే ప్రత్యయం చేరటంవల్ల ఏర్పడుతాయి. ఇది అన్ని లింగ, వచన, పురుషల్ని తెల్పుతుంది.

ఉదా :- రాలేదు, పోలేదు, తినలేదు వగైరా

బి) 'అట' చివరగల రూపాలకి 'లేదు' చేరిస్తే, వర్తమాన వ్యతిరేక క్రియలేర్పడతాయి పురుష భేదాన్నిబట్టి ఈ రూపం కూడ మారదు.

ఉదా :- వినటం లేదు, కొనటం లేదు

సి) అన్నంత రూపాలకి క్రియావిభక్తులు చేరిస్తే అన్నిపురుషల్లో భవిష్యద్యోగక వ్యతిరేక క్రియలేర్పడతాయి.

ఉదా :- తినను – తినము. తినవు – తినరు,

తినడు – తినరు, తినదు – తినరు, తినవు

డి) అన్నంత రూపాలకి 'వద్దు' అనే పదం చేర్చటంవల్ల వ్యతిరేక విధ్యర్థక రూపమేర్పడుతుంది

ఉదా :- తినవద్దు, వినవద్దు, రావద్దు, పోవద్దు

ఇతర రూపాలు :- రాకు, రాబాకు, రాబోకు, రామాకు వగైరాలు

4. అన్నంత క్రియలు :- అన్నంత క్రియకు వేర్వేరు అర్థాల్లో వేర్వేరు క్రియలు చేరతాయి.

ఎ) సామర్థ్యం :- 'కల, కలుగు, లే' అనేవి అనుబద్ధమవుతాయి

ఉదా :- పోగలడు, పోగల్గుతాడు, పోలేడు

Note :- కాలబోధక ప్రత్యయ యోగంలో 'కల'కు 'కలుగు'ను వ్యతిరేకంలో 'లే' యును ఆదేశమవుతాయి.

బి) అనుమత్యార్థకం :- అనుమతించుట అనే అర్థంలో 'వచ్చు' చేరుతుంది.

ఉదా :- మీరు ఇక పోవచ్చు, ఆమె రావచ్చు

సి) నిషేదార్థం :- క్రియాంతంలో 'కూడదు, రాదు' చేరతాయి.

ఉదా :- రారాదు, పోరాదు, ఉండకూడదు, వెళ్లకూడదు

డి) 'తప్పనిసరి' అనే అర్థం :- వలయు > ఆలి

ఉదా :- తినాలి, చదవాలి

Note :- 'ఆలి' 'ఆల్సి' అవుతుంది.

ఉదా :- వెళ్ళాల్సి వచ్చింది, పోవాల్సి వచ్చింది

ఇ) అసామర్థ్యార్థం :- 'చాలు > చాల' అనుబద్ధమవుతాయి.

ఉదా :- చెట్టెక్కజాలడు, దిగజాలడు

ఎఫ్) కర్మణ్యర్థం :- 'పడు' చేరుతుంది.

ఉదా :- కొట్టబడుతుంది, చెయ్యబడుతుంది

జి) అనుమత్యర్థం :- 'ఇచ్చు' అనుసంధింపబడుతుంది

ఉదా :- రానిచ్చాడు, పోనిచ్చాడు

'ఇచ్చుకు' ఈ ఆదేశమైతే :- రానీ, పోనీ మొ..

హెచ్) సమీప భవిష్యదర్థం :- 'పో' ధాతువు చేరుతుంది.

ఉదా :- కొట్టబోయింది, తినబోయాడు

ఐ) ప్రయోజనార్థం :- ఈ అర్థంలో 'అక్కరలేదు' 'ప్రయోజనంలేదు' అనేవి అనుప్రయుక్తమవుతాయి

ఉదా :- ఉండనక్కరలేదు, రానవసరం లేదు

5. క్రియాధాతువులోని మార్పులు :-

) విద్యాదులు క్త్వార్థక ప్రత్యయాలు కాక, తక్కిన ప్రత్యయాల ముందు 'ఉండు' 'ఉన్'గా మారుతుంది.

2) అనుబంధ క్రియలుగా వచ్చిన 'ఉండు' 'కొను దాతువులు విధ్యాదుల్లో 'ఓ, కో'గా మార్పు చెందుతాయి.

ఉదా :- కూర్చో, తేల్చుకో

3) అనుప్రయుక్తాలైన 'ఉండు, కొను'లు భూతాది ప్రత్యయాల ముందు వికల్పంగా 'ఉన్, కున్'లుగా మారుతాయి.

ఉదా :- కూర్చున్నాడు, చేసుకున్నాడు

4) విద్యాదికేతర ప్రత్యయాల ముందు ధాతువు చివరనున్న'యు' సకారంగా మారుతుంది

ఉదా :- కోయు, కోసి, కోశాడు

చేయు, చేసి, చేశాడు, చేస్తే, చేస్తాడు

5) భూతకాలికేతర ప్రత్యయాల ముందు 'చు, చ్చు'లకు 'ంచు'కు సకార మాదేశమవుతుంది.

ఉదా :- కొలుచు, కొలుస్తాడు, కొలిస్తే

ఇచ్చు, ఇస్తాడు, ఇస్తే

చచ్చు, చస్తాడు, చస్తే

వచ్చు, వస్తాడు, వస్తే

6) అదే'సకారం' దకారాది ప్రత్యయాలకు ముందు 'ద' కారంగా మారుతుంది

ఉదా :- పిలుస్ + దాం = పిలుద్దాం

చేయుస్ + దాం = చేయిద్దాం

7) రెండక్షరాల ధాతువుల్లో దీర్ఘస్వరపూర్వకమైన 'చ' వర్ణానికి విధ్యాదిక ప్రత్యయాల ముందు 'య' వస్తుంది.

ఉదా :- తూచు, తూయు, తుయ్యి, తూచటం, తూయటం

దాచు, దాయు, దాచటం, దాయటం వగైరా

8) మూడక్షరాల ధాతువుల్లో చివరి 'చ' కారానికి 'వ' ఆదేశ మవుతుంది.

ఉదా :- పిలుచు, పిలువు, పిలవటం

9) ద్విరుక్త 'ట' వర్ణానికి భూతకాలికేతర ప్రత్యయాల ముందు 'డ' వర్ణమాదేశమవుతుంది.

ఉదా :- కొట్టు, కొడితే, కొడతాడు, కొడదాం

తిట్టు తిడితే, తిడతాడు, తిడదాం

0) 'న్ను, ళ్ళు, ప్పు, అంతంలో ఉన్న ధాతువులకు అభూతాదిక ప్రత్యయాల ముందు తుది ద్విరుక్త హల్లు 'అద్విరుక్త' మవుతుంది

) న్ను :- ఉదా :- తన్ను, తంతాడు, తంతే

2) ళ్ళు :- ఉదా :- వెళ్ళు, వెళ్తాడు, వెళ్తే

3) ప్పు :- ఉదా :- చెప్పు, చెప్తాడు, చెప్తే

అయితే ఈ కార్యం జరుగని ధాతువులే ఎక్కువ ఉన్నాయి

ఉదా :- దున్ను, మన్ను, కుళ్ళు, మళ్ళు,

తప్పు, తిప్పు, దెప్పు, రొప్పు వగైరా

11) స్వరసమత :- మూడక్షరాల ధాతువుల్లో 'అ, ఇ' ప్రత్యయాల ననుసరించి ప్రథమేతరాచ్చులు కూడ స్వరసమత కారణంగా 'అ ఇ'లుగా మారతాయి.

ఉదా :- అడుగ, అడగ, అడిగి

కరగు, కరగ, కలిగి

Note :- 'తెలియు'కు తెలీదు, తెలియదు, తెలవదు అనే రూపాలున్నాయి

2) కొన్ని ధాతువులకు ఆదేశ రూపాలు ఇలా ఉన్నాయి.

చిన్నయసూరి బాలవ్యాకరణంలో 'అగు, వచ్చు, చొచ్చు, చూచు'లకు వరుసగా 'కా, రా, చొరు, చూడు'లు వస్తాయని సూత్రీకరించాడు.

ఉదా :- అగు - కా

వచ్చు - రా

చొచ్చు - చొరు
చూచు - చూడు
తెచ్చు - తే
లేచు - లే
చచ్చు - చావు వగైరాలు

13) పడు ధాతువు భూతాదిక ప్రత్యయాలతో కలిసి రూపాలు ఇలా ఉంటాయి

ఉదా :- పడు, పడ్డాడు, పడ్డా, పడినా
చెడు, చెడ్డాడు, చెడ్డా, చెడినా

6. ప్రత్యయాల మార్పులు :-

i) అన్వాది దాతువుల తర్వాత ప్రత్యయగత 'తవర్ణం మూర్ధన్య ట కారమవుతుంది

అను, కొను, కను, తిను - ఇవి అన్వాదులు.
అను, అంటే, అంటాడు, అంటున్నాడు
కొను, కొంటే, కొంటాడు, కొంటున్నాడు
తక్కినవన్ని ఇట్లే గ్రహించునది.

ii) దివీతర ప్రత్యయాలకు ముందు కాలాన్ని సూచించే ప్రత్యయాల్లో చివరి 'అ' కారానికి రాయలసీమ, సర్కారు వ్యవహారంలో దీర్ఘం వస్తుంది

ఉదా :- చేయు, చేసినాడు, చేస్తాడు
తెలంగాణాలో మాత్రం చేసిండు, చేస్తడు అవుతాయి.

iii) సర్కారు జిల్లాల వ్యవహారంలో భూతకాల బోధక ప్రత్యయంలోని న వర్ణం లోపిస్తుంది.

ఉదా :- చేసినాడు - చేశాడు

iv) దీర్ఘస్వరాంత దాతురూపాలకు 'అటం' చేరితే 'వ' కారం అగమంగా చేరుతుంది

ఉదా :- రా + అటం > రావటం
పో + అటం > పోవటం
తే + అటం > తేవటం
తీసుకో + అటం > తీసుకోవటం

v) అన్నంత క్రియారూపాల తర్వాత పరుషాలు సరళాలవుతాయి

కచటవప లు గజడదబ లుగా మారతాయి.

ఉదా :- తినన్ + కలడు > తినగలడు

రాన్ + కలదు > రాగలదు

చెప్పన్ + పట్టి > చెప్పబట్టి

vi) 'న' కారానికి వ్యంజనాల ముందు లోపం జరుగుతుంది

ఉదా :- తినన్ + వచ్చు > తినవచ్చు తినొచ్చు

రాన్ + వచ్చు > రావచ్చు, రావొచ్చు

కొన్ని స్వరలోప, సమీకరణ కార్యాలు అనేక మాండలికాల్నిబట్టి భిన్నరూపాలుగా ఉన్నాయి.

) అన్వాది దాతువుల పరంగా వచ్చినపుడు 'ఇనా' 'ఇ'గా మారుతుంది

ఉదా :- అను + ఇనా + డు > అనినాడు > అన్నాడు

2) 'ది' ప్రత్యయం ముందు స్వరలోపం.

ఉదా :- తిను + ఇనది > తినినది > తిన్నది

3) ఈ మార్పులు భవిష్య దర్థకంలో కూడ ఉన్నాయి

ఉదా :- వచ్చు + త + ది > వచ్చుద్ది, వస్తది

తెచ్చు + త + ది > తెచ్చుద్ది, తెస్తది, తెస్తుంది

7. క్రియల మార్పిడి :- తెలుగు భాషలో అకర్మక సకర్మక ప్రేరణార్థక దాతువులు వేనికవి విడిగా ఉండటమేగాక ఒక వర్గం వేరొక వర్గంగా కూడ మార్పు చెందుతుంది.

ఉదా :-

| అకర్మక ధాతువులు | - | సకర్మక దాతువులు |
|---|---|---|
| వంగు | - | వంచు |
| పెరుగు | - | పెంచు |
| జరుగు | - | జరుపు |
| ఆగు | - | ఆపు |
| దిగు | - | దించు |
| కలియు | - | కలుపు |
| అంటు | - | అంటించు |

| | | |
|---|---|---|
| గెంటు | - | గెంటించు |
| కురియు | - | కురిపించు |

2) కొన్ని సకర్మకాలు ప్రేరణ క్రియలుగా మార్పు చెందుట గలదు.

ఉదా :-

| | | |
|---|---|---|
| సకర్మకం | - | ప్రేరణం |
| అను | - | అనిపించు |
| కాల్చు | - | కాల్పించు |
| అడుగు | - | అడిగించు |
| చెప్పు | - | చెప్పించు |

3) కొన్ని అకర్మక దాతువులకు 'కొట్టు, తీయు, పెట్టు' వంటి ధాతువులు చేరితే 'సకర్మక దాతువులు' ఏర్పడతాయి.

| | | |
|---|---|---|
| అ దా :- | | స దా |
| పగులు | - | పగలగొట్టు |
| పడు | - | పడగొట్టు |
| అరుగు | - | అరగదీయు |
| నాను | - | నానబెట్టు, నానవేయు |

4) కొను దాతువు భిన్నార్థాల్లో దాతువు చివర చేరుతుంది కొన్ని యకారాంత దాతువుల యకారం సకార మవుతుంది.

ఉదా :-

| | | |
|---|---|---|
| చేయు | - | చేసుకొను |
| ఆడు | - | ఆడుకొను |
| అమ్ము | - | అమ్ముకొను |
| పాడు | - | పాడుకొను |

ఇట్లే పారస్పర్యార్థంలో

ఉదా :-

| | | |
|---|---|---|
| మాట్లాడు | , - | మాట్లాడుకొను |
| తిట్టు | - | తిట్టుకొను |
| కొట్టు | - | కొట్టుకొను |

5) సకర్మకీకరణం :-

ఉదా :-

తెలియు - తెలుసుకొని, తెలిసికొను

6) కొన్ని ధాత్వాదులకు ధాతువు లను ప్రయుక్తమైనపుడు విలక్షణార్థ మేర్పడుతుంది. వీటిని శబ్దపల్లవాలంటారు

ఉదా :- కూరుచు + ఉండు > కూర్చుండు

అగు + పడు > అగపడు

నామానికి ధాతువు పరమైతే :-

ఉదా :- విజయం + చేయు > విజయంచేయు

భోజనం + చేయు > భోంచేయు

భయం + పడు > భయపడు

పుల్ల + పడు > పుల్లబడు

వీలు + పడు > వీలుపడు

★ ★ ★

# 12. తెలుగు వాక్య నిర్మాణం - వైవిధ్యం

అర్థవంతమైన పదాలతో ఏర్పడుతుంది వాక్యం. ఒండొరుల అభిప్రాయ ప్రకటనకి మూలాధారమైంది వాక్యం. పరిమిత పదాలతోనేగాక, వాక్యం ఆదేశ విధ్యర్థకాల్లో ఒకే అక్షరంతో కూడ ఏర్పడవచ్చు. ఉదా :- రా, పో, తే, ఏం వగైరాలు. కొన్ని వర్ణాలతో కూడిన ఒక పదం కూడ సందర్భాన్నిబట్టి వాక్యంగా రూపొందుతుంది.

ఉదా :- నీవు ఊరి నుండి ఎప్పుడు వచ్చావు? అనే ప్రశ్నకు 'ఉదయమే' అనేదొక జవాబు అనుకుంటే, ఆ పదరూపాన్ని వాక్యంగా గుర్తించవలసి ఉంటుంది. కాని ఈ విదంగా పరిమితమైన పదాల్ని, అక్షరాల్ని అన్ని సందర్భాల్లో వాక్యాలుగా పరిగణించటానికి వీలుపడదు

వాక్యగతమైన పదాలకి ఒక నిర్దుష్ట రూపముండాలి.

ఉదా :- మాది పెద్ద యిల్లు' - ఈ వాక్యంలోని పదాల్ని 'పెద్ద మాది యిల్లు' అని అనియతంగా మార్చరాదు. అలాగే 'ఇంటికి నా వెళ్లితిని' అనేది సాదువాక్యంకాదు. దీన్ని

'నా యింటికి వెళ్ళితిని'

'వెళ్ళితిని నా యింటికి'

అనే రెండు విధాలుగా వ్రాయవచ్చు. వాక్య గత పదాలకు క్రమపద్ధతి తప్పించినా, భావస్ఫూర్తికి భంగం కలుగరాదు. పదాల పరస్పర సంబంధాన్నిబట్టి, స్థూలంగా వాక్యాన్ని మూడు రకాలుగా వర్గీకరించవచ్చు

) స్థానసంబంధం :- వాక్యంలోని పదాలు ఒక నిర్దిష్ట క్రమంలో ఉండాలి.

ఉదా :- 'మాది పెద్ద యిల్లు' - ఈ వాక్యాన్ని 'ఇల్లు పెద్ద మాది' అని అనియతంగా మార్చకూడదు

2) యోగ్యతా సంబందం :- పదాల కూర్పునకు యోగ్యత ఉండాలి. ఒక పదం చివర కొన్ని పదాలు మాత్రమే చేరతాయి అదే పదానికి కొన్ని వేర్వేరు పదాలు జోడిస్తే వాక్యనిర్మాణానికి యోగ్యత అంతరిస్తుంది 'ఆ, ఈ, ఏ' అనే సర్వనామాలు సాధారణంగా నామవాచకాలకు ముందే వస్తాయి

ఉదా :- ఆ ఇల్లు

ఈ చెట్లు

ఏ రాముడు?

ఈ మూడు సర్వనామాలకు తర్వాత క్రియాపదాల్ని చేర్చి వాక్యనిర్మాణం చేస్తే

యోగ్యతా సంబంధం ఉండదు.

ఉదా :- ఆ వచ్చింది,
ఏ చేసింది
ఈ చెప్పండి

పై వాక్యాలకు అర్థయోగ్యతలేదు

3) ఆదేశ సంబందం :- రెండు పదాల మధ్య ఒక పదం చేరితే వాక్యాలతో ఆదేశ సంబందంవల్ల అర్థసౌలభ్యమేర్పడుతుంది.

ఉదా :- అ - పెద్దది

ఈ రెండు పదాల మధ్య 'ఊరు, ఇల్లు, కొమ్మ' వంటి పదాలు ఆదేశంగా వస్తే, వాక్యగత పదాలకన్నింటికి క్రమబద్ధమైన అర్థమేర్పడు తుంది

ఉదా :- ఆ ఊరు పెద్దది
ఆ యిల్లు పెద్దది
ఆ కొమ్మ పెద్దది

'చేసింది, పూసింది, కోసింది' మొదలైన పదాల్ని ఆదేశిస్తే ఆ పదాల కూడికవల్ల అర్థగర్భితమైన వాక్యాలు రూపొందవు

ఆంధ్ర వైయాకరణుల్లో ఒక్క ప్రౌడవ్యాకర్త బహుజనపల్లి సీతారామాచార్యులు మాత్రమే వాక్యాన్ని నిర్వచించారు. తక్కిన వారెల్లరు సంస్కృత వ్యాకరణాల్ని అనుసరించారు అయితే అర్థవంతమైన పదసముదాయమే వాక్యమని వారి అభిప్రాయం. ప్రౌఢ వ్యాకరణంలో వాక్యనిర్వచనం.

సూ :-''వాక్యమునా యోగ్యతాకాంక్షా సహితంబగు
ఆసత్తి యుక్త పదసముదాయంబు''

దీన్నిబట్టి అర్థవంతమైన వాక్యానికి 'యోగ్యత, ఆకాంక్ష, ఆసత్తి' అనే మూడు లక్షణాలు తప్పక ఉండాలని తేలింది.

) యోగ్యత :- పదాలకి పరస్పర సంబందమందు వైరుధ్యం లేకుండుటయే వాక్యంలోని యోగ్యత అవుతుంది

ఉదా :- 'నిప్పచేత తడుపుతున్నాడు'

ఈ వాక్యంలో యోగ్యత కొరవడింది. ఎందుకంటె నిప్పకు కాల్చే గుణమేగాని తడిపేగుణం లేదు ఈ వాక్యానికి యోగ్యత సిద్దించాలంటే 'నీటిచేత తడుపుతున్నాడు' అని నిర్మాణం చేయాలి.

2) ఆకాంక్ష :- ఆకాంక్షయనగా నిలుపుదల లేకపై పయింబోయెడి పదాల అర్థం

మీది ఆదరం శ్రోతకు, పఠితకు వాక్యగత పదాల్లో జిజ్ఞాస కల్గాలి.

ఉదా :- దశరదునికి నల్గురు తనయులు
- వారు శ్రీరామలక్ష్మణ భరత శత్రుఘ్నులు
- వారిలో శ్రీరాముడు కౌసల్య కొడుకు

ఇలా వాక్యనిర్మాణం సాగిపోతుండాలి

3) ఆసత్తి :- ఆసత్తియనగా పదాల సమూహం ఒక పదాన్ని ఒకమారు పల్కి, తర్వాత పదాన్ని మరికొంత కాలవ్యవదితో పల్కితే ఆసత్తి కొరవడుతుంది. వాక్యగత పదాల్ని అవ్యవధానంగా ఉచ్చరించాలి.

ఉదా :- 'రాముడు' అని చెప్పి, తర్వాత అయిదు నిముషాలకు 'సీతతో నడవికేగెను' అన్నట్లయితే ఆసత్తి లోపిస్తుంది.

వాక్యభేదాలు :-

సకర్మక వాక్యం :- ఒక సమాపక క్రియ గల్గి ఉండి సంపూర్ణార్థాన్ని ఇచ్చే వాక్యాన్ని 'సకర్మక వాక్యం' అంటారు. ఇందులో కర్త, కర్మలు రెండు తప్పకుండాలి.

ఉదా :- రాముడు సీతను పెళ్ళాడెను

ఇందులో 'పెళ్ళాడెను' అనే క్రియకు 'ఎవరిని, దేనిని' అని ప్రశ్నించినపుడు 'సీతను' అనే జవాబు వస్తుంది. ఈ పదాన్ని 'కర్మ'గా గుర్తిస్తాం. పై వాక్యం 'కర్మ' గలది గావున 'సకర్మక వాక్యం' అయింది.

2 అకర్మక వాక్యం :- కర్మవిరహిత వాక్యాన్ని 'అకర్మక వాక్యం' అంటాం ఈ వాక్యంలో క్రియనిబట్టి 'ఎవరిని, వేనిని' అని ప్రశ్నిస్తే జవాబు ఉండదు.

ఉదా :- పంఖా తిరుగుతున్నది

పై వివరించిన రెండు వాక్యాల్నిబట్టి 'కర్తరి ప్రయోగం' 'కర్మణి ప్రయోగం' అనే రెండు రూపాలు ఏర్పడుతాయి.

1) కర్తరి ప్రయోగం :- ఇందులో కర్తకు మాత్రమే ప్రాదాన్యత ఉంటుంది.

ఉదా :- జేమ్సువాట్ ఆవిరి యంత్రాన్ని కనిపెట్టాడు

ఈ వాక్యంలో 'కర్త, కర్మ, క్రియ' అనే త్రివిద విభాగాలుంటాయి. సకర్మక వాక్యానికి, కర్తరి ప్రయోగానికి మౌలికమైన భేదం లేదు దీన్ని ఆంగ్లంలో Active Vo'ce అంటాము

ఉదా :- Rama marr'ed Seetha'

2) కర్మణి ప్రయోగం ఈ ప్రయోగంలో కర్మప్రాదాన్యత ఉంటుంది. పైన ఇచ్చిన కర్తరి ప్రయోగ వాక్యాన్ని కొద్దిగా మార్చితే 'కర్మణి ప్రయోగం' ఏర్పడుతుంది.

ఉదా :- ఆవిరియంత్రం జేమ్సువాట్ చేత కనిపెట్టబడింది.

ఈ వాక్యంలో 'కర్మ' కర్తృ స్థానంలో ఉంది. కర్తృ వాచకానికి తృతీయా విభక్తి ప్రత్యయం చేత, క్రియకు పడుజ్యనుబంధం చేరి 'కర్మణి ప్రయోగం' రూపొందడం గమనార్హం దీన్ని ఆంగ్లంలో 'Passive Voice' అంటాం.

ఉదా :- 'Seeta was marr'ed by Rama

ఇక ఆంగ్లభాషా సాహచర్యంవల్ల నేర్పడ్డ వాక్యవిభజన ఈ దిగువరీతి ఉంది

1) సామాన్యవాక్యం 2) సంశ్లిష్టవాక్యం 3) సంయుక్త వాక్యం

సామాన్యవాక్యం (Simp e Sentence) ఈ వాక్యంలో ఒక్క సమాపక క్రియ ఉండి పూర్తి అర్థాన్ని ఇస్తుంది

ఉదా :- నేను బడికి వెళ్ళాను.

ఇందులో కర్త, కర్మ, క్రియ అనే మూడు విభాగాలున్నాయి.

ఈ సామాన్య వాక్యాల్లో అనేక భేదాలు కన్పిస్తాయి. ఇవి క్రియాసహితాలు. క్రియావిరహితాలని రెండు రకాలు. ఈ వాక్యాల్లో మొదట నామం ఉద్దేశ్యం. రెండవనామం విదేయం. మొదటినామం సాదారణంగా సర్వనామంగాని, విశేషనామంగాని అయి వుంటుంది సర్వనామం విశేషణంగా ఉన్న నామంగా గూడ ఉండవచ్చు. రెండోనామం సిద్ధనామంగాని విశేషణాదుల నుండి నిష్పన్నమైన నామంగాని కావచ్చు

ఉదా :- అతను వెంకటేశ్వర్లు
ఈమె భవాని
ఆయన ఇంజనీరు
ఆ బాలిక అందమైనది
ఆ బాలుడు మంచివాడు
ఈ కలం నాది

విశేషణాదులకు సర్వనామిక ప్రత్యయాలు చేర్చటంవల్ల నామాలు నిష్పన్నమవుతాయి.

| ఏ.వ | బహు.వ |
|---|---|
| మహత్తు | మంచివారు |
| మంచివాడు | మంచివాళ్ళు |

) ప్రథమ పురుష :- (అమహత్తు) మంచిది మంచివి

2) మధ్యమ పురుష :-(మహత్) నీవుపురుషుడవు- మీరు పురుషులు

(మహతి) నీవు స్త్రీవి మీరు స్త్రీలు

౩) ఉత్తమ పురుష :- మహత్, నేనుతెలుగువాడిని - మేము తెలుగువారము, తెలుగువారలము

మహతి నేను చిన్నదానను చిన్నదానిని
మేము చిన్నవారము, చిన్నవారలము

Note :- క్రియారహిత వాక్యాలు ఉపవాక్యాలుగా ప్రయుక్తమైనప్పడు 'అవు' ధాతురూపాల్ని అనుబందంచుకోవాలి.

ఉదా :- అతను దనవంతుడైనా గుణవంతుడు

విధేయంనావహానికి 'కాదు' అనే రూపం అన్ని పురుషల్లోను అనుబంధించటంవల్ల వ్యతిరేక రూపాలేర్పడతాయి 'కా' అనే 'అవు' ధాతువు యొక్క అన్నంత రూపానికి క్రియావిభక్తులు ఆయా పురుషల్లో చేర్చటంవల్ల వ్యతిరేక రూపాలు ఏర్పడతాయి.

ఉదా :- అతడు చెడ్డవాడు కాదు, కాడు

'ఉండు' దాతు నిష్పన్న క్రియారూపాల లోపంవల్ల కూడ కొన్ని క్రియారహిత వాక్యాలేర్పడతాయి.

ఉదా :- ఆయనకి ముగ్గురు పిల్లలు
ఆమెకు సిగ్గు ఎక్కువ
ఆ దారి చాలా దూరము

'లే' అనే ఉండు దాతువు యొక్క అన్నంత రూపానికి క్రియావిభక్తులు చేర్చటంవల్ల ఏర్పడతాయి.

| | | ఏ వ | బహు. వ |
|---|---|---|---|
| ) ప్రధమ పురుష :- | మహత్ | అతను లేడు | వారు లేరు |
| | మహతి | ఆమె లేదు | వారు లేరు |
| ౨) మద్యమ పురుష :- | మహత్, | నీవు లేవు | మీరు లేరు |
| | మహతి | ,, | ,, |
| ౩) ఉత్తమ పురుష :- | మహత్, | నేను లేను | మేము లేము |

ఉభయ వాచకం - మనము లేము

ప్రశ్నార్థక వాక్యాలు :- ఇవిమూడు విదాలు.

) వాక్యాంతశబ్దాపేక్షక ప్రశ్నలు :- వాక్యానికి 'ఆ' అనే అపదాన్ని చేర్చడంవల్ల ఈ ప్రశ్నలేర్పడతాయి.

ఉదా :- అతడు పల్లె నుంచి వచ్చాడా?

ఇందు జవాబు 'వచ్చాడని గాని రాలేదనిగాని' ఉంటుంది.

2) వాక్యేతరశబ్దాపేక్షక ప్రశ్నలు :- ఎవరు, ఎందుకు, ఎప్పుడు వంటి కిమర్థబోధక ప్రశ్నలేర్పడతాయి

ఉదా :- ఆయన పల్లె నుండి ఎప్పుడు వస్తాడు?

ఈ ప్రశ్నకు జవాబు రేపు, ఎల్లుండి, మరికొన్ని రోజుల తర్వాత ఏదైనా కావచ్చు

3) విషయ నిర్ధారక ప్రశ్నలు :- 'కదా, కదూ, కద్దూ' వంటి అపదాల్ని వాక్యానికి చేర్చడంవల్ల విషయ నిర్ధారక ప్రశ్నలేర్పడతాయి.

ఉదా :- ఆయన నిన్న పల్లె నుంచి వచ్చాడు కదూ.

ఈ వాక్యంలో అతని రాకని గూర్చి ముందే వక్తకు తెలుసు. ఆ విషయాన్ని నిర్ధారణ చేసుకోవడానికి అడిగిన ప్రశ్న

2 సంశ్లిష్ట వాక్యాలు(Comp ex) :-

) అసమాపక క్రియతో కూడిన ఉప వాక్యాలు చేరితే సంశ్లిష్ట వాక్యాలేర్పడతాయి. పూర్వక్రియ క్త్వార్థకంగా ఉంటుంది.

ఉదా :- అతడు కళాశాలకు వెళ్ళి తిరిగి వచ్చాడు.

ఈ ఉదాహరణలో 'వెళ్ళి' అనే అసమాపక క్రియతో కూడిన సామాన్య వాక్యమొక ఉపవాక్యం 'వచ్చాడు' సమాపక క్రియ ఈ రెండు వాక్యాలకు కర్త ఒక్కటే ఉంటుంది

కాని పరస్పర విరుద్ధార్థకబోద క్రియలు వాడినపుడు భిన్న కర్తృకత సాధ్యమే.

ఉదా :- ఇటీవల ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టి ఓడిపోయి
ఎన్.డి.ఎ. కూటమి గెలిచింది.

2) కొన్ని క్రియలతో క్త్వార్థకం హేత్వర్థకమవుతుంది.

ఉదా :- అతడు జబ్బుచేసి పడుకున్నాడు

3) కొన్ని క్రియలతో రీత్యర్థక క్రియావిశేషణమౌతుంది

ఉదా :- అతడు లంచాలుతిని సంపాదించాడు.

4) కాలబోదక సామాన్య వాక్యానికి ఉపవాక్యంగా దిగువ ఉదాహరణ.

ఉదా :- అతడు స్నానంచేసి వారం గడిచింది

పై వాక్యానికి క్రింది వాక్యంతో తుల్యార్థకత ఉంది

ఉదా :- అతడు వారంరోజులక్రితం స్నానం చేశాడు

5) ఈ క్రింది క్త్వార్థక, వ్యతిరేకక్త్వార్థకాలవల్ల ప్రదాన విషయ బోదలో మార్పేమి లేదు

ఉదా :- క్త్వార్థకానికి :- అతడు స్నానంచేసి వారంరోజులయింది

వ్య.క్త్వా :- అతడు స్నానంచేయక వారంరోజులయింది.

6) క్త్వార్థకరూపం ద్విరుక్తి వాక్యం వ్యాపారాధిక్యాన్ని సూచిస్తుంది. వ్యతిరేకక్త్వార్థక ద్విరుక్తి కాలదైర్ఘ్యాన్ని సూచిస్తుంది.

ఉదా :- ఎ) చెప్పిచెప్పి నానోరు బొప్పికట్టింది.

బి) రాకరాక వచ్చాడు, లేకలేక పూచింది

సి) కాలబోధకంగా కొన్ని క్త్వార్థకరూపాలున్నాయి.

ఉదా :- పొద్దెక్కి నిద్రనుండి లేచాడు.

పొద్దుగూకి చుట్టాలు వచ్చారు.

చీకటిబడి ఇంటికెళ్ళాడు.

శత్రర్థకం :- ఉపవాక్యంలో క్రియ చున్నంతా సమాపక క్రియగా ఉంటుంది. ప్రధాన, అప్రదాన క్రియలకు కర్త ఒక్కటై ఉండాలి.

ఉదా :- అతడు కాఫీ సేవిస్తూ పత్రిక చదువుతున్నాడు.

అతనెప్పడూ నవ్వుతూ పలకరిస్తాడు

చేదర్థక :- 'తే, ఇతే' ప్రత్యయాలు చేరిస్తే చేదర్థకాలేర్పడతాయి సంస్కృతంలో 'చేత్' అనేదాని అర్థమే చేదర్థకం

ఉధా :- నా గదికి వస్తే పుస్తకమిస్తాను.

నేను మా వూరికి వెళ్ళితే, అతన్ని చూస్తాను.

సంభావ్యమాన వ్యాపారాలున్నచోట చేదర్థకం సాధ్యమౌతుంది

ఉదా :- వానలు కురిస్తే పంటలు పండుతాయి.

సమాప్తి పొందిన వ్యాపారాల మద్య ఈ బోద ఉండదు

ఉదా :- పైసలుంటే దోసె తినేవాడిని

3 సంయుక్తవాక్యాలు :- రెండు సమాపక క్రియలతో కూడిన సామాన్య వాక్యాల్ని సమాపక వాక్యాలంటారు. ఈ రెండు వాక్యాల్ని కలపడానికి 'మరియు, కాని, అయితే' అనే సముచ్చయార్థక ప్రత్యయాలు లేదా అనుబంధాలు చేరతాయి.

ఉదా :- మొన్ననే ఎన్నికలు ముగిసెను, మరియు

వాజపేయి ప్రదానమంత్రి అయ్యెను

అతని వద్ద పైసలున్నాయి, కాని లేవన్నాడు.

అతడు వచ్చాడుగాని డబ్బు తేలేదు.

అతడు చదువుతాడుగాని బుద్ధికెక్కదు.



## 13. నామ్నీకరణాలు

ఒక వాక్యాన్ని కొంచెం మార్పిడితో మరో వాక్యంలో కర్తృపద స్థానంలోనూ, కర్మపద స్థానంలోనూ ప్రయోగించే పద్ధతికి నామ్నీకరణమని పేరు

. అనుకృతి :- ఒక వ్యక్తి మాటల్ని ఇంకో వ్యక్తి పునశ్చరణ చేయటం అనుకృతి అవుతుంది

ఈ అనుకృతి రెండురకాలు

ఎ) ప్రత్యక్షానుకృతి బి) పరోక్షానుకృతి

రెండింటిలో 'అని' ప్రయోగింపబడుతుంది.

ఎ) ప్రత్యక్షానుకృతి :- ఇందులో మూలవక్త వాడిన మాటలు అట్లట్లే 'అనుకృత' మవుతాయి ఇది శబ్దప్రధానం.

ఉదా :- సుబ్రహ్మణ్యం 'నేను రేపు వస్తాను' (అని) అన్నాడు.

బి) పరోక్షానుకృతి :- ఇందులో మాటల అర్థం అనుకృతవహౌతుంది. ఇది అర్థప్రదానమ్మైంది.

ఉదా :- సుబ్రహ్మణ్యం తాను రేపు వస్తాను (అని) అన్నాడు.

2 విధి :- ఆదేశాన్ని కూడ అనుకృతిలో చెప్పవచ్చు. ఇది కూడ రెండురకాలు.

ఎ) ప్రత్యక్ష విధి

ఉదా :- రామయ్య నాతో 'నీవు రేపురా' (అని) అన్నాడు

బి) పరోక్ష విధి :-

ఉదా :- రామయ్య నన్ను రేపు రమ్మన్నాడు

అనుకృత వాక్యంలో కర్త లోపిస్తుంది. ప్రధాన వాక్యంలో అముఖ్య కర్మకు ద్వితీయావిభక్తి చేరుతుంది క్రియకు 'అమ్' అనే శబ్దం ఆగమమౌతుంది. ఆ మార్పులిలా ఉంటాయి

ఉదా :- తిను + అమ్ + అని > తినమని,

పో + అమ్ + అని > పోమని, పొమ్మని

Note :- అనుకృతిలోనేగాక కొన్నిచోట్ల ఇతర వాక్యాల్లో కూడ 'అని' చేరుతుంది. ఇక్కడ 'అని' విషయార్థాన్ని తెల్పుతుంది.

ఉదా :- నేను వెళ్తానని అతనికి తెలుసు

వాడు నెగ్గలేడని నా నమ్మకం

ఆయన ఎన్నికల్లో గెలిచాడని విన్నాము

౩. అది :- ఒక వాక్యానికి 'అది' అనే సర్వనామాన్ని చేర్చి మరో వాక్యంలో నామపద స్థానంలో ప్రయోగించవచ్చు. అది విషయార్థక బోదకమవుతుంది.

ఉదా :- వాళ్ళు వూరికి వెళ్ళింది నాకు తెలుసు.

ఉపవాక్యానికి 'అది' చేరిస్తే, అది విశేషణంగా మారుతుంది.

ఉదా :- వెళ్ళారు + అది > వెళ్ళిన + అది > వెళ్ళింది

క్రియాజన్య విశేషణానికి విశేష్యంగా కూడ 'అది' చేరవచ్చు అప్పడు 'అది' ఇంకో నామానికి సూచన అవుతుంది.

ఉదా :- మేము ఎక్కడికి వెళ్ళింది ఆయనికి తెలుసు
- వెళ్ళినచోటు

ఈ కారణంగా ఒక్కొక్కప్పడు వాక్యాలు భిన్నార్థ బోదకాలవుతాయి. ఇందుకు క్రింది వాక్యాలు ఉదాహరణాలవుతాయి.

ఉదా :- నువ్వు తిన్నది నాకు తెలుసు

ఈ వాక్యానికి రెండర్థాలు ఇలా వస్తాయి.

నువ్వు తిన్నావని నాకు తెలుసు
నువ్వు ఏం తిన్నావో నాకు తెలుసు

4. ఓ, ఏమో :- కిమర్థక ప్రశ్నలకి 'ఓ' చేరిస్తే అన్యవాక్య ప్రయోగాలు సాధ్యమవుతాయి

ఎ) విషయార్థకంలో ఉదా :-

వాళ్ళు ఎక్కడికి వెళ్ళారో నాకు తెలుసు - (వాళ్ళువెళ్ళినచోటు)

బి) సందేహంలో ఉదా :-

వాళ్ళు ఎక్కడికి వెళ్ళారో ఎవరికి తెలుసు (సందేహం)

సి) పరోక్ష ప్రశ్నార్థకంలో

ఉదా :- వాళ్ళు ఎక్కడికి వెళ్ళారో కనుక్కో (పరోక్ష ప్రశ్న)

ఏమో :- సందేహార్థంలో ఉపవాక్యానికి అదనంగా 'ఏమో' శబ్దాన్ని చేర్చవచ్చు.

ఉదా :- వాళ్ళు ఎక్కడికి వెళ్ళారో, ఏమో నాకు తెలీదు

5 అటం :- వ్యాపారార్థక నామాల స్థానంలో కూడ 'ఉపవాక్యానికి' 'అటం' చేర్చి ప్రయోగించవచ్చు. ఇలాంటి రూపాల్ని ప్రాచీన వ్యాకర్తలు 'భావార్థకాలు' అన్నారు

ఉదా :- ఆమెకు వంట వండటం బాగా వచ్చు

'అటం' చేరిన భావార్థక నామాలకి కూడ విభక్తి ప్రత్యయాలు చేరతాయి

ఉదా :- మా చెల్లి నాతో పోట్లాడటానికి సిద్ధపడుతుంది.

ఇక్కడ 'అట' శబ్దాంతానికి షష్ఠీవిభక్తి ప్రత్యయం 'కి' చేరటం గమనార్హం.

క్రియాజన్య విశేషణాలతో నామ్నీకరణాలు :-

1) కొన్ని వాక్యాలు నామపదాలకి విశేషణాలుగా ప్రవర్తిస్తాయి. ఇలాంటి విశేషణ వాక్యాల్లో క్రియ విశేషణ రూపంగా మారుతుంది. వీటికి లుప్త విభక్తిక నామ్నీకరణాలని కూడ పేరు. విభక్తి లోపించినా అర్థగ్రహణంతో బాధ ఉండదు.

ఉదా :- ఆ అబ్బాయి వూరికి వెళ్ళాడు - ఊరికి వెళ్ళిన అబ్బాయి

అతడు అటుకులు తిన్నాడు - అతడు తిన్న అటుకులు

అతడు మార్కెట్ నుంచి పండ్లు కొన్నాడు

- అతడు పండ్లుకొన్న మార్కెట్

Note :- అయితే అన్ని విభక్త్యర్థాల్లో ఈ నామ్నీకరణాలు సాధ్యంకావు.

ఉదా :- వాడు సీతతో వచ్చాడు.

దీనికి అనిష్పన్నరూపం > వాడు వచ్చిన సీత

అతడు ఊరి నుండి వచ్చాడు.

దీనికి అనిష్పన్నరూపం > అతడు వచ్చిన ఊరు

2) క్రియావిశేషణాల మీద కొన్ని అవ్యయాలు చేరితే క్రియావిశేషణాలుగాని, వాక్యవిశేషణాలుగాని ఏర్పడతాయి.

ఉదా :- వాడు తిన్నప్పుడు - వాడు పోయినందుకు

నీవన్నట్లు, తిన్నడు వచ్చేముందు - ఇలాంటివి సాధ్యాలు

3) క్రియాజన్య విశేషణాల తర్వాత తదర్థ బోధక సర్వనామాలే ప్రవర్తిస్తాయి తదర్థ బోధక శబ్దాన్ని అనుసంధించినా, దానికి తదర్థ బోధకత ఉండదు.

| ఉదా :- | (ప్రవర్తిస్తుంది) | (ప్రవర్తించదు) |
|---|---|---|
| | వచ్చినవాడు | వచ్చినవీడు |
| | మంచివాడు | మంచివీడు |



# 14. సంధి - దాని స్వరూపం

తెలుగు భాషలో సంధి స్వరూపాన్ని చర్చించేటప్పుడు సంస్కృత వైయాకరణులు దాన్ని ఏ విధంగా నిర్వచించారో పరిశీలింపవలసి ఉంది. ప్రాచీన వ్యాకర్తలు వర్ణనాత్మక దృష్టితోను, ఆధునిక భాషా శాస్త్రవేత్తలు చారిత్రక దృష్టితోను నిర్వచనాలు చేశారు.

పాణిని తన అష్టాధ్యాయిలో చెప్పిన ఈ దిగువ నిర్వచనం అతి ప్రాచీనమైంది.

''పరస్సన్నికర్షః సంహితా''

''సంహిత'' అనగానేమో ఈ దిగువ శ్లోకం వివరించింది.

''సంహితైక పదేనిత్యా నిత్యా ధాతూపసర్గయోః
నిత్యా సమాసే వాక్యేతు సావివక్షా మపేక్షతే''

తా :-''ఉచ్చారణవ్యవధి లేకపోవుటయే సంహిత. ఈ నియమం ఏకపదంలోను, ధాతూపసర్గల్లోను, సమాసంలోను నిత్యంగా ఉంటుంది. వాక్యంలో మాత్రం వక్తయొక్క వివక్షపై ఆధాపడి ఉంటుంది. దీనిని సంహిత అంటారు''

1) ఉదా :- ఏకపద సంహిత:- ఒక పదంలో అక్షరాల మధ్య గల సంహిత రా-ము-డు - దీనిలోగల మూడు వర్ణాలని విడివిడిగా కాకుండా 'అవ్యవధానంగా' ఉచ్చరించాలి.

ఉదా :- రాముడు

2) ధాతూపసర్గల సంహిత:-

ఉదా :- 'వ్యవహరించు' అనేదొక పదం.

వి+అవ+హరించు అని పద విభాగం. ఈ విభాగంలో తొలిపదాలు 'వి, అవ' అనేవి ఉపసర్గలు. 'హరించు' అనేది ధాతువు. మొదటి ఉపసర్గల్ని ధాతువు నుండి వేరుచేసి ఉచ్చరించరాదు.

3) సమాస సంహిత :-

ఉదా :- కవీశ్వరుడు.

ఇదొక సమాసం. ఇది రెండు పదాల కలయిక. 'కవి, ఈశ్వరుడు' అనే ఈ రెండు పదాల్ని విడివిడిగా నుచ్చరించరాదు.

Note :- పై మూడు సందర్భాలలో 'సంహిత' నిత్యంగా ఉంటుంది.

4) వాక్య సంహిత:- వాక్యాలతో నేర్పడే సంధి.

ఉదా :- తస్యేదం గృహం

ఇందులో 'తస్య, ఇదం, గృహం' (ఈ ఇల్లు అతనిది) అని మూడు పదాలున్నాయి. ఇదొక వాక్యం. దీన్ని 'తస్యేదంగృహం' అని కలిపి ఉచ్చరించవచ్చు. అలాకాక 'తస్య ఇదం గృహం' అని విడదీసి ఉచ్చరించవచ్చు.

Note :- వాక్యసంహిత వికల్పమని గుర్తించాలి.

౨. చిన్నయసూరి వంటి ఆంధ్ర వ్యాకర్తలు సంధి నిర్వచనంలో సంస్కృత వైయాకరణుల ఒరవడినే గ్రహించారని విదితమవుతుంది.

సూరి నిర్వచనం

''పూర్వపరస్వరంబులకు పరస్వరంబేకాదేశంబగుట సంధి''

ఈ నిర్వచనం అచ్చుల పరస్పరాకర్షణనే చెప్పినప్పటికి సంధి.పరిచ్ఛేదంలో (బాలవ్యాకరణం) వ్రాయబడిన సూత్రాలు, వాటి వివరణల్ని బట్టి నుగాగమ, సరళాదేశ, గసడదవాదేశ, వర్ణాగమ, వర్ణాదేశాది సంధుల్ని ప్రస్తావించడం వల్ల హల్లుల పరస్పరాకర్షణ లేదా లోపం కూడా సంధిగానే చిన్నయసూరి గుర్తించాడని స్పష్టమవుతుంది.

ఉదా :- రాముడు + అతడు – రాముడతడు – ఉత్వసంధి
మేన+ అత్త – మేనత్త – అత్వసంధి
పూచెను+ కలువలు – పూచెగలువలు – ద్రుతసంధి
వాడు+ పోయె– వాడువోయె – గసడదవాదేశసంధి
ప్రాత+ ఇల్లు – ప్రాయిల్లు – వర్ణలోపం
గుణవంత+ ఆలు – గుణవంతురాలు – రేఫాగమసంధి
సరసము+ అలుక – సరసపుటలుక – పుంప్వాదేశటుగాగమ సంధి

౩. ఆధునిక భాషా శాస్త్రజ్ఞుల నిర్వచనం :-

కొన్ని అర్థకాలు (Morphomes) కలసి ఒక పదంగా ఏర్పడేటప్పుడు వానిలో ధ్వనులు పరస్పర ప్రభావం వల్లనో లేక చారిత్రక కారణాల వల్లనో మార్పు చెందుతూ ఉంటాయి. అలాంటి ధ్వనిమార్పుల్ని 'సంధి' అంటారు. ఆంగ్లభాషలో దీన్ని Morphonemics అంటారు.

ఒక వర్ణాన్ని ఉచ్చరించేటప్పుడు, తర్వాతి వర్ణాల్ని కూడా ఉచ్చరించే ప్రయత్నం జరుగుతుంటుంది. అందువల్ల ఒక వర్ణం యొక్క ప్రభావం వేరొక వర్ణంపై పడుతుంది. అంతేగాక నాదస్పర్శం లాంటి విభిన్న ధ్వనుల్ని ఉచ్చరించేటప్పుడు రెండూ ఒకేధ్వనిగా మారిపోవడం జరుగుతుంది. అలాగే ఉచ్చారణావయవాల కదలికలలోని పరిమితి వల్ల కూడా ధ్వనిలో మార్పులు సంభవిస్తాయి. ప్రపంచ

భాషలన్నిటిని సునిశితంగా పరిశీలించిన తర్వాత ఆధునిక భాషా శాస్త్రవేత్తలు 'సంధి'ని ముఖ్యంగా నాల్గు విధాలుగా వర్గీకరించారు.

I సమీకరణం (ASSIMILATION)

ఒక వర్ణం దాని సమీప వర్ణాల లక్షణాల్ని గ్రహించడం సమీకరణమవుతుంది. ఒక అచ్చు తన పక్కనున్న అచ్చుని లేదా హల్లుల్ని గ్రహించవచ్చు.

ఉదా :- కత్తి + లు - కత్తులు
తల్లి + లు - తల్లులు
నడుచు + ఇ - నడిచి
ఇలాగే మరికొన్ని:
పది + తప్పలు - పత్తప్పలు
మజ్జిగ + కావాలి - మజ్జిగ్గావాలి.

౨. అక్షర నిర్మితిః - Syllable Structure :- సంధిలోని అచ్చులుగాని హల్లులుగాని లోపించడం లేదా కొత్తవర్ణాలు ఆదేశమవడం జరుగుతుంది.

ఉదా :- పని + లు - పన్లు (సంయుక్తం)
చేను + లు - చేలు (వర్ణలోపం)
పది + ఆరు - పదహారు, పదునారు (వర్ణాదేశం)

సంస్కృత భాషలోని యణాదేశసంధి ఇందుకొక ఉదాహరణ

సూత్రంః- 'ఇకోయణచి'

ఇ, ఉ, ఋ లకు అసవర్ణాచ్చులు పరమైనచో క్రమంగా య, వ, ర లు ఆదేశమవుతాయి.

ఉదాః- యకారంగా మారిపోవడానికి
అతి+ అంత - అత్యంత
వకారంగా మారిపోవడానికి
మధు+ అరి - మధ్వరి
రకారంగా మారిపోవడానికి
పితృ+ ఆదేశము - పిత్రాదేశము

౩. శ్లథీకరణంః- Weakening & Strengthening

ఉదాత్తాచ్చులు ఉదాత్తతని కోల్పోవటం శ్లథీకరణమంటారు.

ఎ) ఆంగ్లభాషలో - "Able" - అనే విశేషణం "Ability" అనే Abstract Noun అవుతుంది.

ఇలా – Mobile - Mobility

Noble - Nobility ఇత్యాదులు.

బి) తెలుగు భాషలోని మార్పులు – దీర్ఘాచ్చు హ్రస్వాచ్చు అగుట

ఉదా :- తాను – తన అవుతుంది

మేము – మనము అవుతుంది

మనకు – మాకు అవుతుంది

ఇలాగే హ్రస్వాచ్చు దీర్ఘాచ్చుగా మారుతుంది.

ఉదా:- పడు – పాటు

చెడు – చేటు

పొడుచు – పోటు

4. భేదకత్వ నివృత్తి :- Neutralization

రెండు వర్ణాల మధ్య భేదకత్వం ఉండేచోట ఒక పదం స్థానంలో మాత్రం, అది లోపించటం భేదకత్వ నివృత్తి అంటారు.

ఉదా :- సంస్కృతంలోని కొన్ని పదాలతో పదమధ్య 'దధ'లు 'త'కారంగా మారటం కద్దు

| ప్రథమా ద్వివచనం | ప్రథమేకవచనం |
|---|---|
| శరదౌ | శరత్ |
| క్షుధౌ | క్షుత్ |

Note :- నాదస్పర్శం పదాంతంలో శ్వాసంగా మారటం కూడా భేదకత్వ నివృత్తి క్రిందకి వస్తుంది. ఇది జర్మన్ భాషలో కన్పిస్తుంది. భేదకత్వ నివృత్తికి సమీకరణంతో, శ్లథీకరణంతో సంబంధముంది. ఉచ్చారణలో పదాదిగ ఇచ్చినంత ఊనిక పదాంతానికి ఇవ్వం. అందువల్లనే నాదస్పర్శాలు శ్వాసస్వరాలుగా మార్పుచెందుతుంటాయి.

పదాంత హల్లులు లోపించడాన్ని తెలుగు భాషలో కూడా గమనింపవచ్చు

ఉదా :- చూచెను+ వాడు – చూచెవాడు

చూడుము+ నన్ను – చూడు నన్ను

పై రెండు ఉదాహరణాలలో పూర్వపదాంతవర్ణాలైన 'ను, ము'లు రెండు ఉచ్చారణలో లుప్తమైనాయి.

ఈ మార్పులు పద మధ్యంలోనూ గమనింపవచ్చు

ఉదా :- అడుగు+ అకు – 'అడక్కు' అయింది

అడుగ్+అకు – అడక్కు

అడగ్+అకు – అడక్కు

అడక్+కు – అడక్కు

పై నిర్మాణంలో గల మార్పులు గు గ్ గ్ క్‌లు వివిధ సూత్రాల ప్రాతిపదికగా ఏర్పడ్డాయి

వీటిని ఆంగ్లంలోను గుర్తింపవచ్చు

ఉదా :- Ch dren

దీనిలో ren అనేది పదాత్మకనియతి గల బహుత్వ బోధక సార్థకం

అలాగే ox - oxen

ఇందులో en అలాంటిదే

ఇదే భాషలో పదాత్మక నియతి లేని బహుత్వబోదక అర్థకం కన్పిస్తుంది అదే s అనేది

ఉదా :- Book - Books

Pen - Pens

Cha r - Cha rs

4 ఒక ఆధారభూతమైన పదం నుంచి ఇంకొక పదం ఏర్పడినప్పుడు ఆ రెండింటిలోను వచ్చిన ధ్వని భేదాన్ని అర్థకంగా గుర్తించాలి

ఆంగ్లభాషలో ఉదా :-

Foot - Feet

Tooth - Teeth

5 సమధ్వని రూపాలు సార్థకాలా? భిన్నార్థకాలా? అని నిర్ణయించే నియమాలు కొన్ని ఉన్నాయి

Note ఒక పదం స్థానాన్నిబట్టి భిన్నార్థకమవుతుంది

ఉదా .- చెవి – శరీరావయవం

తాళంచెవి – వస్తుగతం

తాళం – సంగీత ధ్వని

తాళం – ఇంటికి భద్రతకై వేసే ఇనుప సాదనం

లేదా లోహ సాదనం

ఏడు – (7) సంఖ్యావాచకం

ఏడు – ఏడ్చు దాతువుయొక్కరూపం

విధ్యర్థకం – (దుఃఖించు)

రాయి – పాషాణమని అర్థం

అయితే ఆకురాయి కీచురాయి కొక్కిరాయి

మొదలైన పదాలలోని రాయి భిన్నార్థకం

6 ఒక పదంలోని అర్థకాల్ని విడగొట్టినపుడు వానిని స్వతంత్ర ప్రయోగార్హత లేకపోయినా వాటిని అర్థకాలు గానే గ్రహించాలి ఇవి భాషలో ప్రత్యేక సందర్భాలు-

ఎ) స్వతంత్ర ప్రయోగార్హత గల అర్థకాలు

ఉదా :- ఇల్లు చెట్టు కొమ్మ వగైరా

బి) స్వతంత్ర ప్రయోగార్హత లేకపోయినా అలాంటి పదాలతో కలసినపుడు దానికి ప్రయోగార్హత సిద్ధిస్తుంది

ఉదా :- లు ఇది బహువచన ప్రత్యయం

చెట్టు + లు – చెట్లు

కొమ్మ + లు – కొమ్మలు వగైరాలు

సి) ఆమ్రేడితంలో తొలిపదాలు మార్పుచెందుటవల్ల స్వతంత్ర ప్రయోగార్హములు గాకపోయిననూ అవి అర్థకాలే

ఉదా :- పగలు + పగలు – పట్టపగలు

నడుమ + నడుమ – నట్టనడుమ

చివర + చివర – చిట్టచివర

పై సంధి గత పదాలలో రెండవదానికి అనగా పగలు కు ప్రయోగార్హత కలదు పట్ట నట్ట చిట్ట అనే వాటికి భాషలో స్వతంత్ర ప్రయోగార్హత లేకపోయిననూ అవి పూర్వరూపం యొక్క రూపాంతరాలవటంవల్ల అర్థకాలుగా గుర్తింపు పొందాయి

తెలుగు సంధుల్లో చాలా మార్పులు కన్పిస్తాయి

) స్వాభావిక పరివర్తనం :- తెలుగు భాషలో మూర్ధన్యం ముందు న కారముండదు న కారం ణ కారంగా మార్పు చెందుతుంది

ఉదా :- తిన్ + టాడు – తిణ్ + టాడు – తింటాడు

2) పదమధ్య సంధి :- పదముల నడుమ స్వరభేదాలు ఏర్పడతాయి

ఉదా :- అడుగు + అ – అడగ

ఉ కారం అ కారమైంది

అడుగు + ఇ - అడిగి

ఉ కారం ఇ కారమైంది

అడుగు + ఇక్కడ - అడుగిక్కడ

ఉ కారం ఇ కారమైంది

3) పదాంతసంధి - పదం యొక్క చివర కలిగే మార్పు

ఉదా - అడుగు + ఆ - అడుగా?

అడుగు + ఏ - అడుగే

అడుగు + ఇక్కడ - అడుగిక్కడ

4) సంధివర్ణాలు - వర్ణస్థాయిలో వచ్చే భేదాలవల్ల ఏర్పడేవి

ఉదా - చిగురు + లు - చిగుర్లు చిగుళ్ళు చివుళ్ళు

వేరు + లు - వేర్లు వేళ్ళు

ఇలాగే ఆంగ్లంలోనూ గమనించవచ్చు

Kn e Kn ves

W e W ves

తమిళ కన్నడ వ్యాకర్తలు సైతం సంధి నిర్వచనంలో పై విషయాల్నే దృవీకరించారు తమిళంలో సంధిని పునర్చి అంటారు

తమిళంలో నిర్వచనం అవైతా మెయి పిరిదాదన్ మిగుదన్ కున్తలేన్ను మొగిప తెరియు మోరె

ఒక అచ్చుకు అచ్చుగాని హల్లుకు హల్లుగాని ఒక హల్లుకు అచ్చుగాని హల్లుగాని పరమైతే ఏర్పడేది సంది అని పై తమిళ నిర్వచనానికి అర్థం

కన్నడంలో సందిని ఎరడుం పలవుం వర్ణం పరస్పరం కూడు వందమది సంధియొళం

రెండు పదాలు అవ్యవదానంగా కలిస్తే అది సంధి అని నిర్వచించారు

ఈ పై నిర్వచనాల్ని పోలిందే కేతన ఆం దభాషాభూషణం లో ఇలా వుంది

అది శబ్దాంత వర్ణంబు నంత్యశబ్ద

పూర్వవర్ణంబుతో కూడి పొత్తుచేత

సందియగు నన్నాడు

తెలుగు తమిళ కన్నడ భాషలు సంధి నిర్వచనంలో పోలికగలవై యున్నందువల్ల దావిడ భాషలకు జన్యజనకత నిరూపితమైంది



## 15. బహువచనం - 'లు' వర్ణచరిత్ర

'డు, ము, వు, లు' అనేవి ప్రథమా విభక్తి ప్రత్యయాలని చిన్నయ సూరి సూత్రీకరించాడు. ఇందులో మొదటి మూడు ప్రథమా విభక్త్యేక వచన ప్రత్యయాలు. 'లు' మాత్రం బహువచన ప్రత్యయం. వర్ణనాత్మక వ్యాకరణ దృష్టితో 'లు' బహుత్వ బోధకమని అందరు అంగీకరిస్తారు. ఆధునిక భాషా శాస్త్రవేత్తలు ద్రావిడ భాషల పుట్టుపూర్వోత్తరాల్ని చారిత్రకంగా పరిశీలించారు. ఈ పరిశీలనలో 'లు' వర్ణం ప్రా. ద్రాలోని 'కళ్' లేదా 'గళ్' యొక్క అవశిష్టభాగమని నిర్ణయించారు.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | యానైగళ్ | - | ఏనుగులు |
| | ముఱిక్కల్ | - | ముక్కలు |
| | నఱికల్ | - | నక్కలు |

తెలుగులో ఏకవచన నామానికి 'లు' చేరిస్తే బహువచన నామం అవుతుంది. ఈ పద్ధతి తెలుగుబాస ప్రా. ద్రా నుండి విడువడ్డ తర్వాత నిత్యంగా మార్పుచెందింది. 'లు' వర్ణం చేరినపుడు నామపద నిష్పత్తిలో కల్గిన అనేక పరిణామాల్ని మనం గమనించవచ్చు.

1) 'లు' పరమైనపుడు 'చేను, పేను, మీను' మొదలైన శబ్దాలలో చివరి 'ను' లోపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | చేను + లు | - | చేలు |
| | పేను + లు | - | పేలు |
| | మీను + లు | - | మీలు |

2) 'చేయి, గోయి, నేయి' మొదలైన వాటిలో 'య' కారం లోపిస్తుంది. 'త' కారం చేరుతుంది.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | చేయి + లు | - | చేతులు |
| | గోయి + లు | - | గోతులు |
| | నేయి + లు | - | నేతులు |

'రాయి'కి బహువచనం పరమైతే 'రాలు', 'రాళ్ళు' అవుతుంది.

3) దిగువ శబ్దాలలో బహువచన ప్రత్యయం చేరేటపుడు నామాంతర మువర్ణ లోపం, పూర్వాచ్చు దీర్ఘం కావడం వైకల్పికంగా జరుగుతుంది.

ఉదా :- వజ్రము + లు - వజ్రాలు, వజ్రములు

పుస్తకము + లు - పుస్తకాలు, పుస్తకములు

మీనము + లు – మీనాలు, మీనములు

'నము' లోపించి 'మీలు' కూడా ఏర్పడుతుంది.

4) ఇకారాంత శబ్దాలకు బహువచనం పరమైతే 'ఇ' 'ఉ'గ మారుతుంది.

ఉదా :- కోతి + లు – కోతులు

మూతి + లు– మూతులు

బంతి + లు – బంతులు

రీతి + లు – రీతులు

దీన్నే 'స్వరసామ్యత' అంటారు.

5) అకారాంతాలు మాత్రం బహువచన ప్రత్యయం పరమైనపుడు మారవు.

ఉదా :- కూత + లు – కూతలు

మూత + లు– మూతలు

6) దీర్ఘస్వరాంత శబ్దాల్లో మార్పులుండవు.

ఉదా :- లుంగీలు, లంగాలు

ప్రాయికంగా ఇవి అన్యదేశ్యాలుగా ఉంటాయి.

7) ప్రకృతి ప్రత్యయ విభాగం లేకుండానే కొన్ని నామాలు బహువచన బోధకాలు.

ఉదా :- పాలు, నీళ్ళు, ఉసిళ్ళు, పేలాలు, బియ్యం వగైరాలు.

8) ధాన్యవాచకాలు నిత్య బహువచనాలు.

ఉదా :- జొన్నలు, రాగులు, పెసలు, మినుములు, అనుములు, కొఱ్ఱలు, వడ్లు, కందులు.

9) సస్యవాచకాలు నిత్యైక వచనాంతాలు.

ఉదా :- జొన్న, రాగి, పెసర, మినుము, జనుము, కంది, వరి, కొఱ్ఱ.

10) ద్విరుక్త యకారాంతానికి బహువచనం పరమైతే లోపంగాని, ఉత్వంగాని కలుగవు.

ఉదా :- పొయ్యి + లు – పొయ్యిలు

11) 'ల్లు, న్ను' అంతంలో వచ్చే నామాలకు

ఉదా :- కన్ను + లు – కన్నులు

పన్ను + లు – పన్నులు

12) 'ళి' అంతంలో వచ్చే చతుర్మాత్రాక శబ్దాల్లో 'ండి' ఆదేశం జరుగుతుంది.

ఉదా :- రోకళి + లు – రోకండి + లు – రోకండ్లు

తిరగళి + లు – తిరగండి + లు – తిరగండ్లు

కౌగిలి + లు - కౌగిండి + లు - కౌగిండ్లు

(3) 'ండి, ండు' అంతమందున్న శబ్దాల్లో అనునాసిక వర్ణానికి కొందరి భాషలో లోపం జరుగుతుంది.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | బండి + లు | - | బండ్లు, బళ్ళు |
| | పుండు + లు | - | పుండ్లు, పుళ్ళు |

(4) రెండక్షరాలకంటె ఎక్కువగా ఉన్న ఇదంత శబ్దాల్లో చివరి హల్లు 'ల' కారం మూర్ధన్య ల కారమవుతుంది.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | మొసలి + లు | - | మొసళ్ళు |
| | నెమలి + లు | - | నెమళ్ళు |

కొన్నిచోట్ల రెండక్షరాల శబ్దాల్లోని ల కారం మారదు.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | పులి + లు | - | పులులు |
| | పిల్లి + లు | - | పిల్లులు |

(5) ఉకారాంత శబ్దాల్లో చివరి స్వరానికంటె ముందున్న 'ల' కారం మూర్ధన్యమవుతుంది.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | కాలు + లు | - | కాళ్ళు |
| | కుందేలు + లు | - | కుందేళ్ళు |

(6) కొన్ని యెడల చివరి అచ్చుకు ముందున్న రేఫం మూర్ధన్య ల కారంగా మారుతుంది.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | వేరు + లు | - | వేళ్ళు |
| | ఊరు + లు | - | ఊళ్ళు |
| | గోరు + లు | - | గోళ్ళు |
| | వెదురు + లు | - | వెదుళ్ళు |
| | పందిరి + లు | - | పందిళ్ళు |

ఇవి ప్రాయికంగా త్రిమాత్రకాలె. చదుర్మాత్రకాలు అరుదు.

(7) ఏకవచనంలో లేని అనునాసిక వర్ణం కొన్నింట బహువచన శబ్దాల్లో కన్పిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | కాడి + లు | - | కాండ్లు (కాండి + లు) |
| | ఏడు + లు | - | ఏండ్లు (ఏండు + లు) |

తెలంగాణంలో 'ణి' అనే అక్షరంతో ఏకవచనాంత శబ్దముంది.

ఉదా :- కాణి + లు - (కాణ్ + లు) - కాణ్ + డు + లు - కాండ్లు

18) నామాంత 'ఇ' వర్ణం 'ఉ' వర్ణంగా మార్పు చెందుతుంది.

ఉదా :- గది + లు - గదులు

కాకి + లు - కాకులు

Note :- పొయ్యి + లు - పొయ్యిలు అనే ఉంటుంది. స్వరమార్పు జరుగలేదు.

19) మూడక్షరాల మాటల్లో చివరి అచ్చుకంటె ముందున్న ఇ కారం ఉ కారంగా మారుతుంది.

ఉదా :- ములికి + లు - ములుకులు

అడవి + లు - అడవులు

కలిమి + లు - కలుములు

చతుర్మాత్రాకమైనట్లయితే ఈ మార్పు జరుగదు.

ఉదా :- ఆవిరి + లు - ఆవిరులు, ఆవిర్లు

ఊపిరి + లు - ఊపిరులు

కావిళ్ళు, వేవిళ్ళు, పిడికిళ్ళు

ఈ మార్పు తత్సమ శబ్దాల్లో జరుగదు.

ఉదా :- సమితి + లు - సమితులు

20) నామాంతంలో 'ఉ' మూర్ధన్య వర్ణపూర్వకమైతే లోపిస్తుంది.

ఉదా :- చెట్టు + లు - చెట్లు

కట్టు + లు - కట్లు

బొట్టు + లు - బొట్లు

కోటు + లు - కోట్లు

పండు + లు - పండ్లు

21) ఇదంత నామాల్లో పూర్వసూత్రంవల్ల చివరి 'ఇ' 'ఉ'గా మారుతుంది.

ఉదా :- దడి - దళ్ళు

బడి - బళ్ళు

బండి - బండ్లు

కోడి - కోళ్ళు

వేరొకచోట గుడి + లు - గుడులు, గుళ్ళు

మడి + లు - మడులు, మళ్ళు ఏర్పడుతున్నాయి.

22) తత్సమ శబ్దాల్లో మహద్వాచక 'డు' వర్ణకం లోపిస్తుంది.

ఉదా :- స్నేహితుడు + లు - స్నేహితులు

పండితుడు + లు - పండితులు

ఇది దేశ్యశబ్దాల్లోను కన్పిస్తుంది.

తమ్ముడు + లు - తమ్ములు

23) 'ఎద్దు' శబ్దానికి బహువచనంలో వికల్పంగా 'ఎడ్డ' అయి 'ఎడ్ల' అవుతుంది.

24) పెండ్లి, రాత్రి శబ్దాలకు క్రమంగా 'పెండ్లిండ్లు', 'పెళ్ళిళ్ళు', 'రాత్రిండ్లు', 'రాత్రిళ్ళు' అనేవి బహువచన రూపాలు.

ఇక సర్వనామాల బహువచన రూపాలు.

| | | | | |
|---|---|---|---|---|
| | | ఏ.వ. | - | బహు. వ. |
| ఎ) | ప్రథమ పురుష :- | వాడు | - | వారు, వారలు, వాళ్ళు |
| | | అతడు - | | ,, |
| | | వీడు | - | వీరు, వీరలు, వీళ్ళు |
| | | ఇతడు | - | ,, |
| | | ఈయన | - | ,, |
| | | ఎవడు | - | ఎవరు, ఎవళ్ళు |
| | | ఆమె | - | వారు, వారలు, వాళ్ళు |
| బి) | మధ్యమ పురుష :- | నీవు | - | మీరు |
| | | ఈవు | - | ఈరు |
| సి) | ఉత్తమ పురుష :- | నేను | - | మేము |
| | | ఏను | - | ఏము |

25) విశేష నామాలను గూడ సామాన్య నామాలుగా వాడినప్పుడు 'ట' వర్ణకంతో బహువచన నామాలుగా వాడవచ్చు.

ఉదా :- రామారావులు, కృష్ణమూర్తులు.

★ ★ ★

# 16. తెలుగులో అన్యదేశ్యాలు

తెలుగు భాషలో అతి ప్రాచీన కాలంలో సంస్కృత ప్రాకృత భాషల నుండి పదజాలం విశేషంగా చేరింది. ఏ భాషలోనైనా పదాలు దేశ్యాలు, అన్యదేశ్యాలు అని రెండు రకాలుగా ఉంటాయి. మూలభాష నుండి వచ్చిన పదాలు దేశ్యాలు. ఇతర భాషల నుండి వచ్చి చేరినవి అన్యదేశ్యాలు. సాధారణంగా ఒక భాషలోనికి సమీపవర్తి భాషల నుంచిగాని, సాంఘిక రాజకీయ మతసాంస్కృతిక వాణిజ్య సంబంధాలవల్ల దూరవర్తి భాషల నుంచిగాని పదజాలం వచ్చి చేరుతుంటుంది. ఏదైనా ఒక భావాన్ని సూచించడానికి తగిన పదం స్వభాషలో లేనప్పుడు అన్యభాషల నుండి తత్పదాన్ని గ్రహించటం కూడ పరిపాటియే. పరిపాలకుల భాష అన్యదేశ్యమైనపుడు కూడ ఆ దేశ భాషా పదసముదాయం పాలితుల భాషలో కలవటం జరుగుతుంది.

తెలుగు భాషలో పై కారణాలవల్ల మధ్యయుగంలో అరబిక్, పర్షియన్ భాషా పదజాలం, ఆధునిక కాలంలో పోర్చుగీసు, ఫ్రెంచి మరియు ఆంగ్ల పదాలు వచ్చి చేరాయి. మహమ్మదీయులు ఆంధ్రదేశాన్ని పరిపాలించడానికంటె ముందే తెలుగువారికి వారితో వాణిజ్య సంబంధముండేది. ఈ పరిస్థితుల్లో వాణిజ్య సంబంధమైన మాటలు కూడ తెలుగు భాషలోనికి వచ్చాయి.

ఉదా :- గసగసాలు, ఖరీదు, కిస్మిస్ మొదలైనవి.

ముస్లిం ఆధిపత్యంలో నుండిన తెలంగాణా ప్రాంతంలోని తెలుగు భాషపై ఉర్దూ ప్రభావం విశేషంగా ఉండేది. నిజాం పరిపాలనాకాలం నాటి జనాభా లెక్కల్ని పరిశీలిస్తే క్రొత్త వృత్తికులాలు (Occupational Classes) కనిపిస్తాయి. కస్సాబూలు లేక కటికవాళ్ళు, కబేలాలవాళ్ళు సారా మొదలైన మత్తుపదార్థాలు తయారుచేస్తూ క్రొత్త పరిశ్రమల్ని నెలకొల్పారు. వీరు వాడిన పరికరాలు చికుటా, కటార్ మొదలైనవి

15వ శతాబ్దానికి శాసనాల్లో పరిపాలనా సంబంధమైనవి, సామాన్య, సైనిక వ్యవహారాలలోనివి సుమారు 200 పదాలు పర్షియన్, అరబిక్ భాషల నుండి తెలుగులో చేరిపోయాయి.

ఉదా :- సుల్తాను, పాదుషా, హుజూరు, కితాబు, సిపాయి,
మతలబు, తుపాకి, బందూకు, పిరాయించు,
ఫౌజు, బందోబస్తు, దుకాణం, త్రాసు, కౌలు,
కుస్కీ, దివాను, నకలు, కుర్చి, కలంకార్,

జంబుఖానా, కుళ్ళాయి, ఖూనీ, జలతారు.

సాధారణంగా ఇతర భాషాపదాల్ని స్వీకరించేటప్పుడు కొన్ని పర్యాయాలు స్వభాషకు అనుగుణ్యంగా వాటిని మార్చుకోవటం జరుగుతుంది.

ఉదా :- సుల్తాన్ - సురతాణి, సురత్రాణ

తెలుగులో లేని ధ్వనుల్ని ఉచ్చరించవలసి వచ్చినపుడు తెలుగు ధ్వనుల సహాయంతో పలుకుతాము.

ఉదా :- 'Z' ఉచ్చారణగల ఉర్దూ 'జ' ని తెలుగులో 'జ' కారంగా ఉచ్చరిస్తాము. జిలా - జిల్లా, జిద్ - జిద్దు, తాలవ్యేతర స్వరం పరమైతే జ (దంత్యం) గా దాన్ని ఉచ్చరిస్తారు.

ఉదా :- జమీందార్, జమానా, జరీ, జప్తు

సమీప మాతృకలోని పరహనుమూలీయ స్పర్శవర్ణం క, తెలుగులో ఖ వర్ణంగా మారుతుంది.

ఉదా :- ఉ. కరార్, తె. ఖరార్

ఉ. కస్సాబ్, తె. ఖసాబు, కాబు - ఖాబు.

అయితే మెకంజీ వ్రాతలో పై పదాలకు రూపాంతరాలు కన్పించాయి.

ఉదా :- కరారు, కసాబు మొ... నేటి తెలుగులో 'ఖాబు' అనే మాటకు బదులు 'గాబు' అనేమాట వాడుకలో ఉంది. కొన్నిచోట్ల 'క' 'క' గానే ఉండటం కన్పిస్తుంది.

ఉదా :- ఉ. కబ్జా, తె. కబా

కొన్నిచోట్ల 'క' కారం 'ఖ' కారంగా మార్పుచెందటం కన్పిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | కరీదు | - | ఖరీదు |
| | కర్చు | - | ఖర్చు |
| | కాళీ | - | ఖాళీ |

కొన్నిచోట్ల అలాగే వుంటుంది.

ఉదా :- పకీరు, పద్దు

పదాది హ కారం కొన్నిచోట్ల ఉంటుంది. కొన్నిచోట్ల 'హ' లోపిస్తుంది.

హ కారానికి ఉదా :- హవల్దారు, హవేలీ

హ లోపానికి ఉదా :- ఉషారు

స్వతంత్ర పదాలేగాక కొన్ని అనుబంధాలు సైతం అరువు మాటలుగా రావచ్చు.

ఉదా :- పౌజుదారు, జమీందారు

మొదలైన పదాల్లో కన్పించే 'దారు' తెనుగు పదాలపైన కూడ చేరింది.

ఉదా :- కొనుగోలుదారు, అమ్మకందారు, పెత్తందారు మొదలైనవి.

ఒక భాష నుండి ధాతువుని వేరొక భాష నుండి అనుబంధాన్ని అరువుగా దెచ్చుకొని నూతన పదాన్ని సృష్టించడం కూడ జరిగింది. ఇంగ్లీషు 'will' నుండి 'వీలు, కాలునామా' మొ... పదాల నుండి 'నామా' (పత్రం) కలిసి 'వీలునామా' అయింది.

క్రియల్లో కూడ తెలుగు ప్రత్యయాలు ఉర్దూ పదాలపైన చేరి క్రొత్తరూపాలేర్పడ్డాయి.

ఉదా :- బనాయించు, సతాయించు, వెూహరించు, దబాయించు పదబంధాల్లో ఈ విధమైన అనుబంధం కన్పిస్తుంది.

'నమ్మక్ హరామ్' అనే పదంలో 'హరామ్' అనే పదం అన్యదేశ్యం. 'నమ్మకం' తెలుగు పదం. నిజానికి ఇది ఉర్దూలోని 'నమక్' నుండి వచ్చింది. 'ఉప్పు' అని అర్థం. తెలుగులో ఈ పదం లేదు కావున వాడకంలో లేని నమ్మకం' వాడుకలోకి వచ్చింది. దీన్నే లోకనిరుక్తి (Folk etymology) అంటారు.

ఉర్దూలో 'గార్' ప్రత్యయం తెలుగులో 'గారు' అయింది.

ఉదా :- మదద్‌గార్ – దీనిసామ్యంవల్ల 'మాస్టరుగారు, రెడ్డిగారు, నాయుడుగారు

వంటి రూపాలు ఏర్పడ్డాయి. కాలాంతరంలో ఈ 'గారు' తెలుగులో గౌరవ వాచకంగా పరిణితి చెందింది. ఉర్దూ భాషా ప్రభావం మరీ ఎక్కువగా ఉన్న ప్రాంతాల్లో వాక్యనిర్మాణం కూడ మారింది.

తెలుగు :- నేను బయట పోయినాను.

ఉర్దూ :- మై బాహర్ గయా.

నిజానికి తెలుగువాక్యం 'నేను బయటకు పోయినాను' అని ఉండాలి. అయితే అది ఉర్దూ ప్రభావంవల్ల 'బయట పోయినాను' అని వాడుకకెక్కింది.

పర్షియన్, అరబిక్, ఉర్దూ భాషల్లో నుండి పదాలు చేరేటప్పుడు తెలుగు భాషకు సహజమైన రీతిలో కొన్ని ధ్వనుల మార్పులు జరిగాయి. కాని ఆయా భాషలు బాగా వచ్చినవారు ఏ మార్పులు లేకుండ ఉచ్చరిస్తారు. సాదారణంగా తెలుగులో హలంతాలు అజంతాలుగా మరిపోతాయి.

ఉదా :- మెహనత్ > మెహనత్తు

తకరార్ > తకరారు

బజార్ > బజారు

ఇంకా 'బందోబస్తు, బేజారు, షికారు, బేకారు, తాకీదు' వంటివి ఎన్నో ఉన్నాయి.

అల్ప ప్రాణాలు మహా ప్రాణాలవుతాయి.

ఉదా :- ధోడా > తోడెం

ఖాతా > కాత

ఛత్రి > చత్రి

ఇలాంటివే 'జాడూ, జగడం, గాబరా, దస్కత్తు' మొదలైనవి ఉన్నాయి.

పదమధ్యంలో హల్లులు స్వరవిరహితంగా ఉండటం ఆయా భాషల సహజం. కాని అవి తెలుగులో ప్రవేశించేటప్పటికి స్వరరహితంగా వస్తాయి.

ఉదా :- తక్డా > తుకుడా

మత్లబ్ > మతలబు

మజ్బూత్ > మజబూతు

జబర్దస్త్ > జబర్దస్తు

పూర్వభాషల్లోని హకారం లోపించటం జరుగుతుంది.

ఉదా :- హుషార్ > ఉషారు

సిపాహీ > సిపాయీ

జగహ్ > జాగా

పహర్ > పారా

షహ్నాయ్ > సన్నాయి

ఇవిగాక దీర్ఘాలు హ్రస్వాలుగా, హ్రస్వాలు దీర్ఘాలుగా మారడం కన్పిస్తుంది.

ఉదా :- తాల్ > తల్లె

ఛలాన్ > చాలాన్

ఉర్దూలో 'ఖ'తో ఉండే పదాలు తెలుగులోకి వచ్చినపుడు 'ఖ' కారోచ్చారణతోను, 'ఫ' అనే వర్ణం 'ఫ' కారంతోను పలుకబడుతుంది.

ఉదా :- ఖాతిర్ > ఖాతరు

ఖామోస్ > ఖామోసు

ఖుద్ > ఖుద్దు

ఫికర్, ఫైసలా, ఫర్మానా, ఫర్జ్

ఈ పదాలన్నీ ఫకారోచ్చారణతో తెలుగులో ప్రవేశించాయి.

ఇక యూరోపియన్ భాషా ప్రభావం. 16వ శతాబ్దం తరువాత భారతదేశంలోని

భాషలపై పాశ్చాత్య భాషా ప్రభావం విశేషంగా పడింది. వాటిలో పోర్చుగీసు మొదటిది. విజయనగరాధిపతులతో పోర్చుగీసువారికి వాణిజ్య సంబంధాలుండేవి. అనంతరం వారు దక్షిణ భారతదేశంలో స్థావరాలేర్పరచుకొని రాజకీయాలలో కూడ జోక్యం చేసుకున్నారు. ఇంగ్లీషుకంటె కూడ ముందే పోర్చుగీసు పదాలు తెలుగులో చోటుచేసుకున్నాయి.

ఉదా :- కమాను, పటాలము, ఇస్త్రీ, కమీజు, కాజా, కోస్తా, బంకు, బాల్చి, పీపా, మేజా, మేస్త్రీ, గోదాము.

తెలుగులో 'తాళపుచెవి' లోని 'చెవి' 'శావి' అనే పదం నుండి వచ్చింది.

తరువాత భారతదేశంలో సుస్థిర ప్రభుత్వాన్ని స్థాపించి రెండు శతాబ్దాలు అధికార భాషగా ఆంగ్లాన్ని స్థాపించినవారు ఆంగ్లేయులు. ప్రాచీనకాలంలో సంస్కృత పదాల మాదిరి ఆధునిక కాలంలో ఆంగ్లపదాలు తెలుగులో కుప్పలు తెప్పలుగా వచ్చి చేరాయి. ఆంగ్లపదాలు తెలుగులో ప్రవేశించినపుడు కొన్ని మార్పులు కూడ జరిగాయి. అయితే ఆ భాషని శాస్త్రీయంగా అధ్యయనం చేసిన వారి పలుకుబడిలో ఆ మార్పులు కన్పించవు.

హలంతాలైన ఆంగ్లపదాలు తెలుగులో అజంతాలైనాయి.

ఉదా :-

రైల్ > రైలు
మైల్ > మైలు
గోల్ > గోలు
రోడ్ > రోడ్డు
బస్ > బస్సు
పోస్ట్ > పోస్టు

ఇక అవిద్యావంతులు సంయుక్తాల్ని విడదీసి ఉచ్చరించటం కన్పిస్తుంది.

ఉదా :-

కలెక్టర్ > కలకటేరు
డాక్టర్ > డాకటేరు

సంయుక్తాక్షరంలోని మొదటి వర్ణం లోపిస్తుంది.

ఉదా :- స్టేషన్ > టేషన్

'స్ట' 'ష్ట'గా మారుతుంది.

ఉదా :-

ఫస్ట్ > ఫష్టు
లాస్ట్ > లాష్టు
పేస్ట్ > పేష్టు



అకార ఎకారాలకు మధ్యనున్న 'యి' ఉచ్చారణ ఆంగ్లంలో విశేషంగా ఉంటుంది.

Man, can, cap, gap, Cat, Rat వగైరా.

కాని తెలుగులో వీటికి తగిన వర్ణం లేదు. మ్యాన్, బ్యాంక్, ర్యాట్ అని యిట్లు య కారంతో పలుకుతున్నారు. కాని 'య' కారం పలుకరాదు. 'తాటాకు, వచ్చాడు, వెళ్ళాడు' మొదలైనవాటికి కూడ ఇలాంటి ఉచ్చారణే ఉంది వీటికి లిపి సంకేతం లేదు.

'ఫ' (f) ఒక్కోసారి మామూలు 'ప' గా కూడ మారుతుంది.

ఉదా :- కాపీ, పస్టు.

ఆధునిక భాషా వ్యవహారంలో ఆంగ్లపదాలు లేకుండ ఒక్క వాక్యం కూడ ఉండదు. తెలుగు పదాలు లేని సందర్భాలలోనేగాక తెలుగు పదాలున్నప్పుడు కూడ ఆంగ్లపదాల్ని విరివిగా వాడటం జరుగుతుంది.

ఉదా :- ఫుడ్, లైఫ్, బ్రదర్, జాబ్, విలేజ్, మ్యారేజి

ఇందుకొక ప్రధాన కారణముంది. ఆంగ్లభాషా పరిజ్ఞానమే విద్యావంతుని లక్షణం అనే భావన దేశంలో వ్యాపించింది. అందుకే అవసరమున్నా లేకున్నా ఆంగ్లభాషా పదాల్ని జనం వాడుతోంది. Need, filling Motive, Hyper Standardization కూడ అన్యదేశ్యాలు తెలుగు భాషలో ప్రవేశించటానికి ప్రదాన కారణాలు. మొగలాయీల పరిపాలనా కాలంలో లివిన్యూ సంబంధమైన పదజాలమంతా భారతీయ భాషలన్నింటిలోకి చొచ్చుకొని వచ్చినట్లే తెలుగులోనూ ప్రవేశించింది. పాలకుల భాషాప్రభావం పాలితుల భాషలపై పడుతుందనటానికి తెలుగులోకి ప్రవేశించిన ఆంగ్లభాషా పదాలే నిదర్శనం.



# 17. తెలుగు లిపి పరిణామం

ఉపోద్ఘాతం :- తెలుగు లిపి గుండ్రంగాను, అందంగాను ఉంది. అయితే అతి ప్రాచీనకాలం నుండి మన లిపి ఆణిముత్యాలకోవ అని చెపితే నమ్మలేం. క్రీ.శ. 1 వ శతాబ్దం నుండి ఎన్నో వంకర టింకర గీతలు రాతిబండలపైన, రాగిరేకులపైన, తాటాకులపైన రాపాడి రాపాడి ప్రస్తుత స్వరూపాన్ని మన లిపి సంతరించుకొంది.

భాష ధ్వని రూపంలో వెలువడుతుంది. తర్వాత ఈ భాషకివి, ఇన్ని ధ్వనులని సంకేతించటానికి వర్ణమాల ఏర్పడుతుంది. దీన్ని వర్ణ సమామ్నాయమన్నారు వ్యాకర్తలు. అక్షరమంటె క్షరం కానిది లేదా నశించనిది. గాలిలో కలసిపోదు. పలుకులు, మాటలు గాలిలో కలువవచ్చు. వాటికి సంకేతాలైన అక్షరాలు ఎన్నేళ్ళయినా చెక్కుచెదరవు.

ప్రాచీన పారశీకులు వాడిన బాణాల వంటి లిపిని పాశ్చాత్యులు 'క్యూనిఫారం' లిపి అన్నారు. ఈజిప్టులో ఒకప్పటి చిత్రలిపి వంకర్లుపోయి, ప్రపంచ లిపులన్నింటికి మాతృక అయినట్లు పాశ్చాత్యుల భావన.

మన భారతీయ లిపి కూడ చాల ప్రాచీనమైందే. ఇది చిత్రలిపి నుంచి ఆవిర్భవించిందంటారు. ఋగ్వేదాది ప్రాచీన వైదిక వాఙ్మయాన్నిబట్టి మనకు కూడ లేఖన పద్ధతి ఉండి వుంటుందని ప్రాచ్య పాశ్చాత్య విద్వాంసు లూహించారు. వైదిక సాహిత్యంలోనేగాక జైన బౌద్ధ సాహిత్యాల్లో కూడ లిపి ప్రస్తావన ఉంది. బుద్ధునికంటె ముందునుంచే తమిళ సంగం సాహిత్యంలో లేఖన సంప్రదాయమున్నట్లు శ్రీ టి.వి. మహాలింగం అన్నారు.

ఇటీవల పురాతత్వ శాస్త్రజ్ఞుల పరిశోధనవల్ల బయల్పడ్డ ప్రాచీన శాసనాల్నిబట్టి తెలుగుదేశంలో లిపి అశోకుని కంటె ముందు నుంచి వున్నట్లు గుర్తింపబడింది. అమరావతి శాసనలిపి, అశోకుని శాసనలిపికి సన్నిహితంగా ఉంది. భారతదేశంలోని లిపులన్నీ దీని నుండి పుట్టాయని పరిశోధకుల అభిప్రాయం. భట్టిప్రోలులో దొరికిన ఒక స్థూపాన్నిబట్టి అందులోని 'ఘ, చ, ద, ధ, మ, శ, ష' అనే అక్షరాలు భిన్నంగా కన్పించడంవల్ల దీన్ని 'ద్రావిడ బ్రాహ్మీలిపి' అని అభిప్రాయపడ్డారు. ఇదే దక్షిణ బ్రాహ్మీలిపి.

ఈ దక్షిణ బ్రాహ్మీలిపి నుండి తెలుగులిపి ఆవిర్భవించింది. ఈ దేశాన్ని పాలించిన రాజులు తమ శాసనాల్ని మాతృభాషల్లో, ప్రాంతీయ భాషల్లో వేయించారు. అలా వచ్చిన లిపులు 'శాతవాహనలిపి లేదా ఆంధ్రలిపి, ఇక్ష్వాకులలిపి, పల్లవలిపి, వేంగీలిపి, చాళుక్యలిపి' అనే ప్రచారం పొందాయి. ఈ రాజన్యుల పరిపాలనా

కాలంలో బ్రాహ్మీలిపిలో అనేకమైన మార్పులు వచ్చాయి. తెలుగు ప్రాంతాన్ని పాలించిన విష్ణుకుండినుల కాలంలో పరిణతి చెందిన తెలుగు లిపిని 'వేంగీ' లిపి అన్నారు. ఇది తెలుగు, కన్నడ భాషల్లోనేగాక దక్షిణాపథమంతట విస్తరించింది. ఇదే తెలుగు, కన్నడాలకు పూర్వరూపం.

అనంతరం రాజ్యపాలన చేసిన విష్ణుకుండినుల కాలంలో లిపిలో చెప్పకోదగ్గ మార్పు వచ్చింది. ఈ కాలంలోనే కొన్ని అక్షరాలపై కన్పించిన చిన్న అడ్డుగీత అక్షరాలన్నింటిపైకి ప్రాకింది. తమిళ భాషలో మిగిలిన ద్రావిడ వర్ణం 'ఴ' కారం, ఈ కాలంలో కన్పించి, నన్నయ దాక వాడుకలో వుంది. క్రమంగా 'డ, ర' లుగా మారింది. విష్ణుకుండినుల శాసనాలలోని అక్షరాల అడ్డుగీత క్రమంగా పొడవై, వంకరై నేటి తలకట్టుగా స్థిరపడింది.

తర్వాత క్రీ.శ. 7వ శతాబ్దంలో తెలుగుదేశాన్ని పరిపాలించిన రాజులు చాళుక్యులు. వీరికాలంలోనే వేయించిన శాసనాల లిపి 'వేంగీచాళుక్యలిపి'గా పరిగణింపబడింది. వీరిలో రేనాటి చోళరాజు 'ఎరికల్ ముతురాజు' వేయించిన శాసనం కడపజిల్లా ఎర్రగుడిపాడులో ఉంది. సత్యాశ్రయుడు వేయించిన రెండవ శాసనం ఇదే జిల్లాలో పోట్లదుర్తి - మాలేపాడు వద్ద వుంది. ఈ వేంగీ చాళుక్య లిపికి క్రీ.శ. 10, 11, 12 శతాబ్దాల కాలం పరివర్తనాకాలం లేదా సంధికాలమనవచ్చు. ఇదే ఇప్పటి తెలుగు - కన్నడ లిపుల ప్రాచీన రూపమై యుండవచ్చు. నన్నయ ఈ లిపిలోనే భారతాన్ని వ్రాసి వుంటాడని ఊహించారు. ఆయన వేయించిన నందంపూడి శాసనాన్నిబట్టి పూర్వలిపి తెలుగులో ఎంతగా మార్పు చెందిందో గ్రహింపగలం. నన్నయకాలానికి మన తెలుగులిపి బాగా తలకట్టు దిద్దుకొని చతికిలబడింది. నన్నయ తర్వాత రెండువందల యేండ్లకు క్రమంగా లిపిలో మార్పువచ్చి తెలుగు - కన్నడ లిపులుగ విడిపోయాయి. క్రమంగా తెలుగు మఱింత గుండ్రనైంది.

లిపి పరిణామ వృక్షాన్ని ఈ దిగువ రీతి ఊహించవచ్చు.

దక్షిణ బ్రాహ్మీలిపి

గుహాలిపి

చాళుక్యలిపి　　వేంగీలిపి

పశ్చిమ చాళుక్య　　తూర్పుచాళుక్య　　పాతజావాకలి

పరిణామదశ - సంధికాలం　　కొత్తజావాలిపి

హళగన్నడలిపి　　పాతతెలుగులిపి

కన్నడలిపి తెలుగులిపి

సంధికాలంలో పెక్కుమార్పులు జరిగాయి. చ కారానికి తలకట్టు వచ్చింది. 'ఛ' కారం యొుక్క ఎడమ భాగం గుండ్రనైంది. 'ఠ, థ ధ'లకు తలకట్టులేర్పడ్డాయి. 'ఫ, భ' లు చాలా మార్పుచెందాయి. అనుస్వారం (0C) అక్షరం ప్రక్కన సపంక్తిలో వుంచటం అలవాటయింది. మహాప్రాణాలకు ఒత్తులు, పొల్లులు ఏర్పడ్డాయి.

రెడ్డిరాజుల కాలానికి ఒకటి, రెండు తప్ప తక్కిన అక్షరాలన్నీ మార్పుచెందాయి. తెలుగులిపి ప్రపంచంలో పడినట్లయింది. నేటి లిపికి సన్నిహితదశ ఏర్పడింది. 'క్ష, ష' అనే అక్షరాలు స్పష్టరూపం ధరించాయి.

'చ, జ' లపైన దంత్యోచ్చారణని గుర్తించడానికి పాత తెలుగు లిపిలో రెండంకెల గుర్తు వంటి గీత కన్పించేది. వ్యాకర్తలు ఈ చజల్ని దంత్యచజలన్నారు. అప్పకవి ఈ రెండక్షరాలపై చుక్క పెట్టాలని అన్నాడు. దంత్యతని గుర్తించటానికి ఈ గుర్తుని ౧౯వ శతాబ్దంలో సి.పి. బ్రౌన్ దొర సూచించారు.

తెలుగులో అరసున్న ఒక వింతలిపి. ఇది కూడ ౧౦వ శతాబ్దానికి ముందు వ్రాతలో కన్పించదు. అనుస్వారం సంస్కృత ప్రాకృత సంప్రదాయాల్నిబట్టి తెలుగు భాషలోనికి వచ్చింది. లేకపోతే దాన్ని వర్గపంచమాక్షరంతో వ్రాయుటమే ఆచారమని ప్రాచీన తెలుగు శాసనాలవల్ల స్పష్టమైంది. అనంతర కాలంలో సున్న అక్షరానికి ప్రక్కన చేర్చేటప్పుడు తర్వాతి వర్ణాన్ని ద్విరుక్తంగా వ్రాయుటం అలవాటుగా పరిణమించింది.

ఉదా :- మూండ్డు, కూంత్తురు

క్రమంగా లేఖనంలో ఈ పద్ధతి నశించి మూండు, కూంతురు/మూడు కూతురు వంటి లిపి ఏర్పడింది.

అనుస్వారాన్ని తేల్చిపల్కడానికి 'అరసున్న'ని వైయాకరుణులు సృష్టించారు. అందువల్లనే నేటికి 'రాముడు, భీముడు, వాడు' మొదలైన శబ్దాలలో పూర్ణబిందువుని సూచిస్తూ 'అరసున్న' నిలిచివుంది. ఇటీవలికాలంలో ఈ అరసున్న వ్రాత నుండి పూర్తిగా అంతరించింది.

ఇక ముఖ్యాక్షరాలతోపాటు గుణింతాలు కూడ మార్పుచెందాయి. ద్విత్వాక్షరాల్ని సూచించే ఒత్తులు చాలవరకు నేటి లిపిలో పూర్వస్వరూపంతోనే నిలిచివున్నాయి. తలకట్టులు, గుడి, కొమ్ములు, పొల్లులు, ఒత్వసూచకాలైన అడ్డు, నిలువు గీతల్లో అచ్చుల్ని సూచించటానికి ఒక్కొక్క దశలో పెక్కుమార్పులు వచ్చాయి. ముఖ్యంగా

హల్లుల్లో 'ర' కారాన్ని వ్రాయవలసివస్తే సంయుక్తంలో దీన్ని ఇప్పటిలాగ అక్షరానికి దిగువ కాక ప్రక్కన వుంచేవారు.

ఉదా :- సమప్ప ̊ న, కమ ̊.

ఈ రేఫ చిహ్నాన్ని 'వలపలగిలక' అని పేర్కొన్నారు. 'వలపల' అంటె కుడిప్రక్క అని అర్థం. కుడిప్రక్క గిలక రూపంలో వుండటంవల్ల ఆ పేరు కల్గింది. ప్రస్తుతం బ్రౌన్ సంస్కరణ ఫలితంగా ఈ పద్ధతి నశించి, అక్షరానికి దిగువ అర్ధచంద్రాకృతిలో రేఫ సంయుక్తం వ్రాయబడుతోంది.

ఉదా :- చక్రం, అవక్రం, విక్రమం

ఇప్పుడు మనం విరామ సమాప్తుల చిహ్నంగా, కామా, ఫుల్‌స్టాప్‌లు వాడుతున్నాము. కాని పూర్వం విరామ చిహ్నానికి ' ' ఇలా ఒంటినిలువు గీత, సమాప్తి చిహ్నానికి ' ।' జంటనిలువుగీత వ్రాయటం ఆచారంగా ఉండేది. నాగరలిపిలో ఇది ఇప్పటికి ఇలాగే వుంది.

కామాలో వచ్చిన మార్పు :-

| | | |
|---|---|---|
| అప్పుడు | - | ఇప్పుడు |
| '।' | - | ',' |

ఫుల్‌స్టాప్‌లో వచ్చిన మార్పు :-

| | | |
|---|---|---|
| అప్పుడు | - | ఇప్పుడు |
| '।।' | - | |

గుణింతాల్లో వచ్చిన మార్పులిలా వున్నాయి.

1) తలకట్టు అక్షరం మారుతూ వచ్చినపుడు ఏర్పడ్డ 'అకారమే' గాని విడిగా చేరింది గాదని ముందే అనుకున్నాము. కాని, తలకట్టు 'అ కారానికి' చిహ్నమనే భావం తర్వాత స్థిరపడింది.

2) అ కారం:- దీని దీర్ఘాన్ని సూచించడానికి చిన్న అడ్డుగీత పెట్టడం అశోక భట్టిప్రోలు శాసనకాలం నుంచి వుంది. ఈ అడ్డుగీత అక్షరం కుడి పైపు చివర పెట్టేవారు. తర్వాత ఇది అక్షరంపైన అడ్డుగీతగా మారి శ్రీనాథుని కాలానికే కుడి కొస వంగి సుడిదేరింది. విజయనగర కాలంలో మరింత చిన్నదై ఇది స్థిరపడింది.

3) 'ఇ' :- ఈ గుణింతానికి ఆ కారాన్ని సూచించే అడ్డుగీత మీద చిన్న నిలువు గీత పెట్టడం అశోక శాసనాల్లో కన్పిస్తుంది. ఇది శాతవాహనుల కాలానికి తురాయిలాగ లేచి, చాళుక్యలిపిలో తురాయికొస కుడిపైపునకు వంగి సున్నగా మారింది. శ్రీనాథుని కాలానికి పెద్ద కమానుగానై, విజయనగర కాలానికి

కమాను కుడికొన లోపలికి సుడితిరిగి నేటిగుడికి మూలమైంది.

4) 'ఈ' :- ఈ గుణింతాన్ని సూచించటానికి పైన రెండు నిలువు గీతలు పెట్టేవారు. ఈ రెండు నిలువు గీతలు క్రమంగా వర్తులాకృతి ధరించి, ఎడమ వైపునకు సుడితిరిగి విజయనగర కాలానికి నేటరూపానికి సమీపమైంది.

5) 'ఉ' :- దీన్ని సూచించటానికి అశోక భట్టిప్రోలు శాసనాల్లో అక్షరం క్రింద అడ్డుగీతగాని, నిలువుగీతగాని కనిపిస్తుంది. ఈ గీత నన్నయ కాలానికి అక్షరం కుడిప్రక్కన అంటుకొని వుండటం కన్పిస్తుంది. ఇది శ్రీనాథుని కాలానికి కొన పైకివంగి పొడవయింది. విజయనగర కాలానికి ఇప్పటిలాగ తీర్చినట్టయింది.

6) 'ఊ' :- దీన్ని తెల్పడానికి అక్షరం అడుగున రెండు నిలువు గీతలు కన్పిస్తాయి. ఇవి భట్టిప్రోలు శాసనంలో హంసపాదుగా కన్పిస్తాయి. ఇక్ష్వాకు కాలంలో కుడివైపుకు వాలాయి. ఇది క్రమంగా ప్రక్కకు ఒరిగి విజయనగర కాలానికి కొమ్ము దీర్ఘంగా నేటిరూపాన్ని సంతరించుకుంది. 'ప, ఫ, వ' లకు మాత్రం కొమ్ము కొమ్ముదీర్ఘాల్ని పొక్కిలిలో వ్రాయటం జరిగింది. అక్షరానికి ప్రక్కన వ్రాస్తే ఘ కార, మ కార భ్రాంతి కల్గుతుందని అలా వ్రాయలేదు.

7) 'ఋ' :- ఈ గుణింతాన్ని ప్రాచీన సంస్కృత శాసనాల్లో అక్షరం కుడివైపున ఐ మూలంగా ఒక వంపుతో సూచించేవారు. చాళుక్యుల కాలానికి ఇది వట్రుసుడిగా మార్పుచెందింది. రెడ్డిరాజుల కాలం వరకు ఇది అక్షరాన్ని అంటిపెట్టుకుని ఉంది తెలుగు పద్యరచనలో ఋ కారాన్ని , రు, క్రావడిగా వ్రాసేవారు.

ఉదా :- ప్రిథ్వీవల్లభ, రుషి, రిషి వగైరా.

వట్రుసుడికి, రేఫకు ఉచ్చారణ సామ్యమున్నందువల్ల శాసన భాషలో 'రేఫ'కు మారుగా సుడి వ్రాయాటం కలదు.

ఉదా :- మహీపాతృల కుమారుడు (పాత్రుల)
మహాపాతృండు (మహాపాత్రుండు)

8) 'ఏ' కారం :- దీన్ని సూచించడానికి అశోక, భట్టిప్రోలు లిపుల్లో అక్షరం ఎడమవైపు ఎగువన అడ్డుగీత కనిపిస్తుంది. వేంగీ చాళుక్య లిపిలో ఈ గీత కొన ఎడమకు వాలింది. కాకతీయుల కాలంలో కొక్కెరలాగ మారింది. విజయనగర కాలానికి నేటిరూపం స్థిరపడింది.

9) 'ఐ' :- ఈ గుణింతాన్ని అక్షరానికి 'ఏ' గుణింతమిచ్చిన తర్వాత అక్షరం కుడిప్రక్కన క్రిందుగా అంటిపెట్టుకున్న అరసున్న వంటి గుర్తు పెట్టేవారు. ఇది

కాకతీయ కాలానికి అంటిపెట్టుకొనడం మాని శ్రీనాథుని కాలానికి మొదటి కొనలో సుడితిరిగింది.

10) 'ఓ' :- ఇది అశోకుని శాసనాల్లో అక్షరంపైన రెండు చిన్న అడ్డుగీతలు పెట్టి సూచించేవారు. ఇవి నన్నయ కాలానికి రెక్కలు విచ్చిన పక్షిలాగ మారాయి. కాని 'ఓ' గుణితమిచ్చి అక్షరం ప్రక్కన కొమ్ముకు దీర్ఘమిచ్చే పద్ధతి కూడ మొదలయింది. 'మ, య, హ'లలో మాత్రం తప్పనిసరిగా మిగిలింది. ఏమైనా 'ఎ, ఏ, ఒ, ఓ'ల హ్రస్వదీర్ఘభేదం 16వ శతాబ్ది వరకు పాటించినట్లు కన్పించదు.

11) 'ఔ' :- ఈ గుణింతం ప్రాచీన ప్రాకృత శాసనాల్లో కన్పించదు. నన్నయ కాలానికి నేటి 'ల' వత్తును ఏటవాలుగా పెట్టినట్లున్న గుర్తు కన్పిస్తుంది. శ్రీనాథుని కాలానికి ముఖ్యాక్షరానికి మించి నేటి 'ఙ' వర్ణంతల మీద మోపినట్లు ఉంటుంది. 'మ, య' వంటి అక్షరాల కొమ్ములకు ఔత్వమిచ్చే పద్ధతి ఏర్పడింది.

ఉపసంహారం :- విదేశ పాలనవల్ల అచ్చుయంత్రాలు రావడంతో మన లిపి మరింత గుండ్రనై స్థిరరూపం దాల్చింది. పాశ్చాత్యులు అనుసరిస్తున్న విరామ చిహ్నాలు అలవాటయ్యాయి. ముద్రణ పరిశ్రమ ఆధునికతని సంతరించుకున్నకొద్దీ దాని ప్రభావం ఫలితాలు మన లిపిపై కూడ ప్రసరించి, టైపు యంత్రాలు మోనోటైపు, లైనోటైపు, డి.టి.పి వంటి నూతన ప్రక్రియలు రావడంతో అక్షర స్వరూపం చెడకుండ ఎన్నో మార్పులు పొకర్యాలు కల్గాయి.

మనలిపి అతి ప్రాచీనమైందనటంలో సందేహం లేదు. ఇది చిత్రలిపి నుండి పరిణమించింది. దీనికి మొదట బ్రాహ్మీలిపి అనే పేరు గల్గింది. తర్వాత ఇది ఉత్తర, దక్షిణ బ్రాహ్మీలిపి అని రెండు శాఖలయింది. దక్షిణ బ్రాహ్మీలిపియే తెలుగుదేశాన్ని పాలించిన ఆయా రాజుల పేర ప్రచలితమై నేటి తెలుగు లిపిగా రూపుదిద్దుకొంది.



# 18. గ్రాంథిక వ్యావహారిక భాషలు - వాదోపవాదాలు

1. ప్రామాణికభాష లేదా గ్రాంథికభాష

మాండలికావస్థలోనున్న భాషలో కావ్యాలుపుట్టి, సభలు జరుగుతూ విచారణలు ప్రబలేటప్పుడు ఆ భాషకొక స్థిరరూపమేర్పడుతుంది. అంటె ద్రవరూపం పోయి ఘనీభవ రూపమేర్పడుతుంది. తెలుగుభాష నన్నయభట్టు కాలంనాటికి పరిణతి చెంది, ఆయన చొరవ వల్లనే కావ్యోపయోగి అయింది. వాడుకలో భిన్నరూపాలుగానున్న తెలుగుభాష ఆర్యనాగరికత, ఆర్యభాషా సంసర్గం, రాజశాసనాలు, బ్రాహ్మణ, బౌద్ధమత సమావేశాలు మొదలైన సంఘటనలవల్ల స్థైర్యాన్ని వహించింది సాధారణంగా ఏ భాషకైన స్థిరత్వమేర్పడ్డ తర్వాత అంతకుపూర్వమున్న విభిన్న మాండలిక రూపాలంతరించి పోతాయి. కావ్యాల్లో కవులు గ్రహించిన మాండలికాలే ప్రామాణికాలై నిలుస్తాయి. ఏకరూపత ఏర్పడుతుంది.

క్రీ.శ. 10వ శతాబ్దానికి కొంచెం స్థిరత్వాన్ని పొందిన తెలుగులో గాసట బీసటగా ఉన్న వాఙ్మయాన్ని నన్నయ సంస్కరించి మహాభారతాంధ్రీకరణానికి పూనుకున్నాడు. అయినప్పటికి ఆయన 'భారత భారతీ సముద్రము దరియంగనీదను విధాతృనకైనను నేరబోలునే' అని సందేహిస్తూనే, విద్వజ్జనుల అనుగ్రహం చేత 'నా నేర్చిన భంగి జెప్పి వరణీయుడ నయ్యెద భక్తకోటికిన్' అని సవినయంగా భారతాంధ్రీకరణకు ఉపక్రమించాడు. నారాయణభట్టు తోడ్పాటుతో రెండున్నర పర్వాలు (ఆది సభాపర్వాలు, అరణ్యపర్వం కొంత) రచించి తక్కిన పర్వాలు ముగించకుండానె కాలధర్మం చెందాడు. నన్నయ వాడిన కావ్యభాషయే తర్వాత వచ్చిన తిక్కన, శ్రీనాథాదులకు, ప్రబంధ కవులకు ప్రామాణికాంధ్ర భాషయై విరాజిల్లింది. ప్రాచీనాంధ్ర కవులచే పరిరక్షింపబడిన తెలుగుభాష 19వ శతాబ్దం వరకు పూర్వ స్వరూపాన్ని కోల్పోకుండ గ్రాంథికంగా కొనసాగింది. ఇంతదాక సంస్కృత భాష ఆంధ్ర భాషకు ప్రామాణికమై ఒప్పింది.

తర్వాత భారతదేశం అన్యాక్రాంతమై ఆంగ్లేయుల పరిపాలనకు గురయింది. పాశ్చాత్యులు పాలకులై భారతీయ విద్యాప్రణాళికని తమ సంప్రదాయాలకు అనువుగా రూపొందించారు. కడప నుంచి ఆనాటి కలెక్టరు సర్ సి.పి.బ్రౌను అను ఆంగ్లేయుడు తెలుగుగ్రంథ సముద్ధరణకై కంకణం కట్టుకున్నాడు. తాళపత్ర గ్రంథాలు తెప్పించి, పండితులచే శుద్ధప్రతులువ్రాయించి ప్రామాణిక ప్రతులు తయారు చేయించాడు. వాటికి ముద్రణాభాగ్యం లభించింది. అయితే

చాలవరకు అపప్రయోగాలకు నెలవైన వ్రాతప్రతులు దోషభూయిష్టంగా ఉండేవి. బ్రౌన్ పుణ్యమా అని అవన్నీ తొలగి, తెలుగు భాషలో నిర్దుష్టమైన గ్రంథాలు వెలుగులోకి వచ్చాయి. బ్రౌన్‌గారి ముద్రణా ప్రణాళిక, గ్రంథసంపాదన ప్రాముఖ్యతని సంతరించుకున్నాయి.

ఇదే సమయంలో చిన్నయసూరి రచించిన బాలవ్యాకరణం, బహుజనపల్లి సీతారామాచార్యులు రచించిన ప్రౌఢ వ్యాకరణం తెలుగు ప్రామాణిక భాషకు పట్టుగొమ్మలై నిలిచాయి. తర్వాత కీ.శే. వీరేశలింగం పంతులుగారు ఆంగ్లభాషలోని పెక్కు గ్రంథాల్ని ఆంధ్రీకరించి మహోపకారం గావించారు. నాటి నుండి తెలుగు భాషలో అనేక నవలలు, నాటకాలు, వ్యాససంపుటాలు, విమర్శలు ప్రామాణికంగా వెలిశాయి. నాటక సంఘాలు, కవిజన సమాజాలు, సారస్వత సంఘాలు, ప్రబలజొచ్చాయి. తిరుపతి వేంకట కవుల అవధానాలు తెలుగు భాషకు కొత్త ఊపునిచ్చాయి. ఆంధ్రపత్రిక వంటి దినపత్రికలు, భారతి వంటి మాసపత్రికలు అవతరించాయి. మదరాసు నుండి బరంపురందాక, బందరు నుండి బళ్ళారిదాక ఒకే నియమబద్ధమైన గ్రాంథికాంధ్రభాష ప్రామాణికమై నిల్చింది. నన్నయకాలం నుండి 1940 దాక, అదే భాష కవిపండితులెల్లరికి తెలుగునాట మార్గదర్శకమై ఒప్పారింది.

**2 వ్యావహారిక భాష:-** జనవ్యవహారంలోని వాడుక భాషని వ్యావహారిక భాష అంటారు. ప్రాంతాన్ని, అందలి జాతుల్నిబట్టి వ్యావహారిక భాష అనేక రూపాలుగా నుండవచ్చు. వాడుకలోని భాష విభిన్న రూపాలెత్తటానికి ప్రజల ఉచ్చారణ దోషాలు, వారి సోమరితనం, అజ్ఞత ప్రధాన కారణాలవుతాయి. అందుకే ప్రాచీనులైన నన్నయాది కవిపుంగవులు వాడుక భాషని సంస్కరించి దాన్ని గ్రంథస్థం చేశారు. అలా గ్రంథగ్రథితమైన తెలుగుభాష ఏకరూపతగల్గి ప్రామాణికంగా ఒప్పారింది.

జనోపయోగియైన భాషని 'లక్షణ విరుద్ధంబైన భాషగ్రామ్యము' అని ఆంధ్ర వ్యాకర్తలు నిర్వచించారు. లాక్షణికులు గతంలో వాడుకలోని భ్రష్టరూపాల్ని, నియమ రహితాల్ని, సంస్కార విహీనమైన వాటిని గ్రామ్యాలని చెప్పి గ్రంథరచనకు తగవని తిరస్కరించారు. ఆంధ్రశబ్ద చింతామణికారుడు 'నరపాలులు, శైలకన్యా' మొదలైన పదాల్ని గ్రామ్యాలని వాడుకొని అవి 'నరపాలురు, శైలకన్య' అనే రీతి ఉండాలని అనుశాసించాడు. అవే సాధురూపాలని నిర్దేశించాడు.

ఇంతకు ఈ విశదీకరణాన్నిబట్టి 'పామరజనులు వ్యవహరించేభాష గ్రామ్యం' అని స్పష్టమైంది. 'తెచ్చతాడు, యేము, ఎగనామం, కొంటూ, మోసేటివాళ్ళు, తెచ్చేటివాళ్ళు' మొదలైన పదాలు గ్రామ్యభాష. ఇదేవిధమైన భాష నన్నయాదుల కాలంలో కూడ వాడుకలో నున్నట్లు గుర్తించగల్గారు ఈ పదాలే నేటి వ్యావహారిక భాషలో 'తెస్తాడు, మేము, మోస్తున్నవాళ్ళు, తెస్తున్నవాళ్ళు'గా పరిణతి చెందాయి. పూర్వులు గ్రామ్యమని నిర్దేశించిన భాషనే ఆధునిక యుగంలో 'వ్యావహారికభాష' అన్నారు.

3 వ్యావహారికము లేదా గ్రామ్యము- లక్షణాలు :

1) వ్యాకరణ క్రమాన్ని పాటించకుండ ప్రజలు సోమరితనం వల్లనో అజ్ఞత వల్లనో స్వప్రయోజనం కొరకు వాడుకునే భాష వ్యావహారికం లేదా గ్రామ్యమనిపించుకుంటుంది.

2) అపండితులు, అజ్ఞులు నిరంతరం వాడే అపభ్రష్ట రూపాలతో కూడిన భాష.

ఉదా :- అగుతుంది, అవుద్ది, అవుతది, అగుద్ది వంటి పదప్రయోగాలు ఎవ్వరుపయోగించినా అది గ్రామ్యమన్నారు పూర్వలాక్షణులు.

భాషని త్రివిధ రూపాలుగా విభజించవచ్చు.

1) ప్రామాణికం లేదా గ్రాంథికం :-

ఉదా :- వచ్చుచున్నాడు, తినుచున్నాడు, వచ్చెను, తినెను,
వచ్చిరి, వచ్చితిరి, రాగలడు వగైరా.

2) సందిగ్ధం :- పరిగ్రహింపదగిందా, తిరస్కరింపదగ్గదా అనే సందేహానికి ఆస్కారమిచ్చే భాష.

ఉదా :- వల్ల, నుంచి, గుండా, చాలా, కూడా వంటివి.

Note :- వీటిని అపభ్రంశాలని కొందరు నిరసించారు. కొందరు పరిగ్రహించి తమ కృతుల్లో వాడారు.

3) కేవల గ్రామ్యం :- ఒస్తోండాడు, ఒస్తోండు, ఒకుపొచ్చాడు, ఒత్తాడు వంటి భాష నిశ్చయంగా పామర జనం వాడేది. దీన్ని లాక్షణికులు 'గ్రామ్యం' అని ముద్రవేశారు. దీన్ని 'వ్యావహారికం' అని కూడ అన్నారు.

గ్రంథస్థమైన ప్రామాణిక భాషకు, గ్రామ్యమని గుర్తింపబడ్డ వ్యావహారిక భాషకు కాలాంతరాన ఎడం పెరుగుతూ వచ్చింది. సాదారణ ప్రజలెల్లరు నన్నయాదులు వాడిన లేదా గ్రంథస్థం చేసిన భాషలో వ్యవహరించటం దుస్సాధ్యం. అందువల్ల గ్రంథస్థ భాషకు ప్రామాణికత పెరిగింది. దాని

ప్రయోజనం కూడ విస్తృతమైంది. ఎవ్వరుపయోగించినా, దాని స్వరూప స్వభావాల్లో భిన్నత్వముండదు. కాని వ్యావహారిక భాష యొక్క ప్రయోజనం తాత్కాలికమైంది. ఒండొరుల అభిప్రాయాలు తెలుపుకోవటం దాని ముఖ్య ప్రయోజనం. అందువల్ల ఈ వ్యావహారిక భాష ప్రాంతీయమై అనేక మాండలిక భేదాలుగలదై ఉంటుంది. ఒక ప్రాంతవాసుల మాండలిక రచన వేరొక ప్రాంతవాసుల మాండలిక రచనతో ఏ సామ్యత లేనిదవటంవల్ల అర్థసౌలభ్యానికి భంగం యేర్పడవచ్చు. ఇది స్థూలంగా ఆనాటి గ్రాంథిక భాషావాదుల వాదం.

అయితే, కాలం మారింది. ఆంగ్లభాషా సాహచర్యంతో భారతీయ భాషల్లోను, భాషా పండితుల్లోను భిన్నాభిప్రాయాలు చోటుచేసుకున్నాయి. తెలుగునాట వాడుకలో ఉన్న వ్యావహారిక భాషని గూడ గ్రంథస్థం చేయాలనే అభిప్రాయం ప్రబలజొచ్చింది. చిరకాల రాజశాసనాలు, దరఖాస్తులు, దస్తావేజులు మొదలైన దైనందిన కార్యక్రమాలన్నింటికి వ్యావహారిక భాషని వాడుకోవటం పరిపాటి అని పండితులు అభిప్రాయపడ్డారు. శిష్టజన వ్యవహృత భాషకి, గ్రాంథిక భాషకి పెద్ద తేడా లేదని వాదించి వ్యావహారికోద్యమాన్ని మొదట లేవదీసినవారు కీ.శే. గిడుగు రామమూర్తి పంతులుగారు. వీరికి దన్నుగా నిలబడ్డ వ్యావహారిక భాషావాదులు శ్రీ గురజాడ అప్పారావుగారు, తాతా సుబ్బరాయశాస్త్రిగారు, వి.చినసీతారామశాస్త్రి వంటి ఉద్దండ పండితులు, వ్యాకర్తలును. ఈ దిశగా సాగిన అనేక వాదోపవాదాలు, చర్చావేదికలు ప్రాతిపదికగా మొదట గ్రాంథికవాదులుగానున్న వీరేశలింగం పంతులుగారు హఠాత్తుగా వ్యావహారిక భాషావాదాన్ని సమర్థించారు.

వ్యావహారిక భాషావాదుల అభిప్రాయాలు :-

1) గ్రాంథికభాష మృతప్రాయం.

2) ఆ భాషలో ఎవ్వరేమి వ్రాసినా తప్పలుండకపోవు.

3) అది పండితులకే కొరకరాని కొయ్య.

4) వ్యావహారికభాష జీవద్భాష.

5) అది సుబోధకమైంది.

6) ఎల్లరికి సుపరిచితమైంది.

7) పండితులు గ్రాంథికం పేరుతో వాడే భాష కృతకం అది గ్రాంథికం గాదు, వ్యావహారికం గాదు.

ఈ పై సిద్ధాంత ప్రాతిపదికతో గిడుగువారు దేశదేశాలు, ఆంధ్రప్రదేశ్

జిల్లాలన్నింటిని తిరిగి, వాదోపవాదాలు గావించి, వ్యావహారిక భాషని గ్రంథస్థం చేయాలనే వాదానికి బలం చేకూర్చారు.

ఇక గ్రాంథిక భాషావాదుల్లో కీ.శే. జయంతి రామయ్య పంతులు అగ్రేసరులు. వీరి వాదాన్ని ఆ కాలంలో సుప్రసిద్ధ పండితులైనవేదం వెంకటరాయశాస్త్రి కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి, వావిలికొలను సుబ్బారావు (వాసుదాసు) మొదలైనవారలు బలపరిచారు. జయంతివారు 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు' (Telugu Academy)ని స్థాపించారు. పైన చెప్పిన ప్రముఖ పండితులందరు అందులో సభ్యులై తమ ఆశయ ప్రచారానికై 'ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక'ని స్థాపించారు. వాసుదాసుగారు 'ఆధునిక వచన రచనా విమర్శనం' అనే పుస్తకంలో వ్యాకరణరీత్యా వ్యావహారికం గ్రామ్యమే అని తీర్మానించారు.

జయంతివారి సిద్ధాంతంలోని ముఖ్య విమర్శలు :-

) వ్యావహారిక రచనల్లో సులభత, సారూప్యతలేవు.

౨) మాండలిక మయమైన నిస్సార కవితతో నిండిన గ్రామ్యగ్రంథాలు పాఠ్యగ్రందాలుగా పనికిరావు.

౩) అన్యభాషా పదాలతో నిండిన వ్యావహారికం సుబోధకం కాదు. పరిమిత పదజాలం గ్రందరచనకు చాలదు.

4.) వ్యాకరణ విరుద్ధమైన వ్యావహారిక పదాలు నిషిద్ధాలు.

౫) విసంధి పాటించటం, అర్ధానుస్వార, శకటరేఫలు వదిలివేయటం అన్యదేశ్యాలు వాడటం తప్పు.

౬) నన్నయ నుండి కందుకూరి వరకు ఏకసారూప్యత కల్గిన గ్రాంథిక భాషకు మార్పులేదు.

౭) పూర్వకవులెల్లరు ఒకే భాషారీతిలో వ్రాశారు కాబట్టి గ్రాంథికంలో ఏకరూపత (Uniformity) దానికి ప్రామాణికత ఉన్నాయి.

౮) ఆధునికాంధ్ర భాషకు ప్రత్యేక స్థానం లేదు.

౯) భవిష్యత్తులో దుర్గ్రాహ్యం, దుర్బోధ్యం అయ్యే ఈ వ్యావహారికానికి వ్యాకరణ సూత్రాలులేవు గావున అది పాఠ్యగ్రంథ రచనకు పనికిరాదు.

౧౦) అందువల్ల గ్రాంథిక భాష మాత్రమే ప్రామాణికమైంది. గ్రంథరచనోపయోగ్యమైంది.

ఈ ఉభయ వాదాలపైన అనేక చర్చలు, గోష్ఠులు జరిగాయి. మదరాసులో, కాకినాడలో పుంఖాను పుంఖంగా సాగిన సమావేశ ఫలితాల్ని దృష్టిలో పెట్టుకొని

'ప్రభుత్వ యాజమాన్యం విద్యాసంస్థల్లో విద్యార్థులు వ్యావహారిక భాషలో పరీక్షలు వ్రాయవచ్చు' అని అంగీకారానికి వచ్చింది. పత్రికలు, రేడియోలు వ్యావహారిక భాషలో కార్యక్రమాలు, రచనలు కొనసాగించటం మొదలుపెట్టాయి. ప్రతిభావంతులైన రచయితలు నవలలు, నాటికలు, వ్యాసాలు, వివర్శనలు చక్కని వ్యావహారిక భాషలో రచించి జీవద్భాషకు స్ఫూర్తిని తెచ్చారు.

4 **ప్రామాణిక వ్యావహారిక భాషల సంబంధం:**

ప్రామాణిక భాషలో గ్రంథరచన జరిగేటప్పుడు ఉన్నత భావాలు, విశాల పదసంచయాలు, కొత్తకొత్త వాక్యరచనలు బయలు వెడలుతాయి. కాని వాడుక భాషలో .నిది సాధ్యపడక పోవచ్చు. అది ముఖ్యంగా దైనిక వ్యవహారానికి ఉపయోగపడుతూ, పండిత పామర జనులందరు వాడుకోవటానికి పనికివస్తుంది. అయితే ఒక సత్యాన్ని విస్మరించడానికి వీల్లేదు. కాలం మార్పు చెందేకొద్దీ, దైనిక వ్యవహారంలోని పదాలు గ్రాంథిక భాషలోనికి, గ్రాంథిక వ్యవహారం వాడుక భాషలోనికి అనివార్యంగా చొచ్చుకొని వస్తాయి. ఈ మార్పుని ఎవ్వరు ఆపజాలరు. ఈ మార్పు క్షీరనీరన్యాయంగా పరిణతి చెందు తుంది. ప్రామాణిక భాష ఎప్పడూ మార్పుకు గురవుతూనే ఉంటుంది. నన్నయనాటి తెలుగు అనంతర యుగాల్లో ఎలాంటి మార్పులు పొందిందో భాషాశాస్త్రవేత్తలు వివరించే ఉన్నారు. సహజంగా లోకంలో మంచివాడుక గ్రాంథికంగా పరివర్తన చెందుతూ వుంటుంది. నన్నయనాటి తెలుగు ప్రయత్న పూర్వకంగానో, అప్రయత్నంగానో నన్నెచోడుని నాటికే కొంతమార్పును చవిచూసింది. నన్నయ వాడని పదాల్ని 'వీండు, వాండు' మొదలైన పదాల్ని నన్నెచోడుడు వాడాడు. ఇదొక భాషావిషయక ప్రవాహం. దీన్ని ఎవ్వరూ ఆపలేరు. అందుకే శబ్దచింతామణిలో నన్నయ 'సిద్ధిర్లోకాద్భుశ్యా' అన్నాడు. అంటే భాషలోని సిద్ధరూపాల్ని లోకం నుండి గ్రహించాలి అని అర్థం.

భాష గ్రంథగతమైన తర్వాత దానికి లక్షణం ఏర్పడుతుంది. లాక్షణికులు భాషకు కొన్ని ప్రమాణాల్ని ఏర్పరుస్తారు. ఈ సందర్భంలో గమనించవలసిన ముఖ్య విషయమొక్కటుంది. గ్రంథస్థమైన కవిప్రయోగాలన్నింటిని నిర్దుష్టమైనవని లాక్షణికులు చెప్పరు. తమకు నచ్చని ప్రయోగాలు ఎంత గొప్ప కవులు ప్రయోగించినా వ్యాకర్తలు అప్రశస్తాలని వాటిని తిరస్కరిస్తారు. క్త్వార్థకేకార సంధుల్ని, అల్పదండువంటి మిశ్రసమాసాల్ని 'రెండో, మూడో, చేతురు, కోతురు, ఇరవై, వాండ్లు, వీండ్లు, చేదాం, పోదాం, చేసేటి, పోయేటి'

వంటి పదప్రయోగాల్ని ఆంధ్రవైయాకరణులు పరిహరించారు. అయినా ఇలాంటి పదాల్ని గిడుగు రామమూర్తి పంతులుగారు తమ 'బాలకవిశరణ్యం'లో విపులంగా ఎత్తి చూపించారు. అలాంటి పదాలన్నింటిని ప్రయోగానికి తగినవని అనుమతించి వ్యావహారిక భాషని పరిపుష్టం చేయాలన్నదే గిడుగువారి ఆశయం.

'గ్రాంథికభాష చచ్చినభాష' అని వ్యావహారిక భాషావాదుల అభిప్రాయం. ఇక్కడ 'చచ్చినభాష' అంటె వ్యవహార దూరమైన భాషయని అర్థం. 'చచ్చినభాష' అనే మాట ఆంగ్లంలోని (Dead Launguage) అనే పదానికి తర్జుమా పదం. ఈ మాట సంస్కృతం, ల్యాటిన్ మొదలైన భాషలకి అచ్చంగా వర్తిస్తుంది. కాని జీవద్భాషయైన ఆంధ్రభాషకు అది వర్తించదు. ఆంధ్రగ్రాంథికానికి ఇంకా అలాంటి గతి పట్టలేదు. మనపండితులు వ్రాస్తున్న భాష నేటికి అందరికి అర్థమవుతూనే వుంది. తులనాత్మక పరిశీలన చేసినట్లయితే వ్యవహారంలో ప్రామాణిక భాషకు అవ్యాప్తి దోషమూ, వ్యావహారిక భాషకు అతివ్యాప్తి దోషమూ ఉన్నాయి. అంతేకాని ఈ రెండింటిలో దేన్ని కూడ 'చచ్చినభాష' అనరాదు. ఇందుకొక వాక్యాన్ని గ్రహించి సమన్వయిద్దాం.

ఉదా :- అతడింటినుండివచ్చినాడు – (గ్రాంథికం) ప్రామాణికం

అతనింట్లోంచి వచ్చాడు

లేదా

ఆయన ఇంటినుండొచ్చాడు – వ్యావహారికం

పై రూపాలు రెండూ అందరికి సులభ గ్రాహ్యాలె. ఈ సందర్భంలో పై రెండు రూపాల్ని గూర్చి చర్చించేటప్పుడు 'తప్పొప్పుల' ప్రస్తావన చేయరాదు.

రెండవ అంశం :- గ్రంథస్థమైన ప్రామాణిక గ్రాంథిక పదాల్ని అర్థం చేసుకోవటానికి, అందలి భావాల్ని గ్రహించటానికి పఠితకుగాని, శ్రోతకుగాని 'అధికారం' కావాలి. భాషాజ్ఞానంలేని పసుల కాపరికి ప్రామాణిక భాషాగ్రంథం ఎలా అర్థంకాదో, అలాగే వ్యావహారిక భాషాగ్రంథం కూడ అర్థంకాదు. పదప్రయోగజ్ఞత చాల అవసరమని దీనివల్ల విదితమౌతుంది. వ్యావహారికమైనా, గ్రాంథికమైనా దాన్ని రచనకు ఉపయోగించినప్పుడు గ్రహణ సామర్థ్యంగలవారికే అది సాధ్యమౌతుందిగాని ఎల్లరకు కాదు.

మూడవ అంశం :- 'గ్రాంథికభాష అర్థంగాదు. వ్యావహారికం అర్థమౌతుంది' అనే అభిప్రాయం కూడ వాస్తవంగాదు. నన్నయాదులు వాడిన కొన్ని ప్రయోగాలు 'వచ్చినవాడనైతినేని', 'దయ్యము' వంటివి పాతపదాలు. వీటిని నేడెవ్వరు

గ్రాంథిక భాషలో వాడటం లేదు. బహుదీర్ఘ సంస్కృత సమాసాలతో కూడిన గ్రాంథికభాష సులభంగా అర్థంకాదనటం వాస్తవమేగాని, దేశి పదజాలంతో సులలితంగా సాగే భాష అర్థంకాదనటం సంభావ్యంగాదు.

ఒక ఉదాహరణ :-

1) వ్యావహారికం :- వీరి రాజాస్థాన కథావళి ఆంధ్రయువకులలో దేశభక్తిని, స్వార్థత్యాగాన్ని ధైర్యసాహసాల్ని పురికొల్పింది.

2) గ్రాంథికం :- వీరి రాజాస్థాన కథావళి ఆంధ్రయువకులలో దేశభక్తిని, స్వార్థత్యాగమును, ధైర్యసాహములను పురికొల్పినది.

| తేడ :- | గ్రాంథికం | - | వ్యావహారికం |
|---|---|---|---|
| | కొల్పినది | - | కొల్పింది |
| | ధైర్యసాహసములను | - | ధైర్యసాహసాల్ని |
| | స్వార్థత్యాగమును | - | స్వార్థత్యాగాన్ని |
| | ఆంధ్రయువకులలో | - | ఆంధ్రయువకుల్లో |

పై వివరణనిబట్టి గ్రాంథిక రూపాల్లో వచ్చిన కొద్దిపాటి మార్పువల్లనే వ్యావహారిక రూపాలు ఏర్పడ్డాయని స్పష్టమవుతుంది. ఈ ఉభయ రూపాలు అందరికి సులభంగా అర్థమయ్యేవే.

5. పాఠ్యపుస్తకాలశైలి:- 1965లో పాఠ్యపుస్తకాలశైలి విషయంలో వచ్చిన వాదోపవాదాల్ని గూర్చి ఇక్కడ కొంచెం ముచ్చటించవలసి వుంది. ఈకాలం వరకు పాఠ్యగ్రంథాలన్నీ అర్థగ్రాంథికమో, సరళ గ్రాంథికమో అలా ఏదో ఒకరీతితో సాగింది. ఆంధ్రప్రదేశ్ అవతరణవల్ల తెలుగుని నేర్చుకోవలసినవారు రెండు తెగలవారయ్యారు. తెలుగు మాతృభాషగా కలవారొక వర్గమైతే, ఆంధ్రేతరులొకవర్గం. ఆంధ్రేతరులు తెలుగు నేర్చుకోవడానికి సులభంగా ఉండాలి గాబట్టి, వాళ్ళకోసం వ్రాసిన పాఠ్యగ్రంథాల్లో వ్యావహారికమే ఉండాలని భద్రిరాజు కృష్ణమూర్తిగారు వాదించారు. గ్రాంథిక గ్రంథం అచ్చుకారాదని ఆక్షేపించారు. అప్పుడు ప్రభుత్వం ఏకాభిప్రాయ సాధనకై ఈ విషయంలో సంబంధమున్న పండితులందరిని తిరుపతిలో సమావేశపరచి ఆ సభకు పింగళి లక్ష్మీకాంతంగారిని అధ్యక్షుల్నిచేసింది. వాదోపవాదాల తరువాత ఆయా శైలీభేదాల్ని వివరించే సంఘాన్ని ఒకదాన్ని ఏర్పరచి, దానికి 'శైలీసంఘం' (Style Committee) అనే పేరు పెట్టి, లక్ష్మీకాంతంగారినే అధ్యక్షునిగా ఎంపిక చేశారు. ఈ సమయంలోనే తెలుగుని అధికారభాష చేస్తే ఎదురయ్యే సమస్యల్ని పరిశీలించి

సలహా ఇమ్మని ప్రభుత్వం నాటి ప్రభుత్వ కార్యదర్శి జె.పి.యల్‌గ్విన్ అధ్యక్షతన వేరొక సంఘాన్ని నియమించింది.

లక్ష్మీకాంతంగారి అధ్యక్షతన ఉన్న శైలీసంఘం ఆధునిక ప్రమాణభాష (వ్యావహారికాన్నే)నే పాఠ్యగ్రంథాల్లో వినియోగించాలని ప్రతిపాదించింది. చర్చలు, వాదోపవాదాలు ముగిసిన తర్వాత ఇంటర్ స్థాయి గ్రంథాలన్నింటిని వ్యావహారిక భాషలో వెలువరించటానికి అంగీకారం కుదిరింది. మళ్ళీ గ్రాంథిక భాషావాదులు గ్రాంథికాన్ని పునరుద్ధరించే ప్రయత్నాలు చేశారు. కాని అవి యేవి ఫలప్రదం కాలేదు. భాషాశాస్త్ర సంబంధిత చర్చలవల్ల కాకుండా కులవిద్వేష రాజకీయ వైమనస్యాల్ని ఆధారం చేసుకుని జయం సంపాదించడానికి గ్రాంథికవాదులు ప్రయత్నించటం దురదృష్టమని చెప్పక తప్పదు. కృష్ణాజిల్లా బ్రాహ్మణులు వాడే ఈ వ్యావహారిక భాషని ఎందుకామోదించాలనేది వారి వాదం.

ఈనాటి రేడియోల్లో, పత్రికల్లో, సాహితీ రచనల్లో, సినిమాల్లో అనుక్షణం వాడుకలో ఉన్న వ్యావహారికాన్ని ఏ శక్తి ఆపజాలదని స్పష్టమైంది. విశ్వవిద్యాలయాల్లోని ప్రొఫెసర్లు, అధ్యాపకులు కూడ దైనందిన వ్యవహారాలు, పిహెచ్‌డి వ్యాసాలు శిష్టవ్యావహారికంలో రూపొందించడం మొదలుపెట్టారు.

6 గ్రాంథిక వ్యావహారిక వివాదాలు - ఆధునిక ప్రామాణిక భాషాస్వరూపాన్ని స్థూలంగా చర్చించవలసి వుంది. ఈ వివాదానికి భ్రమప్రమాదాత్మక భావాలె ముఖ్యకారణాలు. కొన్ని సాంకేతిక పదాల్ని, వాటి అర్థాల్ని సరిగా అర్థం చేసుకోనందువల్ల ఏర్పడ్డ భ్రమప్రమలివి. ఉదాహరణకి 'వ్యాకరణం, గ్రామ్యం, అన్యదేశ్యాలు, ప్రామాణికత, భాషాస్థిరత్వం, ధ్వనిశాస్త్రం' మొదలైనవి. సాధ్యాసాధ్యాల్ని అంచనా వేయకపోవటం, ప్రాచీనతమీది మితిమీరిన అభిమాన గౌరవాలు, నవీనతమీది నిష్కారణ అగౌరవం, భాషాస్వరూప స్వభావ పరిజ్ఞానలోపం, మారుతున్న ప్రపంచ పరిస్థితుల్ని గమనించకపోవటం ఇందుకు దోహదం చేశాయి. ఈ విషయాల్ని కొంచెం విశాలంగా పరిశీలిస్తే, గ్రాంథిక వాదంలోని అసహజత్వాన్ని, అనుపాదేయతని గుర్తింపవచ్చు.

ఎ) వ్యాకరణం :- భాషలో అంతర్గతంగా దాగిన లక్షణాల్ని సూత్రీకరించి వ్రాసిన గ్రంథాన్ని 'వ్యాకరణ గ్రంథం' అంటారు. ఆ లక్షణాలే ఆ భాషకు వ్యాకరణమవుతుందిగాని రాసిన పుస్తకమొక్కటేగాదు. వాగ్వ్యవహారంలోని భాషకు కూడ సూత్రాలుంటాయి. వ్యాకరణం ఉంటుంది. అయితే దేశకాల

పాత్రాదుల్నిబట్టి వ్యాకరణ సూత్రాల్ని మార్పు చేసుకోవాలిగాని భాషాస్వరూపాన్ని మార్చరాదని వాదించరాదు. జీవద్భాష పరిణామ దశలో ఉంటుంది. వ్యాకరణ సూత్రాల్ని మార్చమని బిగుసుకొని కూర్చుంటే భాషలో వచ్చిన మార్పులు ఆగుతాయా? లేదు. ఈ చిన్న విషయాన్ని గుర్తించనందు వల్లనే గ్రాంథికవాదులు అసలు వ్యావహారిక భాషకు వ్యాకరణమే లేదు పొమ్మన్నారు. అందువల్ల ఆ భాష ఉపాదేయంకాదని వాదించారు. కొమర్రాజు లక్ష్మణరావుగారు వ్యాకరణమంటే సంప్రదాయ వ్యాకరణ గ్రంథమని, అలాంటిది వ్యావహారిక భాషకు లేనందువల్ల అది నిశ్చయంగా గ్రామ్యమని వాదించారు. ఈ వాదాన్ని గురజాడవారు అధిక్షేపించారు. వ్యాకరణంవల్ల భాషకొక స్థిరరూపమేర్పడుతుందని, అందువల్ల మొదట వ్యాకరణం వ్రాసి, వ్యావహారిక భాషని స్థిరీకరించమని గ్రాంథికవాదులు కోరారు. ఈ రెండు సిద్ధాంతాలు అర్థరహితమని వ్యావహారికవాదులు ఆక్షేపించి ప్రామాణిక పాశ్చాత్య విద్వాంసుల వాక్యాల్ని ఉద్ధరించి చూపారు. భాషను శాశ్వతంగా స్థిరీకరించే ప్రయత్నం పూర్వీకులు సైతం చేయలేదు. ఆయా కాలాల్లోని శిష్టవ్యావహారికాల్ని పరిగణనలోకి తీసుకొని వ్యాకరణ సూత్రాల్ని సరిదిద్దటం ఏ భాషాసాహిత్యంలోనైనా అనూచానంగా వస్తున్న సంప్రదాయం. అమంగళం, అశ్లీలం అయిన పదాలే గ్రామ్య మనిపించుకుంటాయిగాని శిష్టవ్యవహారం ఏ నాటికి గ్రామ్యంగాదని గిడుగువారు, తాతా సుబ్బరాయశాస్త్రిగారు వాదించారు. మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు 'భారత భాషకు నేటి గ్రాంథిక భాషకును భేదము' అనే వ్యాసంలో నన్నయ వాడిన పదప్రయోగాలు అనంత రకాల గ్రాంథిక భాషలో ఉన్నాయేమో బాగా ఆలోచించి మాట్లాడమని గ్రాంథికవాదుల్ని హెచ్చరించారు. 1912లో జరిగిన మద్రాసు పండిత సభలో పాల్గొన్న పండితులు మాటలో, వ్రాతలో, తెలుగులో భేదమేమిలేదు గాబట్టి ఎలాంటి సంస్కరణ అవసరంలేదన్నారు. శిష్టులు మాట్లాడే భాషని వ్రాయటానికేమి వ్యతిరేకం?

ప్రాచీన వ్యాకరణ సూత్రాలు వేదప్రమాణాలని భావించి మార్పుని వ్యతిరేకించినా కాలప్రవాహం, భాషాప్రవాహం ఆగేవికావు. వాటిని ఆపటం ఎవరి తరమూగాదు. తాతలనాటి సూత్రాల్ని వల్లిస్తూ కూర్చోవటానికన్నా 'కేవలం శాస్త్రమాశ్రిత్య నకర్తవ్యోవి నిర్ణయిః యుక్తిహీన విచారేతు ధర్మహానిః ప్రజాయతే - శాస్త్రాన్ని మాత్రమే ఆధారం చేసుకొని కర్తవ్యాన్ని నిర్ణయించరాదు. యుక్తిరహితమైన విచారణవల్ల ధర్మహాని అవుతుంది' అనే అభియుక్తిని అర్థం

చేసుకోవటం మంచిది.

తొలినాళ్ళలో గ్రాంథిక వాదులాక్షేపించినట్లు ఇప్పుడు వ్యావహారిక సాహిత్యానికి లోపం లేదు. ఆధునికయుగంలో వ్యావహారికానికంటె వేరొక మార్గాంతరమూ లేదు. పూర్వకవులే భాషాస్వరూప నిర్ణేతలనే దురభిప్రాయం చాలవరకు అంతరించిందనే చెప్పాలి.

7 పరిశుభ్రతాలోపం:-వ్యావహారిక భాషలో అన్యభాషాపదాలు, మాండలికాలు ఉన్నందువల్ల భాషాపరిశుభ్రత లోపిస్తుందని, సులభబోధ్యంగాదని, ఏకరూపత నశిస్తుందని వాదించటంలోని మంచిచెడ్డల్ని గమనించాలి.

తెలుగుభాష ఒక ప్రత్యేకభాష కాబట్టి ఇందులో చేరిన సంస్కృత ప్రాకృత పదాలు, తమిళ, కన్నడ భాషాపదాలు మనకు అన్యభాషాపదాలే. వాటిని వాడేటప్పుడులేని అభ్యంతరం, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక కారణాలవల్ల వచ్చిచేరిన ఉర్దూ, అరబి, పార్శీ పదాల్ని ఆంగ్ల పదాల్ని వాడితే ఎందుకు రావాలి? ఈ అన్యభాషాపదాల చేరిక కేవలం తెలుగులోనేగాదు ప్రపంచ భాషలన్నింట ఉంది. సంస్కృతంలోని పదాలు ఇంగ్లీషు నిఘంటువుల్లో కోకొల్లలుగా ఉన్నాయి. వీటిని పరిహరిస్తే 'వ్యవహారహాని' కల్గుతుంది. సంస్కృత ప్రాకృత పదాలకి మనవారు రూపనిష్పాదన ప్రక్రియ చేసినట్లు, ఉర్దూ మొదలైన అన్యభాషాపదాలకి చేయలేదు. ఇదొక్కటే తేడా. ఆ పని ఆధునిక వ్యాకర్తలు చేయగల్గితే మరీ మంచిది. చేయటానికి వీలుపడకపోతే, ఒకమారు భాషలో వచ్చి కలిసిపోయిన తర్వాత, వాటిని ఏరివేసే ప్రయత్నం ఎంతమాత్రం హేతుబద్ధమనిపించుకోదు. అవి తెలుగు మాటలని భావించాలి. నిరక్షరాస్యుల నిత్యవ్యవహారంలో కూడ అన్యభాషాపదాలు చొచ్చుకొని వచ్చాయి. వీటన్నింటిని కంటకప్రాయంగా భావించటం అసంగతం. వీటిని తొలగించటానికి జోనాథన్ స్విఫ్ట్ లాంటి పండితులు విఫల ప్రయత్నం చేసి సాధ్యంకాక విరమించుకున్నారు.

ఇలాంటిదే మాండలికాల విషయం కూడ - నన్నయనాటి నుండి చిన్నయసూరి దాక ప్రతి తరంలో ఎన్నెన్ని మాండలికాలు గ్రంథాల కెక్కాయో చిలుకూరి నారాయణరావుగారు, గిడుగు రామమూర్తి పంతులుగారు విస్పష్టంగా ఎత్తిచూపారు. కవులు·సంఘజీవులు కాబట్టి సమకాలీనమైన మాండలికాల్ని తమ రచనల్లో పొందుపరుస్తారు. వాటివల్ల భాష అపభ్రష్టమైందని వాదించటం అసందర్భం - అనుచితం. మాండలికాల్ని వాడటంవల్ల కవితాశిల్పానికిగాని, గౌరవానికిగాని ఏ లోపం రాదు. ఇలా షేక్స్పియర్ రచనల్లో

ఎన్నో వున్నాయి. అక్కడ ఏ లోపం జరుగలేదని 'క్రాటర్' అన్నాడు. పరప్రాంతీయులకు అర్థంకాని మాండలికాలతో ఏ రచయిత కూడ గ్రంథరచన చేయడు. ప్రపంచంలోని డాంటె, షేక్స్పియర్, బార్నెస్, వే, బర్న్స్ మొదలైన రచయితలు ఆయా మాండలికాల్లో గ్రంథాలు వ్రాశారు. అవన్నీ ప్రపంచ విఖ్యాతి గడించాయి. తొలిదశలో ఎట్లున్నా, కాలాంతరాన మాండలికాలకు ప్రామాణికత ఏర్పడి, ఆ పదాలు నిఘంటువుల్లో స్థానం సంపాదించుకుంటాయి.

గ్రాంథికవాదులు వ్యావహారిక రచనలు అర్థంకావటం లేదని ఆక్షేపించారు. ఇది కూడ చర్చనీయాంశమే. అయితే పూర్వకవుల గ్రంథాలన్నీ ఒకేవిధంగా అర్థమవటంగాని, అర్థంకాకపోవటంగాని జరుగలేదు. వ్యక్తుల అభిరుచులు, విద్యాసామర్థ్యం, రచనా పద్ధతి - ఇలాంటి వాటినిబట్టి గ్రంథాలు అర్థం కావటమో, కాకపోవటమో జరుగుతుంది. ఇదంతా చదువరి అధికారంపై ఆధారపడుతుంది. వ్యక్తినిష్ఠమైన లక్షణాన్ని ఒక వాదం మొత్తానికి ఆరోపించటం హేతుబద్ధంగాదు. వెయ్యేండ్లుగా అనుస్యూతంగా సాగుతున్న గ్రాంథిక రచనలకన్న, వ్యావహారికంలో వచ్చిన వచన రచనలు ఎంతో మెరుగనిపించుకున్నాయి. ఇవి ప్రజాస్వామ్యానికి ఎంతో అందుబాటులో ఉన్నాయి. అధ్యయనం, గ్రంథాల్ని అర్థంచేసుకోవటం ప్రయత్నసాధ్యాలేకాని వేరేమికాదు. ఒకప్పుడు తర్కవ్యాకరణ మీమాంసాది శాస్త్రాలు ఎంతో శ్రమించి నేర్చుకున్నవారుండేవారు. అంత శ్రమకు నోచుకోనివారు ఆ శాస్త్రాల్లో అవసరమైనంత మట్టుకే అధ్యయనం చేసేవారు. ఇది నిర్బంధంగాదు. అభిరుచి ఉన్నవారు చదువుతారు, లేనివారు వదిలేస్తారు.

ఫలితం :- గ్రాంథిక వ్యావహారిక భాషావాదాలవల్ల ౨౦వ శతాబ్దంలో ఆంధ్రభాషకు మేలే జరిగింది. అనేక నూతన సాహితీ ప్రక్రియలు వెలుగులోకి వచ్చాయి. అరసున్నాలు, విసర్గలు, విసంధులు, రేఫ అకార భేదాలు అంతరించిపోయి రచనా సౌలభ్యమేర్పడింది. నూటికి తొంభైవంది ఏ విషయాన్నయినా ఆధునిక శిష్టవ్యావహారికంలోనే వ్రాస్తున్నారు. మొదట కొంత అస్తవ్యస్త రచనలు సాగినా, ౧౯౨౫ నుంచి వ్యావహారికంలో సరళ సుందర రచనలనేకం వచ్చాయి. చక్కని విమర్శనా గ్రంథాలు, నవలలు, నాటికలు, నాటకాలు, సంభాషణలు ఆవిర్భవించి భాష పరిపుష్టమైంది.

అయితే ఆధునిక భాషా స్వరూపమేమిటి? అనే ప్రశ్న ఉదయిస్తుంది. కృష్ణా, గోదావరి నదులపై ఆనకట్టలు కట్టగానే, ఆ ప్రాంతమంతా వ్యవసాయం పెరిగి

సస్యశ్యామలమై విలసిల్లింది. సాగరతీరంలో ఆర్థిక స్థితులు మెరుగుపడ్డాయి. జీవనం సుఖోపేతమైంది. కళాశాలలు, పాఠశాలలు విరివిగా ఏర్పడ్డాయి. ఆధునిక ప్రయాణ సౌకర్యాలు, రేడియో వంటి వార్తాసౌకర్యాలు, పత్రికావిర్భావాలు, ఆంధ్ర విశ్వవిద్యాలయావతరణ వంటివి చకచక సాగి చదువు అభివృద్ధి చెందింది. కందుకూరి వీరేశలింగంగారి సాంఘిక సంస్కారోద్యమం, భాషోద్యమం కలగలిపి ముందుకు సాగాయి గిడుగువారి ప్రచార ధోరణి, గురజాడవారి రచనాధోరణి, వేదంవారి పాత్రోచిత భాషావైఖరి, రచయితల, కవుల అభ్యుదయ రచనాశైలి అన్నీకూడ వ్యావహారికోద్యమానికి తోడ్పడ్డాయి. టాగోరు, .శరత్ వంటి వంగదేశ కవిరచయితల గ్రంథాలు తెలుగులో వ్యావహారికంలోనే తర్జుమా చేయబడ్డాయి. ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక వికాసాలకు మొదట బీజావాపం జరిగిన తీరాంధ్రంలోనే భాషాభ్యుదయవాదం కూడ తలెత్తింది. మొదటితరం రాజకీయ నాయకుల్లో, సంఘసేవకుల్లో, రచయితల్లో అధికశాతం తీరాంధ్రులే అయ్యారు. అందువల్ల ఆ ప్రాంతంలో ప్రవర్ధమానమైన ప్రాంతీయ భాషాభేదమే ఆధునిక ప్రామాణిక భాషగా పరిణమించింది. ఇదే నేటి ప్రామాణికమైన శిష్టవ్యావహారికభాష. అన్నిప్రాంతాల్లో ఇదే ఆచరణలో ఉంది. గిడుగువారి పుణ్యమా అని తెలుగు సాహిత్యానికి నూతనోత్తేజం, భాషకు నూతన వికాసం కల్గాయి. ఇదే ఇప్పుడు అన్నింటికి ఉపయోగపడుతున్నది.



# 19. తెలుగు మాండలికాలు - ప్రమాణ భాషకు వాటి ఆవశ్యకత

ఒక దేశాన్ని ప్రాదేశిక మండలాలుగా విభజించినట్లే, జనవ్యవహారంలో వచ్చిన మార్పుల ప్రాతిపదికగా 'భాషామండలాల' విభజన.చేయటం కూడ జరిగింది. జీవద్భాషకు మార్పు సహజం. అనివార్యంకూడ. ఈ మార్పువల్ల భాషలో బహురూపత, వైవిధ్యం (Variation) ఏర్పడుతాయి. ఇది మూడురకాలు

1) చారిత్రకం 2) ప్రాంతీయం 3) సాంఘికం.

1) చారిత్రకం :- ఒక కాలంలో వున్న రూపాలకు కాలాంతరంలో ఏర్పడ్డ తుల్యరూపాలకు మధ్య తేడాలుంటాయి. ఇది చారిత్రకమైన మార్పుని సూచిస్తుంది.

ఉదా :- తెలుగులో 'వాడు' శబ్దం.

దీని పూర్వరూపాలు :- వాడు/ వాణ్డు/ వాన్టు/ అవన్టు.

ఈ పై మార్పునిబట్టి ఒక భాష పూర్వభాష నుండి ఎలా మారుతూ వచ్చిందో గుర్తింపవచ్చు.

2) ప్రాంతీయం :- ఒక కాలంలో ఒక ప్రాంతంలో వున్న వాడుక భాషకు మరొక ప్రాంతంలోని వాడుక భాషకు మధ్య సమాన శబ్దాల్లోనూ, వ్యాకరణ భాషల్లోనూ తేడాలుండవచ్చు. ఇది ప్రాంతీయ భేదాన్ని తెల్పుతుంది.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | వచ్చినాడు | - | రాయలసీమ |
| | వచ్చిండు | - | నెల్లూరు, ప్రకాశం |
| | వచ్చాడు | - | కృష్ణా, గుంటూరు |
| | వచ్చేశాడు | - | ఉభయ గోదావరులు |

ఇలాంటివన్నీ ప్రాంతీయ భేదాలు.

3) సాంఘికం :- సాంఘిక వ్యవస్థలోని మార్పులు ఆర్థిక సాంఘిక పరమై వుంటూ, వ్యవహరించేవారి మాటల్లో ప్రతిఫలిస్తూ వుంటాయి. ఈ తేడాల్ని వర్గమాండలికాలు అంటారు.

ఉదా :- చాప/ సాప, లేదు/ నేదు, అట్లా/ గట్లా వగైరాలు.

పైన పేర్కొన్నవేగాక ఇతర కారణాలవల్ల అనేకమైన అవాంతర భేదాలుండవచ్చు, లిఖిత భాష/ వాడుకు భాష, ఉపన్యాస భాష/ సంభాషణ భాష, పిల్లల భాష/ వృద్ధులభాష, ఛాందసులభాష/ ఆధునికులభాష అని యిలా అవస్థల్నిబట్టి ఏర్పడ్డ

యీ అవాంతర భేదాలు గుర్తించడానికి వీలుగా వుంటాయి.

౨) నేటి తెలుగులో భాషామండలాలు :- వృత్తిపదకోశ పరిశోధన ఆధారంగా తెలుగునేలని నాల్గు భాషామండలాలుగా విభజించారు. అవి

1) పూర్వమండలం - కళింగ, శ్రీకాకుళం, విశాఖ జిల్లాలు.

2) ధక్షిణ మండలం - రాయలసీమ, నెల్లూరు, ప్రకాశం జిల్లాలు.

3) ఉత్తర మండలం - తెలంగాణ జిల్లాలు.

4) మధ్య మండలం - ఉత్తర కోస్తా జిల్లాలు.

ఈ దిగువ సూచించిన వృత్తిపదాల్లో ఆయా మండలాలకే పరిమితమ్మైన విలక్షణ శబ్దాలు క్రీగీతల ద్వార తెలుపబడ్డాయి.

| | 2 | 3 | 4 |
|---|---|---|---|
| మోట | కపిల | మోట | మోట |
| పేడ | పేడ | పెండ | పేడ |
| నాగలి | నాగేలి/ మడక | నాగలి | నాగలి |
| గునపం | గడ్డపార/ గడారు | గడ్డపార | గడ్డపలుగు/ గడ్డపార |

పై పట్టికనిబట్టి రెండు మండలాలు కలిసేచోట రెండురకాల వాడుకలు కన్పిస్తాయని విశదమవుతుంది. ఈ మాండలిక విభజన దేశీయ వృత్తుల్లో జానపదులువాడే భాష ఆధారంగా ఏర్పడింది. ఇలాంటి వృత్తుల్ని ఆశ్రయించినవారు ఒక ప్రాంతం నుంచి వేరొక ప్రాంతానికి అంతగా వలసపోరు. అందువల్ల వీరి వాడుకల్లో పెద్దభేదం కన్పించదు. వృత్తిరీత్యాగాని, వాణిజ్య వ్యాపారరీత్యాగాని ఒక మండలంవారు వేరొక మండలానికి తరలిపోతే, అప్పడు భాషలో మాండలిక భేదం ఏర్పడుతుంది. ఒక మండలంలోని పదాలు, మాట, తీరు ఇతర మండలాలకి ప్రాకటానికి 'వలస' ఒక ముఖ్య కారణం. 'వలస' లేనప్పడు ఒక మండలంలోని నూతన పదాలు, ధ్వని పరిణామం ఆ ప్రాంతంలోనే వ్యాపించి, మండల సరిహద్దు తగిలినచోట ఆగిపోతాయి.

అన్యరాష్ట్రాల పొలిమేరల్లో భాష విలక్షణంగా వుంటుంది. ఉభయ భాషల సాంకర్యం అక్కడ తప్పనిసరి. కళింగ ప్రభావంవల్ల శ్రీకాకుళం, విజయనగర ప్రాంతాల్లో కొన్నిపదాలు, పలుకుబళ్ళు ఉదా :- పూజు = కాడి, ఉండ = చక్రం వంటివి చాల విలక్షణంగా వుంటాయి. ఉర్దూ ప్రభావంవల్ల హైదరాబాద్ చుట్టుపక్కల కొన్ని తెలుగు మాటలకు బదులు ఉర్దూ మాటలు విన్పిస్తాయి. అంతేగాక ఈ ప్రాంతంలోని కొన్నితెలుగు మాటలు చాల విలక్షణంగా కన్పిస్తాయి.

ఉదా :- దుబ్బనేల (సన్నటి ఇసుకనేల)
పూంటికూర (గోంగూర)
పెండ (పేడ)

రాజకీయ అస్తిత్వమే కృష్ణా, గోదావరి మధ్యదేశం ప్రత్యేక భాషామండలంగా కన్పించక పోవటానికి కారణం. అంటే ప్రతిమాట వాడుకలోను, మిగిలిన మూడు మండలాల్లో ఏదో ఒక దానితో కలపటమే మధ్యాంధ్ర మండల వ్యవహారంలోని విలక్షణత. దీన్ని మిశ్రవ్యవహార మండలమని పరిశోధకులన్నారు. మాండలిక పదపట్టికల్ని కూడ తయారు చేశారు.

ఈ మాండలికాలవల్ల ప్రతిపదానికున్న పుట్టుపూర్వోత్తరాల్ని గ్రహించవచ్చు. ప్రజలు ఏ ప్రాంతం నుండి యే ప్రాంతానికి వలస పోయారో తెలుసుకోవచ్చు. జాతీయ పదాలెవ్వి? అన్యదేశ్య పదాలెవ్వి? అని విభజించవచ్చు. ఒక భాషయొక్క జన్యజనకతా నిరూపణకు సైతం యీమాండలిక పరిశోధన తోడ్పడుతుంది. ఉదా :- తెలుగులో నారు/ నేరు అనే పదాలకు పూర్వద్రావిడంలోని 'ఞ ఞు' పూర్వరూపమని కనుగొన్నారు. మాండలిక పదపరిశోధనవల్ల ప్రాచీన కవిరచిత గ్రంథాల్లో వచ్చిన మాటలకు స్పష్టార్థ నిరూపణ సాధ్యమౌతుంది. వారు వాడిన కొన్ని పదాల్నిబట్టి వారేప్రాంతంవారో నిర్ధారించవచ్చు. ఉదా :- గునపం, గడ్డపార – ఈ రెండింటిని పింగళి సూరన కళాపూర్ణోదయంలో వాడినాడు. 'గునపం' అనే పదం గోదావరి ప్రాంతాల్లోను, 'గడ్డపార' అనే పదం రాయలసీమ ప్రాంతాల్లోను వాడుకలో ఉన్నాయి. దీన్నిబట్టి సూరన గోదావరి ప్రాంతం నుండి ప్రకాశంజిల్లా ప్రాంతాలకు తరలివచ్చాడని తాను కళాపూర్ణోదయ కృతిని నంద్యాల కృష్ణమరాజుకు అంకితమివ్వటాన్నిబట్టి స్పష్టమౌతుంది.

'గియర్‌సన్' పండితుని పరిశీలననిబట్టి తెలుగుదేశం నుండి వలసబోయిన ప్రాంతాల్లో ప్రజల వాడుక 5 రకాలుగా వున్నట్లు తేలింది. వడరి, కామాటి, కోంటావు, దాసరి, బేరాడి – ఇవి ఆయా వృత్తులవారు అన్యరాష్ట్రాల్లో వృత్తిరీత్యా స్థిరపడి తమ పూర్వీకులు తెలుగు భాషని అపభ్రష్ట రూపంలో వాడుతూ వచ్చారని పరిశీలనలో తేలింది. ఇలాంటివన్నీ మాండలికాల క్రిందికే వస్తాయి. అయితే, ఈ మాండలికాలు కొంతకాలానికి మరుగున పడవచ్చు లేదా స్థానిక భాషలతో కలిసిపోయి అంతరించనూ వచ్చు.

జనవ్యవహారంలోని ఒకేభాష, పై నిరూపించిన అనేక కారణాలవల్ల విభిన్న మాండలికాలుగా మార్పుచెందే సందర్భంలో దేన్ని ప్రమాణ భాషగా గ్రహించాలి?

అనే మీమాంస తప్పక ఏర్పడుతుంది. ఈ మాండలిక భేదాలన్నీ వ్యావహారిక భాషపైననే ప్రభావాన్నిచూపుతాయి. గ్రంథస్థమైన ప్రామాణిక కావ్యభాషలపైన మాండలిక ప్రభావమంతగా నుండదు. వ్యావహారిక భాషలో శిష్టుల ఉచ్చారణకు, జానపదుల ఉచ్చారణకు తేడా ఉంటుంది.

| | | |
|---|---|---|
| శిష్టోచ్చారణ | - | జానపదోచ్చారణ |
| ఒత్తులుంటాయి | | ఒత్తులుండవు |
| ధర్మం | - | దర్మం |
| హకారం నిలుస్తుంది | | హకారం నిలువదు |
| హరివిల్లు | - | అరిల్లు |
| పదాది వకారం నిలుస్తుంది | | వ కారం నిలువదు |
| వీథి, వెండి, వేడి | - | ఈది, ఎండి, యేడి |

ఇట్లే అనేక ధ్వనుల్ని ఉచ్చరించుటలో శిష్టశిష్టేతరుల మధ్య తేడాలుంటాయి. జానపదులు చక్కగా విద్యావంతులైనపుడు శిష్టోచ్చారణని అనుకరిస్తారు. అయితే ఈ పరిణామానికి చాలకాలం పడుతుంది. తెలుగు భాషలోని పైన నిరూపించిన చతుర్విధ భాషా మండలాల్లో పెక్కు విలక్షణాలున్నాయి. ఈ విలక్షణమైన రూపాలన్నింటిని రచనలో పొందుపరచినట్లయితే 'ఏకరూపత' లేకుండ పోతుంది.

కాబట్టి ఆధునిక వచన రచనలోనూ, సినిమా, రేడియో, టివి మొదలైన జనవ్యవహార సాధనాల్లోను వాడే తెలుగులో రచయితలు చాలవరకు ఏకరూపతని సాధించక తప్పలేదు. గడచిన 30, 40 యేండ్ల నుంచి గ్రాంథిక వ్యావహారిక భాషావాదాలవల్ల రచనలన్నీ 'మధ్య మండల వ్యావహారిక భాష' లో సాగుతున్నాయి. పత్రికా స్థాపన, వాదోపవాదాల చర్చ, ఆర్థిక, సాంఘిక, రాజకీయ చైతన్యం ప్రాతిపదికలుగా కృష్ణా, గోదావరి ప్రాంతాలు అత్యున్నత దశలో నుండటంవల్ల 'మధ్య మండల తెలుగు వ్యావహారిక భాష' యే ప్రమాణ భాషగా రాణించింది. అదే వ్యాపించింది కూడ.

ఇక్కడ ప్రమాణ భాషకు అవశ్యకత యేమిటి? అనే ప్రశ్న ఉదయిస్తుంది. పరిశోధకులు ఈ క్రింది లక్షణాల్ని చెప్పారు.

1) ప్రమాణభాష ఎక్కువమందికి సమ్మతంగా ఉంటుంది.

2) విద్యాబోధన ప్రమాణ భాషలో జరుగుతుంది. అది విద్యావంతుని లక్షణానికి గుర్తు.

3) మాండలికాల వ్యాప్తి తగ్గి, ఉపన్యాస పత్రికా రేడియో వ్యాసంగాలకు ప్రమాణభాష శరణ్యమౌతుంది.

4) ఇది వైజ్ఞానిక ఐకమత్యానికి శరణ్యమౌతుంది.

5) విద్యావంతుల వాడుక ఆధారంగా ప్రామాణికభాష పరిమితమైన స్థాయిలో మాండలికాల్ని తనలో కలుపుకొంటుంది.

6) కొన్ని భాషల్లో కావ్యభాషే ప్రమాణ భాషగా వ్యవహర్తలు గుర్తిస్తారు. అప్పుడు మాండలికాల ప్రభావం ప్రమాణ భాషపై పడదు.

ఉదా :- తమిళం, అరబిక్ భాషలు.



# 20. అర్థవిపరిణామం

భాషాపరిణామంలో ధ్వని మార్పుకు సంబంధించిన ధ్వని సూత్రాల్ని ప్రతిపాదించినట్లే, భాషాశాస్త్రజ్ఞులు అర్థవిపరిణామాలకు సంబంధించిన సూత్రాల్ని నిర్ణయించలేక పోయారు. భాషలో సాధారణంగా జరిగే అర్థపరిణామ విధానాల్ని గుర్తించడం సాధ్యమౌతుందిగాని, అర్థపరిణామ కారణాతల్ని మాత్రం నిర్ణయించడానికి సాధ్యపడదు. ఈ శతాబ్దారంభంలో ఫ్రెంచిభాషా శాస్త్రజ్ఞుడు Breal (1900) భాషాపరంగా జరిగే అర్థపరిణామాన్ని కొన్నిరకాలుగా విభజించి ప్రకటించాడు. అతని వర్గీకరణ విధానాన్ని తెలుగుభాషా శాస్త్రజ్ఞులు తెలుగుకి అన్వయించి కొన్ని విధానాల్ని ప్రతిపాదించటం జరిగింది. అలాంటి వానిలోనివి కొన్ని :-

1) అర్థవ్యాకోచం :- Extention of meaning or generation of meaning ఒకకాలంలో పరిమితార్థాన్ని ఇచ్చే ఒక పదం, అర్థవిస్తృతిని పొంది జాతి వాచకమైతే ఆ పదంలో కలిగే పరిణామాన్ని 'అర్థవ్యాకోచం' అంటారు.

ఉదా :- చెంబు - 'చెమ్ > కెమ్' అనేది మూలధాతువు.

దీనికి 'ఎరుపు' అని అర్థం. ఎర్రని వస్తువు లేదా రాగితో చేయబడిన చిన్న పాత్రని 'చెంబు' అనటం జరిగింది. అనంతరకాలంలో అర్థవ్యాకోచం కారణంగా ఏ లోహంతో చేసిన పాత్రనైనా 'చెంబు' అనడం ఆనవాయితి అయింది. వెండి చెంబు, కంచు చెంబు, ఇత్తడి చెంబు - ఆధునిక యుగంలో లోహంతోనేగాక ప్లాస్టిక్‌తో తయారైన ఆకారాన్ని కూడ 'చెంబు' అనటం కద్దు.

అష్టకష్టాలు :- ఒకప్పుడు ఎనిమిది రకాలైన కష్టాల్ని సూచించడానికి ఈ పదం వాడుకలో ఉండేది. 1) దేశాంతరగమనం 2) భార్యావియోగం 3) ఆపత్కాల బంధుదర్శనం 4) ఉచ్ఛిష్ట భోజనం 5) శత్రుస్నేహం 6) పరాన్న ప్రతీక్షణం 7) అప్రతిష్ఠ 8) దారిద్ర్యం - నేటి వ్యవహారంలో ఈ సంఖ్యని మించిన కష్టాల్ని ఈ పదం సూచిస్తుంది - బోలెడు కష్టాలు.

అవధాని :- అవదానం చేసే వ్యక్తికి 'అవధాని' అని పేరు. ఇప్పుడిది కులగోత్రనామ సూచకంగా అర్థవిస్తృతిని పొందింది. ఇలాంటిదే సోమయాజి, ఉపద్రష్ట వంటి పదాల్లోనూ ఏర్పడ్డ అర్థవ్యాకోచం.

మహారాజు :- 'రాజులకు రాజు' మహారాజని ఒకప్పటి అర్థం. కాని వ్యవహారంలో ఈనాడు ధనికుల్ని సూచించే అర్థంలో ఇది అర్థవ్యాకోచాన్ని పొందింది. ఉత్తరాల్లో ఆరంభంలో కొందరు 'మహారాజశ్రీ' అని వాడుతుంటారు.

2.అర్థసంకోచం:- (Restriction of meaning or specialisation) ఒకప్పుడు విస్తృతార్థముండి, కాలాంతరంలో పరిమితార్థమేర్పడితే జరిగే పరిణామానికి అర్థసంకోచమని పేరు.

ఉదా :- చీర.

మొదట ఈ పదానికి స్త్రీపురుషులెల్లరు ధరించే వస్త్రమని అర్థముండేది. తిక్కన కాలంలో ఈ అర్థమే ఉన్నది.

''జనపాలక నందనుండు జయలక్ష్మిం జేకొనునటి

చీరలు దెచ్చుట పనియే'' (విరాట - -

ఈనాడు ఈ పదానికి స్త్రీలు మాత్రమే ధరించే వస్త్రమనే అర్థపరిమితి ఏర్పడింది. 'కోక' అనే పదం కూడ ఇలాంటిదే.

శ్రీనాథుడు 'కుళ్ళాయుంచితి కోక చుట్టితి' అన్నాడు.

వాడు - అది :- 'వాడు' పురుష వాచకంగాను, 'అది' స్త్రీవాచక సర్వనామంగాను ఉండేది. కాని కాలాంతరంలో ఇవి గౌరవహీన వాచకాలుగా అర్థసంకోచాన్ని పొందాయి.

పెద్ద :- ఈ మాటకి నన్నయ ప్రయోగాల్లో వివిధార్థాలున్నాయి. కాని ఈనాడు ఈ పదం జ్యేష్ఠార్థాన్ని మాత్రమే సూచిస్తుంది.

ఆరాధ్యుడు :- ఒకప్పుడు 'కొనియాడదగిన వ్యక్తి' అనే అర్థముండేది. ఈనాడు ఈ పదం శైవుల్లో ఒక తెగని సూచించే పరిమితార్థం తెలుగులో ఏర్పడింది.

'సాహెబ్' - 'చెలికాడు' అని అసలైన అర్థం. కాని నేడు ఈ పదానికి 'ముస్లిం' అనే అర్థసంకోచం ఏర్పడింది.

పత్రం :- ఒకప్పుడు 'ఆకు' అనే అర్థముండేది. అర్థసంకోచంవల్ల తాటియాకు, కాగితం, ఋణపత్రం అనే అర్థాలు కల్గాయి.

3. అర్థగౌరవం :- (Elevation of meaning for amethoration) ఒకకాలంలో నిందార్థంలో లేదా సాధారణార్థంలో వాడబడుతున్న పదాలు తర్వాతికాలంలో విశిష్టార్థ బోధకాలైతే ఆ పదాలకి 'అర్థగౌరవం' లేదా 'అర్థోత్కర్ష' గల్గిందని గుర్తిస్తాము.

ఉదా :- సభికులు :- 'జూదరులు' అని ఈ పదానికిగల మౌలికార్థం.

తర్వాత రాజసభలోనివారికి, ఏదేనొక సమావేశంలో పాల్గొన్న సభ్యులకి పర్యాయపదంగా మారిపోయి విశిష్టార్థాన్నిచ్చింది.

ముహూర్తం :- క్షణకాలం, అల్పకాలమని దీని అర్థం. శుభకార్యాలకు నిర్ణీతమైన

పవిత్రకాలమని దీనికేర్పడిన అర్థగౌరవం.

4 **అర్థావకర్ష** :- (Degradation of meaning or Pejoration) రూఢిలో మౌలికార్థానికి నష్టం కలిగి పరిహాసార్థంలోగాని, నిందార్థంలోగాని, నిమ్నార్థంలోగాని జరిగే అర్థ విపరిణామానికి 'అర్థాపకర్ష' అని పేరు.

ఉదా :-

ఛాందసుడు :- దీనికి వేదవేత్త అని మౌలికార్థం ఇప్పుడు తెలుగులో లోకజ్ఞానం లేనివాడనే అర్థం రూఢమైంది.

సన్యాసి :- ఐహిక బంధాల్ని త్యజించిన మోక్షకామి అని ఒకప్పటి అర్థం. ఎందుకు పనికిరాని వాడని నేటి వ్యవహారంలో కల్గిన అర్థాపకర్ష.

దేవదాసి :- దేవాలయాల్లో పూజాకైంకర్యాలు జరిగేటప్పుడు నృత్యగాన క్రియలకి నియమింపబడ్డ భక్తురాలని ఒకప్పటి అర్థం. నేడిది 'వేశ్య'కు పర్యాయపదమైంది.

కళావంతులు :- నృత్యసంగీతాది కళల్ని నేర్చే స్త్రీలని అర్థంగల ఈ పదం ప్రస్తుతం 'భోగంవాళ్ళు' అనే అర్థన్యూనతలో స్థిరపడింది.

కైంకర్యం :- సేవ, పూజ అనే అర్థంగల యీ పదం నేడు 'అపహరించు, దొంగిలించు' అనే అర్థాపకర్షకు గురైంది.

5 **లక్ష్యార్థసిద్ధి** :- (Transfer of meaning) భాషలో సాధారణంగా ఆధారాదేయం, కార్యకారణం, అంగాంగి, ఏకదేశాది సంబంధంవల్ల లక్ష్యార్థాలు ఏర్పడి రూఢికెక్కడం సహజం. తెలుగులో లక్ష్యార్థసిద్ధి పొందిన పదాలు చాల ఉన్నాయి.

ఉదా :- ముష్టి :- 'పిడికిలి' అని దీని అర్థం. పిడికిట్లో ఆధేయమైన బియ్యానికి, ఇతర ధాన్యానికి వాచ్యమై 'బిచ్చం' అనే లక్ష్యార్థాన్ని ఇస్తోంది.

దాహం :- దహించుట, తపించుట అనే అర్థముండే ఈ పదానికి కార్యకారణ సంబంధంవల్ల 'దప్పి', పానీయం అనే అర్థమేర్పడింది.

సూది :- సూచికావాచియైన ఈ పదం సాదృశ్యాన్నిబట్టి డాక్టర్లు మందుని శరీరంలోకి ఎక్కించడానికి ఉపయోగించే పరికరానికి పేరుగా అర్థపరిణామమేర్పడింది.

మర్యాద :- సంస్కృతంలో ఈ పదానికి 'హద్దు' అని అర్థం. నన్నయ ఈ పదాన్ని 'నియమం, శాసనం' అనే అర్థాల్లో ఉపయోగించాడు. 'ఇది నా చేసిన మర్యాద'. ప్రస్తుత వ్యవహారంలో లక్ష్యార్థం 'మన్నన'గా రూపొందింది.

6. **సభ్యోక్తి** :- (Euphemism) సభలోగాని, కొందరి ఎదుటగాని ప్రత్యక్షంగా

వాచ్యం చేయకూడని పదాల అశుభార్థాల్ని, పరోక్షంగాగాని, కొత్తపదాల పరికల్పనవల్లగాని తెల్పే పద్ధతికి 'సభ్యోక్తి' అని పేరు. తెలుగులో 'మరణం' అశుభంగా భావించబడుతుంది. 'కీర్తిశేషులు, కాలమగు, దివంగతులు, పరమపదం పొందిన, శివైక్యమందిన' అనే పదాలు సభ్యోక్తులు.

అశ్లీలంగా భావింపబడే 'ఒంటికి, రెంటికి' అనే పదాల స్థానంలో 'దొడ్డికెళ్ళు, బయటికెళ్ళు, చెంబట్టికెళ్ళు, కాళ్ళకెళ్ళు' లాంటి పదాలు సభ్యోక్తులుగా రూఢికెక్కాయి.

7 లోకనిరుక్తి :- (Fork etymology) పదవ్యుత్పత్తిని స్పష్టంగా నిరూపించలేని పదాలకు సామాన్యులు ఒక అర్థాన్ని ఊహించడం, దానికి తగ్గట్టు ఆ పదాల్లోని ఒకటి రెండు వర్ణాల్నిమార్చడం 'లోకనిరుక్తి' అవుతుంది. తెలుగులో లోకనిరుక్తికి చెందిన పదాలు కొన్ని ఉన్నాయి.

ఉదా :- చందమామ :- దీనికి 'చంద్రమస్' అనే సంస్కృత మూలం. లక్ష్మీదేవికి సోదరుడు చంద్రుడు. ఈ భావాన్ని స్ఫురించేటట్లు తెలుగువారు 'చంద్రమస్' శబ్దాన్ని లోకనిరుక్తి దృష్టితో 'చందమామ' అన్నారు.

ఆకాశ రామన్న :- 'ఆకాశ నామన్' అసలుపదం. దానికి తెలుగులో రూపింపబడ్డపదం 'ఆకాశ రామన్న'. దీనికి అభావం అని అర్థం. ఆకాశ కుసుమం, ఆకాశ పంచాంగం. ఈ కోవలోనివే 'ఆకాశ నామన్ అనేపదానికి లోకులు కల్పించిన 'ఆకాశ రామన్న' అనేది లోకనిరుక్తికి ఉదాహరణ.

చక్రకేళి :- చక్రంగా గుండ్రంగా ఉండే అరటిపండని లోకనిరుక్తి. ఈ పదబంధంలో 'చక్ర' శబ్దం 'శర్కర' (చక్కెర) శబ్దభవం. అంతేగాని 'చక్ర' సంబంధిగాదు. కదళీశబ్దభవం 'కేళి' ప్రాకృతంలోని 'సక్కరాకయళి' అనేది తెలుగులో వర్ణవ్యత్యయంవల్ల 'చక్రకేళి' అయింది.

ఐదువ (రాలు) :- శబ్దరత్నాకరంలో ఈ పదానికి 'ఐదువన్నెలుగలది' (సుమంగళి) అనే అర్థం చెప్పబడింది. ఆ ఐదువన్నెలు - 1) మంగళసూత్రం 2) పసుపు 3) కుంకుమ 4) గాజులు 5) చెవ్వాకు అనేవి. ఈ నైఘంటికార్థం ఉన్న ఈ పదం లోకనిరుక్తికి సంబంధించింది. 'అ విధవా' అనే సంస్కృత శబ్దం నుండి 'ఐదువ' లేక 'అయిదవ' అనేవి ఏర్పడ్డాయి. అంతేగాని 'ఐదు' అనే సంఖ్యావాచకానికి, 'ఐదువ' పదానికి ఎలాంటి సంబంధం లేదు.





## 'విద్వాన్' కసిరెడ్డి వెంకటపతిరెడ్డి రచనలు

**'జ్ఞానబిందువు'**

(భగవద్గీతపై తాత్త్విక విమర్శనా గ్రంథం)

**పరమపురుషులు-2**

(ఆదిముని - వ్యాసుని జీవిత చరిత్ర)

**సాహితీ సౌరభాలు**

(కేంద్ర రాష్ట్ర పోటీ పరీక్షల పాఠ్యాంశాల

ఆధారంగా సాహిత్య వ్యాస సంపుటి పేపర్ - 2)

**తెలుగు భాషా వికాసం**

(పి.జి. & కేంద్ర, రాష్ట్రపోటీ పరీక్షల పాఠ్యాంశాల

ఆధారంగా పేపర్ - 1)

**'సాయిలీలా తరంగిణి'**

(పద్యకృతి)

**'రాజనర్తకి'**

(వైశాలి నగర వధువు (ఆమ్రపాలి) చరిత్ర)

**జీవన రేఖలు**

(వచన కవితా ఖండికలు)